ఆంధ్రప్రదేశ్ టూరిజం సమర్పిస్తున్న

# ఆంధ్రప్రదేశ్ యాత్రలు

ఆంధ్రప్రదేశ్ టూరిజం వారు మీ అభిరుచికి ఆసక్తికి అనుగుణంగా మూడు యాత్రా ప్రణాళికలను సమర్పిస్తున్నారు. వీటిలో తెలుగు సంస్కృతి, నాగరికతా వైశిష్ట్యం, తీర్థయాత్రా సందర్శనం ఆంధ్రప్రదేశ్ రమణీయ ప్రకృతి పరిచయం వరుసగా చేయబడుతున్నాయి

**పుణ్యక్షేత్ర తీర్థయాత్ర :** ఇది ఏడు రోజుల యాత్రమాల ఇందులో హైదరాబాదు నుండి బయలుదేరి భద్రాచలం, సింహాచలం అన్నవరం, విజయవాడ, తిరుపతి శ్రీశైలం, కంచి మొదలయిన ప్రఖ్యాత పుణ్యక్షేత్ర సందర్శనం చేయగలరు ఈ యాత్ర జనవరి 1987 నుండి ప్రతి నెల 5వ తేదీన మొదలవును

**యాత్ర ఖర్చు** ప్రతి వ్యక్తికి రూ 525 – (కేవలం ప్రయాణ ఖర్చులు మాత్రమే )

**ఉత్తర ఆంధ్రప్రదేశ్ యాత్ర :** ప్రకృతిలో మనోహర ప్రదేశాలయిన అరకులోయలు, స్వర్ణ కాంతులీనే ఇసుక తిన్నెలు గల విశాఖ సముద్ర తీరం శ్రీసత్యనారాయణ విరాజిత అన్నవరం, విశ్వ విఖ్యాత నాగార్జున సాగర్, బౌద్ధ సంస్కృతీ కేంద్రమైన నాగార్జున కొండ ఉరవళ్ళు త్రొక్కే ప్రకృతి శక్తిని మానవోపయోగంగా చేసే సీలేరు హైడ్రో ఎలక్ట్రిక్ డామ్, కాకతీయ సంస్కృతీ కేంద్రం వరంగల్, పవిత్ర గోదావరీ తీరాన వెలసిన భద్రాచలం, ఆంధ్ర చక్రవర్తి రాజ రాజ నరేంద్రుని రాజధాని రాజమండ్రి, తెలుగు సంస్కృతికి పట్టు కొమ్మ అయిన విజయవాడ, అమరావతి మొదలయిన ప్రదేశాల సంస్కృతీ దర్శనం - ఏడు రోజుల యాత్ర ప్రతి నెల 15వ తేదీన మొదలవును

**యాత్ర ఖర్చు** ప్రతి వ్యక్తికి రూ 325 – (కేవలం ప్రయాణ ఖర్చులు మాత్రమే)

**రాయలసీమ యాత్ర :** ఇది కేవలం ఆరు రోజుల యాత్ర, మానవ ప్రభావం అంతగా సోకని రమణీయ పర్వత మాల అయిన హార్స్‌లీ కొండలు, శ్రీవేంకటేశ్వర క్షేత్రం తిరుపతి, లేపాక్షి మంత్రాలయం, ఆధునిక దేవాలయం – ప్రఖ్యాతమైన మానవ నిర్మిత ఆనకట్ట నాగార్జున సాగర్ బౌద్ధ సంస్కృతీ వ్యాప్తిక ప్రపంచ కేంద్రమైన నాగార్జున కొండ, అందలి ప్రాచీన వస్తు ప్రదర్శనశాల – మరియు పుట్టపర్తి శ్రీసత్యసాయిబాబా సన్నిధికి ఈ యాత్ర జనవరి 1987 నుండి ప్రతి నెల 25వ తేదీన మొదలవును

**యాత్ర ఖర్చు** ప్రతి వ్యక్తికి రూ 300/– (కేవలం ప్రయాణ ఖర్చులు మాత్రమే)

**మీ ప్రత్యేక యాత్రా ప్రణాళికలు కూడా ఏర్పాటు చేయబడును గ్రూప్ బుకింగులకు ప్రత్యేక సదుపాయం కలదు**

వివరములకు సంప్రదించండి


**ఆంధ్రప్రదేశ్ టూరిజం**
గగన్ విహార్, ఎం జె రోడ్,
హైదరాబాద్-500 001
ఫోన్ 556493, 70087, 77192
233384, 233385






## సీరియల్స్

శోభన ముఖపత్ర: పత్రిక' ఆకర్షణీయంగా ఉంది. "ఆరోహణ" సీరియల్‌లో చక్రవర్తి ప్రొడ్యూసర్ పార్థసారథి ద్వారా సినీ రంగంలోకి ఒక మెట్టు ఎక్కాడని ఆశిస్తున్నాను. శైల కుమార్ శైలి చాలా బావుంది. "ఆశయం" సీరియల్‌లో హత్యా రాజకీయాలకి ప్రతీక రంగా అనుకోవచ్చు. రాజేష్ హత్య గావ టం చాలా బాధవేసింది.

—సాయిని రాజు, నేలకొండపల్లి

★ ★ ★

నటి శోభన ముఖ చిత్రముతో వెలువడిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" చాల మనోహరంగా యున్నది సీరియల్ "ఆరోహణ" చాలా ఆసక్తికరంగా సాగుతున్నది చక్రవర్తి మద్రాసులో పడుతున్న బాధలు మా హృధయం ద్రవించేటట్టుగా యున్నవి. "ఆశయం' ప్రారంభ సంచిక నుండే ఆకట్టుకున్నది

—బి వి రమణ, ఎ శ్రీనివాస్, రాయగడ (ఒరిస్సా)

★ ★ ★

'6-12 ఫిబ్రవరి 87' సంచికలో ఒకటి ఒకటీ మూడు సీరియల్‌లో (68 పేజీలో 4వ పేరా) రచయితగారు రామనాథం గారికి నేను ఫామిలీ ఫిజీషియన్ కావొచ్చు' అని ఉపయోగించారు మాజిక్ చేసే వాళ్ళని మెజీషియన్ అన్నట్టు ఫిజీషియన్ అనరు ఫిజిస్ట్ అంటారని ఒక పుస్తకంలో నేను చూశాను రచయిత్రి గమనించ గోరుతాను సీరియల్ నడిచే తీరు చాలా ఆసక్తిగా వుంది

—గీతాలక్ష్మి గెల్లి, అమృతలూరు (గుంటూరు)

★ ★ ★

అందాల, అభిమాన తార 'శోభన' ముఖ చిత్రం చాల వెరైటీగా వుంది తేజోవతిగారి 'ఒకటి ఒకటీ మూడు' సీరియల్ మాకు నచ్చినది

—గోపిశెట్టి నిర్మల, అనూరాధ, రవి, దాస్‌నగర్, హౌరా

## కథలు

నటి శోభన ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో తల్లి తండ్రులూ! మారండి కథ చాలా బాగుంది ఆ కథలో వరకట్న నిషేధంపై యువతకు ఇచ్చిన సందేశం చాలా బాగుంది

—కె ఎన్ వి రవికుమార్, మైలవరం

★ ★ ★

నటి శోభన ముఖచిత్రంతో వెలువడిన పత్రిక బాగుంది 'గురుదేవో భవ' కథ నన్ను ఆకట్టుకుంది

## ఉత్తరాలు

యిందులో పరంధామయ్య పాత్ర సూపరు

—టి. శోభన్‌బాబు, జి కృష్ణంరాజు, పి. దోర్నాల

★ ★ ★

క్షణం క్షణం భయం భయం, తల్లి దండ్రులు మారండి కథలు చాలా బాగున్నాయి.

—గరిగ నర్సయ్య, రామకృష్ణాపూర్

★ ★ ★

'తల్లి దండ్రులూ మారండి' కథ ద్వారా తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళనే స్వభావం కల తల్లి దండ్రులకు చక్కటి సందేశమిచ్చిన ఉమర్‌గార్కి ధన్యవాదాలు

—ఆర్. కామేశ్వరరావు, బాపట్ల

★ ★ ★

నటి "శోభన ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో క్షణం క్షణం భయం భయం కథ వాస్తవానికి దగ్గరగా ఉంది

—శ్రీపాద శ్రీనివాస్, బొబ్బిలి

★ ★ ★

13-19 ఫిబ్రవరి 87 గల మన వారపత్రిక ముఖచిత్రం శోభన చూడ్డానికి అందాల రాశిలా వుంది. "గురుదేవో భవ' చాలా బాగుంది విద్యార్థి లోకానికి ఒక కనువిప్పు రచయిత తననే కథలో నాయకునిగా ఎన్నుకొని దానిని ఒక కథగా అల్లి పాఠకులకు అందివ్వడం ఒక విశేషం

గురుదేవులు తన విద్యార్థి తప్పిదాన్ని శాంత స్వభావంతో మన్నించి చివరికి తన జ్ఞాన నేత్రాలను అంకిత మివ్వడం చాలా హర్షించదగినదిగా వుంది

నేటి సమాజంలో పరంధామయ్యలాటి గురువులు చాలా అరుదు. మరియు చాలా అవసరం కూడాను.

—షేక్ మస్తాను, గాలి బీబీ, ముమ్మలనేనివారిపాలెం,. రేపల్లె

( 74 వ పేజీ చూడండి)

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

13-19 మార్చి '87
శ్రీ అక్షయ నామ సం ఫాల్గుణ శు. త్రయోదశి.
సంపుటము 79 : సంచిక 28

ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (వర్కింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక



### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

## న్యూఢిల్లీ లేఖ



# ఏ నిమిషానికి ఏమి జరుగుతుందో......

డా. జయదుబాషి

బొంబాయిలో రెండు రోజులు గడపడం ఢిల్లీలో రెండు నెలలు గడపడంతో సమానం అది ఎంత వేగం ఉన్న నగరమంటే, అక్కడ రాజకీయ వేత్తల నుంచి భవనాల కాపలాదార్ల వరకు ప్రతి ఒక్కరూ దీపం ఉండగానే ఇల్లు చక్క బెట్టుకునేటటువంటి వేగంతో పని చేస్తుంటారు నేను బస చేసిన హోటల్ వర్ధమాన టి వి తారలకు మోడల్స్‌కు దాదాపు రహస్య స్థావరం లాగా కనిపించింది మజర్‌ఖాన్‌తో మధ్యాహ్న భోజనం, జీనత్ అమన్‌తో రాత్రి భోజనం, సతీష్‌షాతో టీ– నిజంగా మీరు వాళ్ళతో కలిసి కూచుంటారనికాదు కానీ వాళ్ళు తింటున్న భోజన శాలలోనే మీకు భోజన పానీయాలు దొరుకుతాయి వాళ్ళు వాడే లిఫ్టులలోనే మీరూ పైకీ కిందకీ ఎక్కి దిగుతారు ఈతను నేనెంతగా అసహ్యించుకున్నప్పటికి, వాళ్ళు ఈదులాడే ఈతకొలనులోనే మీరూ ఈదులాడుతారు

నాకు ఒక ప్రముఖ మరాఠీ రచయిత అతిథిగా ఉన్నారు మేమిద్దరం కలిసున్న లిఫ్టులో సతీష్‌షాతో సహా మరో అరడజను మంది ఉన్నారు ప్రతి ఒక్కరూ సతీష్‌షావైపే, బహుశా ఆయన నోటివైపే చూస్తూ, టి వి మీద మీరు వినేలాంటి మాటలనే వినేందుకు సిద్ధంగా ఉన్నారు ఆయన ఏమీ మాట్లాడలేదు రాజీవ్‌గాంధి ట్రేడ్‌మార్క్ అయిన స్థిరమైన తీక్షణపు చిరునవ్వుతో సూటిగా పైకి చూస్తూ ఉండిపోయాడు మా ఇద్దర్నీ ఎవరూ గమనించలేదు వారిలో కనీసం ఇద్దరి దగ్గర పత్రికలున్నాయి ఆ పత్రికల్లో మా ఫోటోలతో సహా మా వ్యాసాలున్నాయి సినిమా తారలతో పోటీ పడవలసి వచ్చినప్పుడు– ఆ సినిమా తారలు ఫాన్‌ట, నూడుల్స్ ప్రకటనల ప్రచారం చేసే వాళ్ళే అయినాసరే– రచయితలు 'తీసికట్టే'! అటువంటి నగరం బొంబాయి

బొంబాయికి మరో రెండు విషయాలపట్ల కూడా శ్రద్ధ అతిగా ఉంటుంది డబ్బు, రాజకీయాలు ఐతే ఢిల్లీవాళ్ళం చేసినట్టుగా వాళ్ళు ఈ రెండిటినీ విడదీసి చర్చించరు వాళ్ళు ఏమని నమ్ముతారంటే– వాళ్ళది తప్పని కూడా మనం అనలేము– రాజకీయాలు ఎక్కడున్నాయో డబ్బు అక్కడుంటుంది, డబ్బెక్కడుంటుందో రాజకీయాలు అక్కడుంటాయి ఆర్థికశాఖ మంత్రిగా విశ్వనాద్ ప్రతాప్‌సింగ్ పదవికి ఉద్వాసన జరగడం అమితాబ్‌బచ్చన్‌గారి లోపాయకారి రాజకీయ వ్యవహారమనే కథ బొంబాయి వీధుల్లో ప్రచారం లోకి రానేవచ్చింది నగరంలోని ప్రతి టాక్సీ డ్రైవర్‌కీ సింగ్‌కు ఎందుకు ఉద్వాసన చెప్పారో, రక్షణ శాఖకు ఎలా మార్చారో, రాజీవ్‌గాంధీతో బచ్చన్ ఏమన్నారో, సోనియాతో జయ ఏమన్నదో, చివరికి రాజాసాబ్‌తో రాజీవ్ ఏమన్నారో తెలుసు అదంతా ఎలా జరిగిందో ఎక్కడ జరిగిందో (అండమాన్స్‌లో, అనుకోండి)– మాత్రమేగాక ఇప్పుడు ఏం జరగనున్నదో కూడా వాళ్ళకు తెలుసు అదంతా జరుగుతున్నప్పుడు వాళ్ళు అక్కడే ఉన్నట్టు చెపుతారు ఒకాయనయితే నమ్మకమైన వ్యక్తి నోటి నుండి తాను అది విన్నానని చెప్పాడు జయ కేశాలంకరణ నిపుణురాలి బావకు ఆ వ్యక్తి వేలు విడిచిన బంధువట ఆ నిపుణురాలికో, లేదా ఆవిడ బంధువుకో అమితాబ్ బచ్చన్ స్విస్ బ్యాంకు ఖాతా గురించి, ఆయన తనతో ఎంత డబ్బు తీసుకు పోయారనే దాని గురించి అది ఎవరిదనే దాని గురించీ, తెలుసు వాళ్ళు తెరమీద సినిమా తారలు చెప్పిన మాటలు ఎట్లా నమ్ముతారో తాము చెప్పే విషయాలు కూడా నిజంగా అట్లాగే నమ్ముతారు

ఇక రాజకీయాలు చూద్దాం శరద్ పవార్ మహారాష్ట్రకు ఒకప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్నప్పటికీ ఆయన ఖచ్చితంగా బొంబాయి నివాసి కారు ఆ మాటకొస్తే ముఖ్యమంత్రులెవరూ బొంబాయి మనుషులుకారు బొంబాయి డబ్బు సమకూరుస్తుంది మరాఠా వర్గం మంత్రులను సమకూరుస్తుంది పైపైన చూస్తే బొంబాయి పెట్టుబడి దారులకూ, ఢిల్లీ రాజకీయ వేత్తలకూ సన్నిహితంగా ఉన్న మొదటి కాంగ్రెస్ రాజకీయ వేత్త శరద్ పవారేమో అనిపిస్తుంది ఏదేమైనా, ప్రతివిషయమూ పవార్‌కు అనుకూలంగా సాగడం లేదని ఢిల్లీ నుంచి వార్తలు రావడం మొదలయ్యే వరకూ బొంబాయి వాలాలు ఈ విషయం నమ్మారు శరద్‌పవార్, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షురాలయిన ప్రభారావు ఈ మధ్య ప్రధానితో సమావేశం కోసం ఢిల్లీ వెళ్ళి ఆయన కలవక పోవడం వల్ల వెనక్కి రావలసి వచ్చిందని వదంతి ఒకటి వ్యాపిస్తూ ఉన్నది ఆయనకేమో శంకర్ రావు చవాన్‌ను కలవడానికి చాలినంత వ్యవధి దొరికింది అంతకంటే ఘోరం, ప్రస్తుతం అధికారిక పరిశీలకుడు నావల్ కిషోర్ అయినా రాష్ట్ర వ్యవహారాలలో ఎక్కువ జోక్యం చేసుకుంటున్న రాజేష్ పైలట్ ద్వారానే పవార్ వెళ్ళవలసి వచ్చింది

ఎంత సిగ్గు చేటు, తనంతట తనే ఒక పార్టీ అధిపతిగా ఉండి, ఆదేశాలిస్తూ ఉండిన వ్యక్తి, తెల్లటోపీ చేతోత్తు పట్టుకుని ప్రధాన అధిపతి దర్శనం కోసం ఢిల్లీలో వేచి ఉండవలసి రావడం ఎంత సిగ్గుచేటు అన్నాడు నా డ్రైవర్

ఎవరైనా అత్యాశకు పోయి ఆత్మ గౌరవాన్ని వదులుకున్నప్పుడు జరిగేదదే అని నేనన్నాను

పవార్, చవాన్ ల మధ్య సంబంధాలు బాగా చెడిపోయాయని, శాంతి స్థాపన కోసం రాజీవ్ ఒక



ఇదేమిటో వచ్చేవారం ఇక్కడే చూద్దాం –

మూడో వ్యక్తిని తీసుకు రాక తప్పదని చాలామంది ఇప్పుడు నమ్ముతున్నారు ఐనా, నిద్ర పోతున్న కుక్కల్ని వదిలేయడమే మంచిదన్న సూత్రం పైన, ఎన్నికలు అయిపోయే వరకు ఏ మార్పు జరగక పోవచ్చు. అట్లాగే, మన పాత మిత్రుడు అబ్దుల్ రహమాన్ అంతులే గురించి కూడా వదంతులు వినిపిస్తున్నాయి ఆయన ఇప్పుడు ఇదివరకు కంటే ఎక్కువ ధైర్యం తెచ్చుకుని, నెహ్రూ కుటుంబంతో తనకు గతంలోనూ, ప్రస్తుతం కూడా ఎంత సన్నిహిత సంబంధాలున్నాయో వెల్లడించే ఇంటర్వ్యూలు ఇస్తున్నారు సరైన కాంగ్రెస్ సంప్రదాయంలోనే పవార్, చవాన్, అంతులే తదితరులు సంక్షోభాన్ని రగలనిస్తున్నారు ఇది ఢిల్లీ దొరలను అనంతంగా సంతోష పెడుతూ ఉండాలి ప్రతిదీ ఒక కొలిక్కి వచ్చి, శాంతి భద్రతలు ఏర్పడి, ఘర్షణలు సమసి పోతేనే దొరలకు అసంతృప్తి

పంజాబ్ నుంచి ఎంతదూరంగా పోతే దాని గురించి అంత తక్కువ ఆలోచిస్తామేమో నని నాకు ఎప్పుడూ ఒక అభిప్రాయం ఉండేది కాని అది నిజం కాదు. పంజాబ్ ఇవాళ ప్రధాన జాతీయ సమస్య, దాని ముందు మిగతా వన్నీ వెలవెల బోతాయి అన్ని వార్తా పత్రికలు, మరాఠీ, గుజరాతీ, సింధీ-పంజాబ్ వార్తలను ప్రముఖంగా వేస్తాయి హోటళ్ళలో, కార్యాలయాలలో, వీధుల్లో, ఫాన్సీ దుకాణాలలో ఆ విషయం ప్రస్తావనకు రాగానే నిశ్శబ్దం అలముకుంటుంది అది ఇంకెంత మాత్రమూ

# న్యూఢిల్లీ లేఖ

పంజాబ్ సమస్యకానే కాదు, ఈ గందరగోళం నుంచి తప్పించుకోవడానికి రాష్ట్రాన్ని ఖలిస్తాన్‌ల చేతికి ఇచ్చేస్తే సరిపోతుందని కొందరు భావిస్తున్నప్పటికీ అది ఒక జాతీయ సమస్య నిజానికి ఈ మాట అంటున్నది కొందరు కూడా కాదు. నేను కలిసిన ఒక వ్యక్తి, ఒకప్పుడు మంచిదశ అనుభవించిన వారపత్రికకు సంపాదకత్వం వహిస్తున్న ఒక జర్నలిస్టు బొంబాయిలో మీకు విచిత్రమైన మూస మనుషులు ఎదురవుతారు తీవ్రమైన పోటీలో వెనుక బడి పోయిన వాళ్ళు, లేదా మరో రకంగా నిరుత్సాహానికి గురయిన వాళ్ళు, దాన్నంతా దేశం




మీద తీర్చుకోదలచు కుంటారు మీకు అలాంటి వాళ్ళు అన్ని వర్గాల లోనూ ఎదురవుతారు ముఖ్యంగా మైనారిటీలు అని చెప్పబడే వర్గంలో కనబడుతారు కాని మేధో సంపన్నులయిన, అభిజ్ఞవర్గాలకు చెందిన వ్యక్తులు అలా మాట్లాడడం బాధాకరంగా ఉంటుంది ఇటు వంటి వ్యక్తుల సంఖ్య గతంలో ఉన్నంత ఎక్కువ లేనప్పటికీ మనకు దారుణమైన శత్రువులం మనమే

నేను హెచ్చరికలు చేస్తున్నట్టు ధ్వనించ దలచుకోలేదు కాని విషయాలు అదుపు తప్పి పోయాయనో, అదుపు తప్పి పోతున్నాయనో ఒక సాధారణ బావం వ్యాపించి ఉన్నది ఒక వ్యక్తి అన్నట్టు ఏదయినా జరగవచ్చుననే బావం కలుగుతున్నది ఇందిరాగాంధీ తూటాల వర్షంలో కుప్పకూలి పోతుందని, కొన్నేళ్ళక్రితం ఓ చిన్న విమానాన్ని ఢిల్లీ నుంచి జైపూర్‌కూ, మళ్ళీ వెనుకకూ నడుపుతూ ఉండే మనిషి చేతికి దేశం అప్పగించబడుతుందని ఎవరు మాత్రం అనుకున్నారు? అని ఆయన అన్నాడు ఇటువంటి ప్రశ్నలు ఇప్పుడు దేశమంతటా అడగబడుతున్నాయి, బొంబాయి వంటి నగరాలలో మరింత ఎక్కువగా అడగబడుతున్నాయి నగరం మిద్యా తళతళల్ని అతికించుకొవచ్చు- టి వి తారలు, మోడల్స్ లాగ - కాని నిజానికి దాని మనఃస్థితి భయంతో, ఆందోళనతో నిండి ఉంది ఇది ఎటువంటి బయమంటే నేను దీన్ని ఎమర్జెన్సీ తర్వాత ఎక్కడా చూడలేదు చరిత్ర తనను తాను పునరావృతం చేసుకోనున్నదా? □



# ఎయిడ్స్
# దీనినుంచి రక్షించుకోవటం ఎలాగ ?

**ఎయిడ్స్ చాలా ప్రమాదకరమైన వ్యాధి. ఇప్పటి వరకు దీనికి తెలుసున్న చికిత్స అంటూ ఏమీ లేకపోవడంతో, అనేక వదంతులు ప్రచారంలో ఉన్నాయి. అయితే, దీనిని గూర్చిన కొన్ని నిజాలను అర్థం చేసుకున్నప్పుడు, దీని నుండి రక్షించుకోవడం ఏమంత కష్టం కాదు.**

## ఎయిడ్స్ అంటే ఏమిటి ?

ఎక్వాయిర్డ్ ఇమ్యూన్-డెఫిషియన్సీ సిండ్రోమును సంక్షిప్తంగా ఎయిడ్స్ అని అంటారు. శరీరపు సహజ రక్షణా లక్షణాలను నాశనం చేసే వైరస్ ద్వారా ఈ వ్యాధి వస్తుంది.

## ఇది ఏ విధంగా వ్యాపిస్తుంది ?

ఎయిడ్స్ వ్యాధి అంటుకునేందుకు అవకాశం గల ఒకే ఒక మార్గం, ఈ వ్యాధి ఉన్న వ్యక్తి యొక్క రక్తం లేక వీర్యం తన లేక ఆమె శరీరం లోనికి ప్రవేశించటం.

ఈ వ్యాధి ఉన్న వ్యక్తితో లైంగిక సంపర్కం పెట్టుకొనడం ద్వారా అనేక మందికి ఎయిడ్స్ వ్యాధి వస్తూన్నది. మాదక ద్రవ్యాలకు అలవాటు పడిన వారి మధ్య సామాన్యంగా సంభవిస్తున్నట్లుగా, ఈ వ్యాధి ఉన్న వ్యక్తికి చేసిన ఇంజెక్షను సూది ద్వారా ఇంజక్షను చేయించుకోవటం వలన తక్కిన వారు ఈ వ్యాధికి లోనవుతున్నారు. కొన్ని అరుదైన సందర్భాలలో మాత్రమే, ఈ వ్యాధి ఉన్న వ్యక్తి రక్తాన్ని ఎక్కించటం, దీని వ్యాప్తికి కారణ మవుతున్నది.

వైరస్ ఉన్న ప్రతి వ్యక్తికీ ఎయిడ్స్ వ్యాధి రాదు. నిజానికి వారిలో ఎక్కువ మందికి ఈ వ్యాధి ఉండదు. అయితే ఆ వైరస్ ఉన్న వ్యక్తి మరొకరికి, వారెంత ఆరోగ్యవంతులైనప్పటికీ, దీనిని అంటించవచ్చును.

## వీటి నుండి మీకు ఎయిడ్స్ వ్యాధి అంటుకోదు

—కరచాలనం, స్పర్శించటం లేక ఆలింగనం వంటి సాంఘిక ఆచారాలు
—ఈత కొలనులు, హోటళ్ళు, తదితర జనసమ్మర్ద ప్రదేశాలు
—దగ్గు, తుమ్ములు లేదా ఉమ్మి
—వస్త్రాలు
—టాయిలెట్ సీట్లు, తలుపు పిడులు, ఆహారం, గ్లాసులు, కప్పులు

## వీటిని చేస్తూన్నప్పుడు ఎయిడ్స్ వ్యాధి అంటుకోదు

రక్తదానం
డాక్టరు, దంత వైద్యుడు లేక ఇతర ఆరోగ్య కార్యకర్తల నుంచి ఇంజక్షన్లు లేక ఏ ఇతర చికిత్సను చేసుకుంటూన్నప్పుడు

## మీరు చేయకూడనివి ఏమిటి ?

—అపరిచితులతో లైంగిక సంపర్కం పెట్టుకోవటం. ఇది చాలా ప్రమాదకరమైనది. అపరిచిత వ్యక్తి ఈ వ్యాధి పీడితుడని మీకు తెలియక పోవచ్చు.
—గుద మైథునము—ఇది చాల ప్రమాదకరమైనది. చేయకూడని పని.
—ఎక్కువ మందితో లైంగిక సంపర్కం పెట్టుకోవటం మరింత ప్రమాదకరం.
—మాదక ద్రవ్యాల అలవాటున్న వారితో ఇంజెక్షను సూదిని పంచుకోవటం.

## గుర్తుంచుకోండి

ఎయిడ్స్ సాహసించ వలసిన వ్యాధి కాదు. దీనికి చికిత్స లేదు. ప్రజల ప్రవర్తన పైననే ఎయిడ్స్‌ను అదుపులో పెట్టటం ఆధారపడి ఉంటుంది.

## అదనపు సమాచారానికై

మీరు అసిస్టెంటు డైరెక్టరు జనరల్ (ఎయిడ్స్), డైరెక్టరేట్ జనరల్ ఆఫ్ హెల్త్ సర్వీసెస్, నిర్మాణ్ భవన్, న్యూ ఢిల్లీ-110011 వారికి వ్రాయండి.

**ఎయిడ్స్‌కు చికిత్స అంటూ లేకపోవచ్చు.**

**అయితే అది రాకుండా మీరు కాపాడుకోవచ్చు**



జారీ చేసినవారు : సెంట్రల్ హెల్త్ ఎడ్యుకేషన్ బ్యూరో
డిజిహెచ్ఎస్, కోట్లా రోడ్, న్యూ ఢిల్లీ-110002

davp 86/302

సీరియల్

# ప్రతిస్పందన

'అన్నపూర్ణ'



(గత సంచిక తరువాయి)

సిటీ బస్ దిగి చరచర నడిచి వెళ్తున్న రవికిరణ్‌కు తమ వీధి చివరన సాకేత కనిపించింది

ఆమె కూడా ఇంటికే వెళ్తోంది కాకపోతే ఏవో ఆలోచనల మధ్య చాలా నిదానంగా అడుగులు వేస్తోంది

'హల్లో, సాకేత గారూ! ఎక్కడికి వెళ్ళొస్తున్నారు? - రవికిరణ్ చొరవ తీసుకున్నాడు

"షాపింగ్‌కు వెళ్ళి వస్తున్నాను. మరి మీరు?"

మా ఫ్రెండ్ ఒకడు ఈ వూరు వదిలి వెళ్తున్నాడు వాడికి సెండాఫ్ ఇచ్చి వస్తున్నాను

'అలాగా'

"లక్కీఫెలో! నాతో పాటే చదివాడు గ్రాడ్యుయేషన్ పూర్తి చేశాడు తంటాలు పడి ఉద్యోగం కూడా సంపాయించేశాడండీ'

మరి మీ డిగ్రీ ఎప్పుడు పూర్తవుతుంది?'

" పరీక్షలు రాశాను కదా?'

ఇక రిజల్ట్స్ దైవాదీనం అంటారు "

సాకేత సన్నగా నవ్వింది రవికిరణ్‌కు పౌరుషం వచ్చింది

మీరు, మా చెల్లాయి కూడా రాశారుగా డిగ్రీ పరీక్షలు? పేపర్లో పరీక్షా ఫలితాలు రానీయండి చూద్దాం అన్నాడు ధీమాగా

సాకేత మరి రెట్టించలేదు మళ్ళీ హుషారు తెచ్చుకున్నాడు రవికిరణ్

"మీరు ఈ మధ్య తరచూ మా యింటికి రావటం లేదు?"

"ఎందుకు రావటం లేదు?"

వస్తూనే వున్నారనుకోండి అయినా ఏమిటో నాకలా అనిపిస్తోంది "

మాట్లాడలేదు సాకేత

సాకేత గారూ '

' చెప్పండి?

> జరిగిన కథ-1 : సౌందర్య, సాకేతలతో పాటు సినిమాకు వెళ్ళిన సౌందర్య అన్నయ్య రవికిరణ్ సాకేతతో సాన్నిహిత్యం పొందాలని ప్రయత్నిస్తుంటాడు రచయిత సమాజ సత్యం అభిమానిగా సౌందర్య ఆయనకు రాసిన ఉత్తరానికి జవాబు వస్తుంది.

'నేను చాలా రోజులుగా మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను ఏదైనా ఒకరోజు - అదే, మీకు అనుకూలమైన రోజు . ఏదో చెబితే ఆ రోజు నేను మీతో మనసు విప్పి మాట్లాడతాను. '

రవికిరణ్ మాట్లాడుతూండగానే సాకేత వాళ్ళ యిల్లు వచ్చింది "ఆలోచిద్దాంలే గాని మీరు వెళ్ళండి అని తను లోపలికి వెళ్ళింది ఆమె 'తన మాటలను తిరస్కరించకుండా ఆలోచిద్దాం అంది సాకేత అంతే చాలు' - తృప్తిగా ముందుకు సాగిపోయాడు రవికిరణ్ సాకేత వాళ్ళ ఇంటికి పది పదిహేను ఇళ్ళ అవతల వుంది సౌందర్య వాళ్ళ యిల్లు

రవికిరణ్‌ను ఎలా అర్థం చేసుకోవాలో బోధపడటం లేదు సాకేతకు ఈ మధ్య అతడి చూపులు, చేష్టలు మారిపోయాయి. అంతకుముందు తాను సౌందర్య గురించి వెళ్తే పెద్దగా పట్టించుకునే వాడు కాదు. తమ మాటల మధ్యన అంతగా కలుగ చేసుకొనే వాడూ కాదు

ఇప్పుడు అలా కాదు వాళ్ళ యింటికి తాను వెళ్తే చాలు పని వున్నా, లేకపోయినా గదిలోంచి హాలులోకి, హాలులోంచి గదిలోకి పదిసార్లు తిరుగుతాడు సౌందర్య, తాను ఏం మాట్లాడుకుంటున్నా కలుగజేసుకుంటాడు. పైపెచ్చు సందు చిక్కినప్పుడల్లా ఆర్తిగా తన వైపే చూస్తుంటాడు వికారాలు ప్రదర్శిస్తుంటాడు

అమాయకుడో, తెలివి కలవాడో అర్థంకాని వ్యక్తి రవికిరణ్ కొన్ని సార్లు గొప్ప మేధావిలా మాట్లాడతాడు మరికొన్ని సార్లు బుద్ధి హీనంగా ప్రవర్తిస్తాడు మొత్తానికి నాలుగు సంవత్సరాలుగా డిగ్రీ పూర్తి చేయలేకపోతున్నాడు

కేవలం రవికిరణ్ వికారపు చేష్టలు భరించలేకే సౌందర్యను గురించి వాళ్ళ యింటికి వెళ్ళడానికి సంశయించాల్సొస్తోంది సాకేత అయినా స్నేహంవల్ల తరచూ వెళ్తూనే వుంది సౌందర్య కూడా అప్పుడప్పుడు సాకేత వాళ్ళ యింటికి వస్తూనే వుంటుంది

"ఇంత కాలం తాను రవికిరణ్ విషయంలో పట్టీ పట్టనట్లు వూరుకుంది ఇప్పుడు అతడి మాటలు - ధోరణి చూశాక తన మీదేమో అనవసరపు ఆశలు పెంచుకుంటున్నట్లు కనిపిస్తున్నాడు అలా జరగడానికి వీలులేదు మొగ్గ దశలోనే - దాన్ని త్రుంచి వేయాలి విషయమేమిటో సౌందర్యకు చెప్పి రవికిరణ్‌కు యథార్థం బోధపడేలా చేయాలి "

—అలా నిర్ణయానికి వచ్చేసింది సాకేత ఆనాడే

* * * * * * * * * * * *



ఆఫీసు నుంచి సాయంకాలం ఇంటికి వచ్చిన నిరంజనరావు ముఖం కళకళలాడుతూ కనిపించింది ఆ వేళ రోజూ అయితే వెలవెలబోతూ నీరసంగా కనిపించేవాడు

ఆయన సరాసరి వంట చేస్తున్న భార్య దగ్గిరికి వెళ్ళి అక్కడే పీట వాల్చుకొని గోడకు చేరగిలబడి కూర్చున్నాడు

'ఏమిటండోయ్ కాలానికి విపరీతం! పెందరాళే ఇంటికి వచ్చారు లోపలికి రాగానే సరాసరి వచ్చి నా దగ్గిర పీరం వేశారు?' – అంది భార్య రేణుకమ్మ

'ఏం లేదోయ్ ఈ వేళ మా సత్తెమ్మ అక్క దగ్గిర్నించీ వుత్తరం వచ్చింది వాళ్ళబ్బాయ్ అనిరుద్ధ్‌కు ఈ వూరు ట్రాన్స్‌ఫర్ అయిందిట రెండు మూడు రోజుల్లో అతడు వస్తాడు. మనకు దగ్గిరలోనే ఓ చిన్న ఇల్లు అద్దెకు చూసి పెట్టమని రాసింది " అని చెప్పాడు విషయం

'కొన్ని సంవత్సరాల తర్వాత అవసరపడే సరికి మీరు భలే గుర్తు వచ్చారే మీ సత్తెమ్మక్కకు?' – అంది రేణుకమ్మ కొంచెం ఎత్తిపొడుపు ధోరణిలో

'దాందే ముంది లేవోయ్ ఒక్క కడుపున పుట్టిన అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళ మధ్యనే సరైన అవగాహన వుండి చావటం లేదు ఈ రోజుల్లో అలాంటిది పెద్దమ్మ కూతురైన సత్తెమ్మక్క నన్ను గుర్తు పెట్టుకొని 'తమ్ముడు' అంటూ వుత్తరం అయినా వ్రాసింది చాలదేమిటి? – తనని తాను సమర్థించుకున్నాడు నిరంజనరావు

"మీరు వట్టి అల్ప సంతోషులండీ."

## ప్రతిస్పందన

"నేను మొదట్నుంచీ అల్ప సంతోషినే ఈ ముక్క నువ్వొక్కదానివే కాదు చాలా మంది అన్నారు కానీ, ప్రస్తుతానికి అనిరుధ్‌ను అందుబాటులో అట్టే పెట్టుకోవటంలో కొంత స్వార్థం వుంది నాకు'

"అంటే? మీ వుద్దేశ్యం నాకు అర్థమైంది లెండి కొడుకు వుద్యోగస్థుడు కట్నకానుకలు ఇచ్చుకోలేం మనం అలాంటి మనమ్మాయిని తన యింటి కోడలిగా ఎలా స్వీకరిస్తుందండీ మీ సత్తెమ్మక్క?'

"ప్రయత్నకర్తలం మనం మిగిలింది దైవ నిర్ణయం సరేగాని పిల్లలెవరూ కనిపించరేం ఇంట్లో? – అంటూ కూర్చున్న చోటు నుంచీ లేచాడు నిరంజనరావు

"పెద్దమ్మాయి వాళ్ళ ఫ్రెండ్ సౌందర్య వాళ్ళ యింటికి వెళ్ళింది మిగిలిన వాళ్ళు పక్కింట్లో టీ వీ చూస్తున్నారు' చెప్పింది రేణుకమ్మ

సరే వుంటే నా ముఖాన కాస్త కాఫీ పొయ్యి' అని డ్రస్ మార్చుకొని భార్య యిచ్చిన కాఫీ త్రాగి, చల్లగాలికి ఆరుబయట కుర్చీ వేసుకొని కూర్చున్నాడు నిరంజనరావు

అంతలోనే సాకేత లోపలికి వస్తూ కనిపించింది

'అమ్మా సాకేతా పిలిచాడు

దగ్గిరికి వచ్చింది ఏమిటి నాన్నా" అంటూ

ఎలా మొదలు పెట్టాలో అర్థం కాలేదు నిరంజనరావుకు

"మీ రిజల్ట్స్ ఎప్పుడొస్తాయ్ అనుకుంటున్నారు?

ఇంకో రెణ్ణెల్లు పట్టవచ్చు '

'అహఁ అన్నట్లు సాకేతా, నీకో విషయం చెప్పటం మరిచిపోయాను మా సత్తెమ్మక్క గుర్తుందా నీకు?

'గుర్తే కొన్ని సార్లు మనింటికి వచ్చింది

"వాళ్ళబ్బాయ్ అనిరుధ్ ?'

"అత్తయ్యతో పాటు అతడు వస్తూండే వాడుగా?'

"ఆ అనిరుధ్‌కి వుద్యోగం మా డిపార్టుమెంట్ కాదు వేరే దాన్లోలే కొంత కాలంగా పని చేస్తున్నాట్ట అతడికిప్పుడు ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ అయింది రెండు మూడు రోజుల్లో వచ్చి జాయిన్ అవుతాడట '

"అలాగా!"

ఈ చుట్టుపక్కల ఏదైనా ఓ చిన్న పోర్షన్ ఖాళీగా వుందేమో వాకబ్ చెయ్యమ్మా మనకు కొంచెం దగ్గిరిలో వుంటాడు '

ప్రయత్నిద్దాంలే నాన్నా

అనిరుధ్‌కు ఇంకాపెళ్ళి కాలేదు '

ఆ మాత్రం నాకు తెలియదా? అతడికి పెళ్ళై వుంటే మనకు శుభలేఖ వచ్చేదిగా?'

మరి అతడి విషయంలో నీ అభిప్రాయం ఏమిటమ్మా?

ఆడపిల్లల తండ్రిగా తన ఆత్రుత అణుచుకోలేక అడిగేశాడు నిరంజనరావు

గతుక్కుమంది సాకేత

అనిరుధ్ విషయంలో తన తండ్రి కనపరుస్తున్న ప్రత్యేక శ్రద్ధకు అర్థం దొరికిపోయింది ఆమెకు

అనిరుధ్ విషయంలో నాకు ప్రత్యేకమైన అభిప్రాయం ఏదీ లేదు నాన్నా మీ అందరి లానే నేనూ అతణ్ణి సత్తెమ్మత్త కొడుకుగా, బంధువుగా మన యింటికి వస్తే గౌరవిస్తాను అంతే - అని చరచర లోపలికి వెళ్ళింది సాకేత

పెద్ద కూతురు వెళ్ళిన దిక్కే ప్రాన్పడి చూస్తూండి పోయాడు నిరంజనరావు 'తమను గురించి తప్పితే తల్లిదండ్రులను గురించి ఆలోచించ లేకపోతున్నారు ఈ కాలపు పిల్లలు' – అన్న భావం నిబిడీకృతమై వుంది ఆ చూపుల్లో

★ ★ ★ ★

రాత్రి పడుకున్న తర్వాత రోజూ లా తన అభిమాన రచయిత్రి రంజితాదేవి నవలల్లోని ఆరడుగుల అందగాడు దర్శన మివ్వలేదు నిజ జీవితం– అదీ

భయంకర రూపు దాల్చి కనిపించింది సాకేతకు ఆ వేళ

అనిరుద్ధ్ అందగాడు కాదు. చేసేది కూడా ఓ చిన్న గుమాస్తాగిరి. అతడిని తమ అల్లుడుగా చేసుకోవాలని తల్లిదండ్రులు ఆలోచిస్తున్నట్టున్నారు కానీ, అలా జరగటానికి వీల్లేదు. ఆశలను, ఆనందాలను చంపుకొని ఓ గుమాస్తాతో జీవితం పంచుకొని దుర్భరమైన జీవితం గడపటమా? ఇంపాసిబుల్! డిగ్రీ చదివింది తను. తప్పక ప్యాసైతీరుతుంది! టైపు షార్టుహాండ్ కూడా వచ్చు అవసరమైతే తల్లిదండ్రులతో విభేదించి స్వతంత్రంగా ఉద్యోగం చేసుకొంటూ వంటరిగానైనా బ్రతుకుతుంది! అంతే గాని జీవితం విషయంలో మాత్రం రాజీకి వచ్చే ప్రశ్నేలేదు – అలా అలా ఆలోచించి నిర్ణయాలు తీసేసుకుంది వెంట వెంటనే

మధ్యలో రవికిరణ్ గుర్తు వచ్చాడు.

అతడి విషయం సౌందర్యకు చెప్పేసింది ఈ వేళ. "అన్నయ్యకు నేను చెబితే తల కెక్కదు నువ్వే గట్టిగా వార్నింగ్ ఇచ్చెయ్ సాకేతా రేపు వుదయంరా మీ యిద్దరి సమావేశం నేను ఏర్పాటు చేస్తాను' అని చెప్పింది ఆమె. "పిచ్చి పిచ్చి ఆలోచనలకు పోవద్దని రవికిరణ్‌కు గట్టిగా చెప్పెయ్యాలి రేపు" అనుకొంది పృఢంగా... అలాగే నిద్ర పట్టేసింది సాకేతకు.

* * * * * * * * * * *

వేస్తారు? నన్నూ, ఓ మనిషిగా గుర్తించి వుంటే 'సౌందర్య లేదా?.. ఎక్కడికి వెళ్ళింది?... ఎప్పుడు వస్తుంది?' ఇత్యాదివి అడిగి రెండు నిమిషాలు కూర్చుని మరీ వెళ్ళేవారు కానీ. " – చెయ్యి పిడికిలి బిగించి టీపాయ్ మీద కొట్టుకున్నాడు

అతడి ఆలోచనలను, ఆవేశాన్ని అర్థం చేసుకొని వెళ్ళి రవికిరణ్ ఎదురుగా మరో సోఫాలో కూర్చుంది సాకేత.

"అయామ్ సో సారీ, మిస్టర్ రవికిరణ్' మీకు తోచిన రీతిగా మీరు ఆలోచించుకొని ఆవేశపడకండి '

సాకేత వచ్చి తన ఎదురుగా కూర్చుని అలా అనేసరికి రవికిరణ్ ముఖం కాసేపు వెలుగుతో నిండిపోయింది

"ఇప్పుడు చెప్పండి సాకేత ఎక్కడికి వెళ్ళింది?

"చెల్లాయే కాదండీ మా డాడీ మమ్మీ కూడా వెళ్ళారు '

"ఎక్కడికి?'

'మా స్వంత వూరు' అక్కడ మాకు పొలం వుంది లెండి.. కవులుదారు ఏవో పేచీలకు దిగాడని మా బాబాయి వుత్తరం రాశాడు అవునూ, నిన్న ఈ రోజు తాను వూరు వెళుతున్నట్టు చెల్లాయి చెప్పలేదా మీకు?'

"ఏమిటీ, ఈ రోజు తాను వూరు వెళుతున్నట్టు సౌందర్యకు నిన్ననే తెలుసా?"

"తెలుసు."

## గడుసులోకం

—బాబు







తాను రాత్రి అనుకున్న ప్రకారం ఆచరించి, సౌందర్య సహకారంతో రవికిరణ్‌లోని భ్రమలను తొలగగొట్టాలని ఎంతో వుత్సాహంతో వాళ్ళ యింటికి వచ్చింది సాకేత, మరురోజు వుదయం.

అయితే ఎవరి రాక కోసమో నిరీక్షిస్తున్నట్టు చూస్తూ హాలులో ఒంటరిగా కూర్చొని కనిపించాడు రవికిరణ్!

"సౌందర్యా...." లోపలికి అడుగు పెడుతూ పెద్దగా పిలిచింది సాకేత.

"చెల్లాయి లేదు.. రండి. కూర్చోండి సాకేతగారూ!" అన్నాడు కిరణ్ అతిమర్యాదతో.

"సౌందర్య లేదా? .. అయితే మరో మారు వస్తాలెండి' అడుగు వెనక్కు వేయబోయింది సాకేత, తానేదో పొరబాటుగా లోపలికి వచ్చినట్టు ఫీలవుతూ

"చెల్లాయి లేకపోయినంత మాత్రాన . మీరు ఖంగారు పడి పారి పోవలసిన పని లేదు సాకేత గారూ!. నేనూ మనిషినే. నాకూ సంస్కారం వుందండీ " – కొంచెం నిష్ఠూరంగా ధ్వనించింది రవికిరణ్ కంఠం

"అహఁ అదికాదు ఏదో అనబోయింది సాకేత అటు మళ్ళిందల్లా ఇటు తిరిగి

"ఏది కాదండీ .. లోపలికి వచ్చిన మీకు నేను ఓ జంతువులా కనిపించి వుంటాను. కాకపోతే 'చెల్లాయి లేదు' అని చెప్పీ చెప్పగానే ఎందుకు వెనకడుగు

అర్థమైంది సాకేతకు. 'మా అన్నయ్య, నువ్వు ముఖాముఖిగా మాట్లాడుకొనే అవకాశం నేను కల్పిస్తాను. రేపు ఉదయంరా' అని సౌందర్య తనకు చెప్పటంలో వుద్దేశ్యం ఇదా? అయితే ఈ అవకాశాన్ని ఉపయోగించు కొంటేనే మంచిది

– అలా నిర్ణయించుకొని తన్ని తాను కూడదీసుకొంది సాకేత.

మరి మాట్లాడవలసింది తోచనట్టు ఇద్దరూ కాసేపు మౌనంగా వుండి పోయారు

"చూడండి రవికిరణ్ గారూ. మీ చెల్లాయి ఇంట్లో లేదని తెలిశాక నేను వెనక్కి వెళ్ళిపోబోతుంటే మీరు ఆవేశపడ్డారు. మిమ్మల్ని ఓ మనిషిగా గుర్తించలేదని నిష్ఠూరాలు కురిపించారు . కానీ, ఓ పరాయి ఆడపిల్లగా నా అవస్థను మీరు అర్థం చేసుకోలేక పోయారు . అసలు నేను మీ యింటికి వస్తున్నది ఎవరి కోసం?'

"అఫ్‌కోర్స్ . మా చెల్లాయి కోసమే అనుకోండి అయినా ఇంతకాలం నన్ను మీరు . ఏ విధంగానూ బావించుకోవటం లేదా?"

' మిమ్మల్ని ఓ స్నేహితుడిగానే భావించుకుంటున్నాననుకోండి '

"అనుకోవటమేమిటి?. ఇంత కాలంగా మిమ్మల్ని ఓ స్నేహితురాలిగానే

## ప్రతిస్పందన

కాదు అంతకుమించిన భావనతో నే చూస్తున్నాను నేనూను

స్నేహితురాలి కంటే మించిన బావనతో నా' అంటే ?

సాకేత దృక్కోణాల నుంచీ తప్పుకోవాలన్నట్లు కూర్చున్న చోటు నుంచీ లేచాడు రవికిరణ్ తర్వాత,

అన్నట్లు నాకు బొత్తిగా బుద్ధి లేదండీ ఇంటికి వచ్చిన అతిథులు మీరు అలాంటిది కనీస మర్యాద కూడా చేయలేదు ఉండండి ఆరెంజ్ తెస్తాను జ్యూస్ కలిపి తీసుకు రావటానికి లోపలికి వెళ్ళి తొందరగానే తిరిగి వచ్చాడు

ముందు ఈ డ్రింక్ తీసుకోండి ప్రశాంతంగా మాట్లాడుకుందాం – ఒక గ్లాస్ సాకేతకు యిచ్చి యదాస్థానంలో కూర్చుని తానూ డ్రింక్ సిప్ చేయటం మొదలు పెట్టాడు

సాకేత అభ్యంతరం చెప్పకుండానే డ్రింక్ త్రాగింది

'ఆడవారి మాటలకూ అర్థాలే వేరులే' అన్నాడు ఓ కవిగారు అలా కాకుండా దయచేసి మీకు నా పట్ల గల అభిప్రాయ మేమిటో తేల్చి చెప్పెయ్యండి సాకేత గారూ ' అన్నాడు రవికిరణ్ ఒక్కసారిగా

నా స్నేహితురాలికి అన్నయ్యగా, పరిచయస్థులుగా

సాకేత మాటలు పూర్తి కానీయలేదు

అంతకుమించి వేరే ఎలాంటి అబిప్రాయం లేదంటారు?

అవును

అలా అయితే ఇంత కాలం మీ చేష్టలకు అర్థం?

చేష్టలా' మిమ్మల్ని నేనెప్పుడూ కవ్వించలేదే?

లేదా? మరి ఎందుకు నా చూపుల్లో చూపులు కలిపారు? మీకు అభ్యంతరంగా తోచి వుంటే 'నా వైపు అలా చూడకండి' అని ఎప్పుడో హెచ్చరించి వుండేవారు కాదా? మా చెల్లాయితో పాటే నాతోనూ ఎంతో హుషారుగా మాట్లాడటం జరిగేదా, మనసులో ఇష్టం అంటూ లేకపోతే? అంతెందుకు? ఆ రోజు సినిమాకు వెళ్ళినప్పుడు ఏవో కుంటి సాకులు చెప్పి కావాలని నా ప్రక్కకు వచ్చి ఎందుకు కూర్చుంటారు, ఏదో ఇది లేకపోతే?

సాకేతకు ముచ్చెమటలు పోశాయి అతడు ప్రశ్నించిందీ నిజమే

తన చూపులో చూపు కలపటానికి ప్రయత్నిస్తూండే వాడు రవికిరణ్ ఎప్పుడూ కానీ, పెద్దగా పట్టించుకోలేదు తను ప్రియ మిత్రురాలైన శౌందర్యకు అన్నయ్య అని అతడితో సోషల్‌గా మాట్లాడేది తప్పితే ఇందులో ఎ కోశానా ఇతర వుద్దేశ్యాలు లేవు చివరగా రవికిరణ్ పేర్కొన్నసినిమా హాలులో – ఆ ప్రప'సనం మాట నిజమే దృడకాయురాలైన స్త్రీ – ఆమె బాద పడలేకే సీటు మారి కూర్చుంది చూస్తున్న సినిమా గురించి తప్పితే వేరే ఆలోచన మచ్చుకైనా లేదప్పుడు తనలో

మరి రవికిరణ్ తనను దోషిగా నిలబెట్టి మాట్లాడేస్తున్నాడు కానీ, ఆ అవకాశం తను అతడికి ఇవ్వకూడదు – మనసును దిటవు పర్చుకొంది సాకేత మరొకసారి

రవికిరణ్ గారూ' మీరు అనవసరమైన భ్రమలకు పోతున్నారు ' అంది పైకి

నేను భ్రమలకు పోవటం కాదు మిరే నన్ను మభ్యపరచటానికి చూస్తున్నారు నిజం ఒప్పుకోవటానికి మీకు ధైర్యం చాలక పోవచ్చు విషయం బైటకు పొక్కితే మా మమ్మీ, డాడీ ఏమంటారో, మీ మిత్రురాలైన శౌందర్య ఎలా అబిప్రాయపడుతుందో –? అదీ కాకుండా ఆర్థిక అసమానతలు

ఆపండి మీ మాటలు

నిజాలను కాదని బుకాయించకండి సాకేతగారూ నేను అవసరమైతే మా పెద్దలను ఎదిరించైనా సరే మీ చేయి అందుకోవటానికి సిద్ధం డిగ్రీ పూర్తి చేయలేకపోయినా – ఏదో విదాన మిమ్మల్ని పోషించగలను మా డాడీ కూడా నా చేత ఏదో ఒక బిజినెస్ పెట్టించాలని చూస్తున్నారు అసలు మీరు ఈ యింటి కోడలు అవుతానంటే నా కంటే ఎక్కువగా మా మమ్మీ డాడీయే సంతోషపడతారు' నాకు ఆ నమ్మకం వుంది కట్నకానుకలతో నిమిత్తం లెకుండా తమ కూతురి పెళ్ళి చేయగలుగుతున్నందుకు మీ అమ్మ నాన్న కూడా ఎంతో వూరట చెందుతారు

మిస్టర్ రవికరణ్' నా మనోగతం తెలుసుకోకుండానే మిరు చాలా చాలా మాట్లాడేస్తున్నారు మాకు ఆర్థికంగా లేకపోవచ్చు నా తండ్రి ఓ మామూలు వుద్యోగి కావచ్చు అయినా వ్యక్తిగతంగా ఆలోచిస్తే మికు, నాకు నక్కకు నాగలోకానికి వున్నంత తేడా వుంది అర్థం చేసుకోగలిగితే ఇంతకు మించి వితమరిచి చెప్పనవసరం లేదనుకుంటాను దయచేస నన్ను కలలో కూడా మి దరికి తెచ్చుకోకండి ఇది నా మనవి – అని చరచర బయటికి వెళ్ళిపోయింది సాకేత

ఎంత పొగరు' సాకేతా, నువ్వు నా దారికి రాకపోతే నేనే నిన్ను నా దారిలోకి తెచ్చుకుంటాను ఇది మన యిద్దరికి సవాల్ ప్రతిన బూనినట్లు అనుకున్నాడు ముందు

తర్వాత - ఏమిటి కథ అడ్డం తిరిగింది? ఇన్ని రోజులుగా తను సాకేతను ఎంతో ఆరాదిస్తున్నాడు ఆమెను తన ప్రక్కన వూహించుకొని ఎన్నో అందమైన కలలు కన్నాడు మరి చివరికి ఇలా జరిగిందేమిటి? – జుట్టు పీక్కున్నాడు రవికిరణ్ కసిగా

* * * * * * * * * * *

కారులో రెండు గంటలు ప్రయాణం చేసిన తర్వాత తమ స్వంత వూరు 'అమ్మన్నపల్లి'కి చేరుకోగలిగింది శౌందర్య

తల్లిదండ్రులు కూడానే వున్నారు అయినా ఓ విదమైన ఒంటరితనాన్నే అనుబవించింది, ప్రయాణిస్తున్నంత సేపూ ఆమె మనసు ఆలోచనల పుట్ట అయింది

ఈ రోజు తాను తల్లిదండ్రులతో కలిసి వూరు వెళుతున్నట్లు నిన్న సాకేతకు మాట వరుసకైనా చెప్పలేదు పైగా 'నువ్వు, మా అన్నయ్య కలిసి మాట్లాడుకొనే అవకాశం నేను కల్పిస్తాను రేపు వుదయం రా' అని చెప్పింది ఎలాగో తాము వూరు వెళుతున్నారు అన్నయ్య ఒక్కడే తప్ప ఇంట్లో మరెవ్వరూ వుండరు సాకేత వస్తే – అప్పుడు వాళ్ళిద్దరూ స్వేచ్ఛగా మాట్లాడుకోగలుగుతారు – ఇది తన వుద్దేశ్యం

తాను చెప్పన ప్రకారమె సాకేత ఈ రోజు వుదయం తమ యింటికి వచ్చి వుంటుంది ఇంత కాలం ఆమె తనను ప్రేమిస్తోందన్న భ్రమలో మునిగిపోయిన అన్నయ్య – సాకేతకు తనపై ఎలాంటి ఆశలూ లేవన్న పచ్చినిజం తెలిశాక – పరిస్థితి ఎలా మారి వుంటుందో? అన్నయ్య సాకేత పట్ల ఎలా వ్యవహరించాడో?' – ఇదే శౌందర్య మానసికమైన ఆందోళన ' అమ్మ, నాన్నలతో కలిసి తాను వూరు బయలుదేరకుండా వుంటేనే బావుండేదేమో?' అని చాలా సార్లు అనుకుంది కూడా

ఆమె అలా బయసందేహాలకు లోను కావటానికి కారణం రవికిరణ్‌ది వింత మనస్తత్వం కావటమే

ఏ విషయంలో గాని తన మాటే నెగ్గి తీరాలంటాడు అతడు దానికి తోడు విచక్షణా జ్ఞానం లేని పిచ్చి పట్టుదల తల్లిదండ్రులు తన మాట కాదన్న రోజు ఇంట్లో బ్రహ్మప్రళయమే సృష్టించేవాడు చిన్నప్పుడు చేతికి ఏ వస్తువు దొరికితే దాన్ని నేలకేసి విసిరికొట్టేవాడు అలారం పీస్ లేమిటి, ట్రాన్సిస్టర్లేమిటి, టేప్ రికార్డర్లేమిటి – చాలా బ్రద్దలైపోయాయి అతని చేతిలో తల్లి తిట్టినా, తండ్రి

త్వరలో ప్రారంభం!

కొత్త సీరియల్ నవల

# ప్రత్యూషపవనాలు

రచన

శ్రీమతి భవానీ కృష్ణమూర్తి

ఆంధ్ర పత్రిక పాఠకులక్కి చక్కటి అవకాశం!



# కళ్యాణవేదిక

ఉచిత సమాచారం



వధూవరుల సమాచారము వుచితంగా

ప్రతి బుధవారం ప్రకటిస్తాము.

సమాచారం పంపేవారు

ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **వుచితంగానే** వాటికి సంబంధించినవారికి పది రోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనను ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధమునైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తి చేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడదు.

★ కళ్యాణవేదిక శీర్షిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన వచ్చినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

## కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ...

... ... ... ... ... ...పిన్‌కోడ్... ... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటుసంతకం.....................

## ప్రతిస్పందన

కొట్టినా మారేవాడు కాదు చదువు విషయంలో ఏ మాత్రం శ్రద్ధ, తెలివితేటలు ప్రదర్శించేవాడు కాదు రవికిరణ్ మూడో సారి పరీక్ష వ్రాసి టెన్త్ క్లాస్ ప్యాసైనా, రెండో సారి పరీక్ష వ్రాసి ఇంటర్ ప్యాసైనా – శేషాద్రిగారి హస్తం వెనుక వుండి పని చేయబట్టే మరి ఒక్కడే మగబిడ్డ అతడు చదువులో శుద్ధ మొద్దు అని నలుగురూ గేలి చేస్తారనే తన కొడుకును డిగ్రీ దాకా లాక్కు వచ్చాడు ఆయన పలుకుబడి మీద ఆ డిగ్రీని కూడా గట్టెక్కించాలని శేషాద్రిగారు ప్రయత్నాలు చేశారు గాని ఫలించలేదు డిగ్రీ పాసవక పోతేనేం? చదివాడు చాలదా? తనకు కావలసినంత డబ్బుంది ఏదో ఒక బిజినెస్ పెట్టించి కొడుకును దారిలో పెట్టాలన్న ఆలోచన శేషాద్రిగారికి కలిగింది ఈ మధ్య అయితే అదింకా కార్యరూపం దాల్చలేదు – ఇదీ రవికిరణ్ పరిస్థితి

'ఇప్పుడు సాకేత తనని చీ కొట్టిందని మూర్ఖత్వానికి పోయి ఆమెపైఏమైనా అఘాయిత్యం లాంటిది చేయడు కదా? భగవాన్! అమాయకురాలైన సాకేతను నువ్వే కాపాడు' – పరిపరి విధాల ఆలోచిస్తూ చివరికి ఆ బగవంతుణ్ణి ప్రార్థించింది సౌందర్య

బేబీ! ఇల్లు వచ్చింది దిగుదాం

తల్లి కంఠం ఖంగున వినిపించేసరికి వులిక్కి పడింది సౌందర్య

కారు దగ్గిరికి పరుగులాంటి నడకతో వచ్చాడు వెంకటాద్రి

'అన్నయ్యా! వదినా! సౌందర్యా! బావున్నారా? అన్నట్లు మన రవి ఏదీ?' – గుక్క తిప్పుకోకుండా సాదరంగా అందర్నీ పలకరించాడు అతడు

'బాగానే వున్నాం – తమ్ముడి మీద అప్యాయంగా చేయి వేసి ముందుకు నడిచాడు శేషాద్రి

బేబీ, త్వరగా రా – వాళ్ళ వెనుక యమునాదేవి బయలుదేరింది

అంతవరకు సీటులోనే కూర్చుని వున్న సౌందర్య తప్పదన్నట్లే కారులోంచి దిగింది

డ్రైవర్ డిక్కీలో వున్న లగేజీని తీసుకు వెళ్ళి లోపల పెట్టే ప్రయత్నంలో వున్నాడు

అదంతా ఎరిగి వున్న ప్రదేశమే తల్లిదండ్రులతో కలిసి చాలా సార్లు వచ్చింది ఆ వూరు కొన్ని సార్లు సమ్మర్ హాలీడేస్ మొత్తం అక్కడే గడిపేసిన సందర్భాలూ వున్నయ్

తమది అధునాతనమైన డాబా బాబాయి వాళ్ళది మామూలు పెంకుటిల్లు ఇద్దరి ఇళ్ళకూ సమానమైన ఆవరణ వుంది బాబాయి వాళ్ళ ఇంటి ముందు గొడ్ల చావిడి, ఎడ్లబళ్ళు – రొచ్చుకంపు కొడుతూంటుంది వాతావరణం తమ డాబా ముందు అందమైన చెట్లు – చక్కటి పార్కులా కూర్చోవటానికి రాతి బెంచీలు కూడా ఏర్పాటు చేశారు వూళ్ళో పిల్లలు ఆటలకు వచ్చి అన్నీ పాడు చేస్తారని గేటుకు ఎప్పుడు తాళం బిగించి వుంచుతాడు వెంకటాద్రి పొలం పుట్రతో పాటు తన యింటిని కూడా కంటికి రెప్పలా చూసుకునే బాధ్యత తమ్ముడికే అప్పగించాడు శేషాద్రి

మీరు వస్తారని నిన్ననే ఇల్లంతా శుభ్రం చేయించాను అన్నయ్యా – తలుపు తాళాలు తీస్తూ అన్నాడు వెంకటాద్రి

లోపల అంతటా ముగ్గులు పెట్టి చాలా నీటుగా వుంది

రాజయ్య ఇప్పుడు ఇంట్లో వుంటాడా?" – కవులుదారును గురించి అడిగాడు శేషాద్రి, ఆతృతను అణుచుకోలేక

మధ్యాహ్నం పిలిపిద్దాం అన్నయ్యా సామాన్లు లోపల పెట్టేసి తాళం వేసి మన యింటికి పదండి ఏకంగా భోజనం చేసి వచ్చి ఇక్కడ రెస్ట్ తీసుకోవచ్చు ఏమంటావ్ వదినా?' అన్నాడు వెంకటాద్రి

అలాగే మేం ఇక్కడే వుండిపోతే కమల చిన్నబుచ్చుకోదూ? ఏమండీ, కాసేపు మీ తమ్ముడు వాళ్ళింట్లో కూర్చుని భోజనాలు చేశాక ఇక్కడికి వద్దాం' అంది యమున

'అలాగే

అందరి కంటే ముందు పరుగెత్తుకొని వెళ్ళింది సౌందర్య తమ పిన్నిని, వాళ్ళ పిల్లల్ని చూడాలన్న ఆతృతతో (ఇంకా ఉంది)

# చెవిటి,మూగవారికి రైల్వే టిక్కెట్ పై రాయితీలు!



—వాడ్రేవు శ్రీనివాస్—















# ప్రెజాసేవకులారా గేమ్సుబాండు జాగ్రత్త!



'గిరజాల గిరీశం'

తలుపుతోసుకుని బాణంలా లోపలికి వచ్చాడు గేమ్సుబాండ్.

'నీయవ్వ – ఏంటా దూకుడూ!" అంటూ అంగడి బొమ్మ మీంచి లేచి అదరా బాదరా లుంగీ సర్దుకుని పక్కమీద కూలబడ్డాడు ప్రెజాసేవరావు. అంగడి బొమ్మ దుప్పటి కప్పుకుని ప్రక్క మీంచి లేచి ప్రక్కగదిలోకి తుర్రుమంది!

"ఏంటయ్యా ఇది? ఎంత డిటిక్టివ్ అయితే మాత్రం ఇట్టా లోపలికి దూరిపోవటమే నంటయ్యా?" నోట్లోని ముక్క వాగులోకి పడిపోయినట్టు కుక్కలా అరిచాడు ప్రెజాసేవరావు

"అదేంటి సార్! మీరు ప్రజాసేవ చేస్తున్నప్పుడేగా నేను వచ్చింది..

"ఏంటయ్యా ప్రెజాసేవ? నా మదం వదిలించుకోటం ప్రజాసేవ ఎట్టా అవుద్ది?" ప్రెజాసేవరావు అర్థంకాక అడిగాడు

'ఆ పిల్ల తమర్ని కోరివుంటుంది అది మీరు తీరుస్తున్నారు ప్రజల కోరికలు తీర్చటమేగా తమరి పని' అన్నాడు గేమ్సుబాండ్.

'నేనే కోరానయ్యా, ఆ పిల్ల వచ్చింది ఈ సోదెందుగ్గానీ, నీకప్పు జెప్పిన పని ఎంత వరకొచ్చిందో చెప్పు' పె. సే రావు విసుక్కున్నాడు, ప్రక్క గదిలోకి చూస్తూ.

"పూర్తయింది! అదంతా చెప్పటానికి కాస్త టైం పడుతుంది మీరు చూస్తే ప్రెజా సేవలో మునిగున్నారు మరి మొదలెట్టనా?" గేమ్సుబాండ్ టై సర్దుకుంటూ అన్నాడు.

"ఎంత టైం పట్టుద్దీ?" అసహనంగా అడిగాడు పె సే. రావు.

"చాలా వివరంగా చెప్పాల్సిన విషయాలున్నాయ్ కనీసం అర్థగంటయినా పడుతుంది! ఇంకా వివరంగా చెప్పమంటే ఈ రాత్రంతా చెప్పగలను అన్నాడు గేమ్సుబాండ్

'ఏందయ్యో గేమ్సుబాండూ, నువ్విప్పుడేం చెప్పినా బుర్రకెక్కేట్టు లేదయ్యా, నువ్వు ఓ గంటయినాక రా, పెగ్గుల మీద, రౌండ్ల మీద మాట్లాడు కుందాం!" అన్నాడు పె సే రావు, గేమ్సుబాండ్ భుజం పట్టుకుని లేవదీస్తూ

'అట్టాగేసార్! ప్రెజాసేవ ముఖ్యం తర్వాతే సొంత విషయాలు, వస్తామరి" అంటూ వెళ్ళిపోయాడు తలుపు తీసుకుని

అంగడి బొమ్మ ఆ గదిలోకి మళ్ళీ తుర్రుమని వచ్చి మంచంమీద పడుకుంది పె సే రావు బొమ్మను చేరబోయే సమయానికి, మళ్ళీ తలుపు తెరుచుకుంది

'ఏందయ్యో బాండూ, నిన్ను నిన్ను " అరిచాడు పె సే రావు

'అయ్యో! తమరు తలుపు గడియ పెట్టుకోండి లేపోతే మీరు ప్రెజాసేవ చేస్తున్న ఫొటోలు రేపు పేపర్లో వచ్చేస్తాయి!" అన్నాడు గేమ్సుబాండ్

'నీయవ్వ, భలే గుర్తు చేసినా వయ్యా!' అంటూ పరుగెత్తు కొచ్చి తలుపేసి బాగా గడియ పెట్టేసాడు అప్పుడు టైం మూడయింది రాత్రి కాదు, పగలు!

రాత్రి తొమ్మిది గంటలకి గేమ్సు బాండ్ తలుపు తట్టాడు లోపల చప్పుడు లేదు. మెల్లగా తలుపు తోసాడు లోపల గదిలో ఒక్క చిన్న వెలుగునిచ్చే లైటు మాత్రం వెలుగుతోంది

రావయ్యా గేమ్సు బాండూ, నీకోసమే చూస్తున్నా' పె సే రావు అన్నాడు

'ఏమిటి, లైట్లు తీసేసి చీకట్లో కూర్చున్నారు? గేమ్సు బాండ్, పె సే రావు ఎదురుగుండా కూర్చుంటూ అడిగాడు

ఎవరన్నా వుంటేగా లైటేసుకోటానికి సీసాలు, గ్లాసులూ చిన్న బల్ల మీద సర్దుతూ అన్నాడు పె సే రావు

సరే – నాకు అప్పజెప్పిన పని ఎట్లా పూర్తి చేసానో అయిదు నిముషాల్లో చెప్పి ముగించి నేను వెళతాను తమరు పడుకోటానికి లేటయిపోతుంది? అన్నాడు గేమ్సు బాండ్, టై సర్దుకుంటూ

హి హి ఇంకా పడుకోటం ఏందయ్యో! ఇది రాత్రి మనం మేల్కొనే వుంటాం మనం పగలు పడుకుంటాం, రాత్రిళ్ళు మేలుకుంటాం అందుకని నువ్వు ఈ రాత్రంతా నువ్వు చేసిన డిటిక్టివ్ పని చెప్పాల తెల్లారాక నిద్రపోతాను అన్నాడు పె సే రావు గ్లాసుల్ని నింపుతూ

గేమ్సుబాండుకి ఒక గ్లాసు ముందుకి తోసాడు గేమ్సు బాండ్ దాన్ని చేతిలోకి తీసుకున్నాడు పె సే రావు తను కూడా ఓ గ్లాసు తీసుకుని, గేమ్సుబాండ్ సీసాకి ఢీ కొట్టి 'సీర్స్!' అన్నాడు 'చీ చీర్స్' అన్నాడు గేమ్సుబాండ్

గేమ్సుబాండ్ తన గ్లాసుతో పెదాలను తడుపు కున్నాడు పె సే రావు తన గ్లాసులోని ద్రవాన్ని మళ్ళీ సీసాలోకి వంపేసాడు.

'అదేంటి సార్' మీరు తాగటం మానేసారా?" గేమ్సుబాండు ఆశ్చర్యంగా అడిగాడు

ఉండెహె, అదా తొందర పడిపోతా వేంటి? నేను తాగటం ఎందుకు మానేస్తాను? ఈ సీసాలన్నీ ఇక్కడ పెట్టుకుంది తాగటానిక్కాపోతే, కాళ్ళు కడుక్కోటానికనుకున్నావా?"

అంటూ సీసాఎత్తి గడ గడ గుటకలేసాడు పె సే రావు అది చూసి గేమ్సు బాండ్ కంగారు పడి, తన గ్లాసులోని ద్రవం కొంత టైలోనూ, కొంత గొంతులోనూ, మరికొంత ముక్కులోనూ పోసుకుని, ఉక్కిరి బిక్కిరయి పోయాడు ఓ అర్థ గంట సేపు

పె. సే రావు ఓ సీసా ఖాళీ చేసి రెండో సీసా పైకెత్తి పట్టుకుని ఆ! ఇప్పుడెంత వరకు చెప్పావ్? అడిగాడు

అసలు మొదలెట్టందే? అయినా తమరు గ్లాసుతో హాయిగా తాగుతుంటే నేను చక్కగా చెబుతా కదా! అన్నాడు గేమ్సుబాండ్

'నీయవ్వ– పెగ్గుల్లో పేగులు నిండుతయ్యా? సరే గానీ, సెప్పు – సెప్పు నేను రేపు బయిరంగ సభలో అది చరిత్ర తిట్టిపోయాల!" అన్నాడు పె సే రావు

గేమ్సుబాండ్ మొదలెట్టాడు

అది 1992 ఆగస్టు ఆరోతారీకు ఉదయం ఆరుగంటల సమయం. నేను తోటమాలి వేషంలో నీ ప్రత్యర్థి ఇంటికి వెళ్ళాను

ఏంటయ్యో, నన్ను అగౌరవంగా నువ్వు అని పిలుస్తున్నావు నాకు మైకం కమ్మేసిందను కున్నావా? ఎంత తాగితే నాకంత తెలివి, తెలుసా? పె సే. రావు కసురు కున్నాడు

'అయ్యో! ఎక్కడన్నా మర్యాదలు పాటించ వచ్చుగానీ, తాగుడు సీసాల మధ్య మాత్రం కుదర్దు

నువ్వు, నీ. అని కథ చెపుతుంటే ఒక ఆత్మీయుడికి చెపుతున్నట్టుగా వుంటుంది!' అన్నాడు గేమ్సు బాండ్, తనే సీసాలోంచి మందుని పెగ్గులోకి వంపుకుంటూ!

"హీ. హీ. హీ భలే చెప్పావయ్యా అట్టాగేసెప్పు నీ యవ్వ నీ ఇష్టం వచ్చినట్టు సెప్పు నన్ను తిట్టుతూ కూడా సెప్పు, ఫర్లేదు మారు మాట్నాడకుంటా వింటా' అన్నాడు పె సే రావు విరగబడి నవ్వుతూ

"అది 1992 ఆగష్టు ఆరో ' గేమ్సుబాండ్ మొదలెట్టాడు

'నీయవ్వ సెప్పిందే సెప్తావేంటయ్యా– వాగ్నానా ల్నాగ? అన్నాడు పే సే రావు మళ్ళీ విసుక్కుంటూ

' తోటమాలి వేషం వేసుకొని వెళ్లానా? అక్కడ వరండాలో పాతికేళ్ల పిల్ల ఇంగ్లీషు పుస్తకం చూస్తోంది నేను వెంటనే వెళ్ళి ప్రేమించేసాను అమ్మాయి కూడా కాదనే టైం లేక తిరిగి ప్రేమించేసింది ఏం పని మీద వచ్చావు? అనడిగింది తోటమాలిగా ఉద్యోగం కావాలన్నాను ఓసి అంతేనా, ఓకేఅంది ఆపిల్ల నీ ప్రత్యర్థి కూతురు అనుకున్నా మొదట కానీ అది కూడా అక్కడ పని మనిషే నని తెల్పింది మీ ప్రత్యర్థి ఆయన కుటుంబం వూళ్లో లేక పోవటంవల్ల, వాళ్ల బట్టలేసుకుని రాణి గారి లాగ భవనం అంతా తిరిగింది అది చూసి నేను నీ ప్రత్యర్థి కూతురనుకున్నా . సరే, కానివ్వు, ఇప్పుడు ముంచుకు పోయిందేముంది అనుకుని సర్దుకు పోయాను రెండ్రోజుల తర్వాత నీ ప్రత్యర్థి కుటుంబంతో సహా వూరునుంచి దిగారు రావటం తోనే ఎవరు నువ్వు అని అడిగాడు నన్ను 'నా బావ' అంది ఆ పిల్ల నేను చెప్పకుండానే అయితే మంచిదే అన్నాడు

ఆ రోజు రాత్రి నీ ప్రత్యర్థి నా దగ్గరికొచ్చి నా వేసం నువ్వేసుకుంటావా? అన్నాడు

"వూహు, నా కొద్దు అన్నాను 'పర్లేదులే, వేసుకో, వేసుకుని ఆ గదిలో–దోమ తెరలో పల పడుకో ఒక్క దోమకుట్టదు నేను నీ వేషం వేసుకుంటా నాకు దోమలు కుట్టితే గానీ నిద్రట్టదు," అన్నాడు నేను సరే అన్నాను వేషాలు మార్చుకున్నాం నేను వెళ్ళి గదిలో దోమ తెర మంచం మీద హాయిగా నిద్రపోయాను నీ ప్రత్యర్థి నా వేషంలో ఆ పనిపిల్ల గదిలో పడుకున్నాడు

మరునాడు ఆ పనిపిల్లని అడిగాను – అదేంటి ఆ పెద్దమనిషి అట్టా చేసాడూ అని అయ్యో, ఈయన గురించి నీకేమీ తెలవదా? అనడిగింది అయ్యో, అది తెల్సుకోటానికే గదా నేనిక్కడకు వచ్చిందీ అన్నాను అయ్యో, మరి ముందే అడక్క పోయావా అన్నీ చెపుదును అంది అట్టా నాలుగయిదు సార్లు అయ్యో అయ్యో అని ఆయన కథ చెప్పింది

దాని వివరమేమనగా,

ప్రత్యర్థి చిన్న తనంలో చదువుకోటానికని చెప్పి బయలుదేరి, బడికెళ్ళకుండా గోలీకాయలాడేవాడు అతనికి గోలీకాయలంటే ఎంతో ప్రేమ భూమి గోలీకాయలా వుంటుందని ఓసారి చెప్తే , సోషల్ మేష్టారు కోపమొచ్చి పడిపోయాడు జీవితంలో పైకి రావాలంటే 'గురి' చాలా అవసరం అనేవాడు అందుకు గోలీకాయలాట తనకు ఎంతో ఉపయోగ పడిందనే వాడు గురి చూసి కొడితే, అందరూ పడిపోతారు అప్పుడు మనమే లీడరు అనే సిద్ధాంతాన్ని మొట్ట మొదటి సారిగా వెలుగులోకి తీసుకొచ్చిందాయనే అదే సిద్ధాంతంతో అవుల్లో లీడరయి పోయాడు ఎవడన్నా ఎదిరించి కనపడితే, గురిచూసి కొట్టేవాడు దానితో వాడు పడిలేచేవాడు కాదు తర్వాత ఆయనకి ఓ రంభతో పరిచయ మయ్యింది రంభ ఈయన్ని ఓ బ్రాందీ షాపు పెట్ట మంది వచ్చిన వాళ్లందరికీ తనే బ్రాందీ అదీ ఇచ్చేది ఇద్దరూ అట్టా బాగా డబ్బు సంపా యించారు ఓసారి ఎవరో రంభని చంపేసారు ఈయన అప్పుడు ఎంతో దుఃఖించాడు రంభా రంభా అని రోడ్ల మీద తిరిగాడు ఈయన వ్యవహారం చూసి, జాలిపడి, రంభ హత్యతో అతనికి ఏం సంబంధం లేదని పోలీసులు తెల్సుకుని, అసలు హంతకుని వెతకటం మొదలెట్టారు ఇప్పటికీ వెతుకుతునే ఉన్నారని తెల్పింది అట్టా హత్యకేసు లేకుండా చేసుకున్నాడు

ఈయన్ని చూసి ఓ పేదింటివాళ్ళు వాళ్లమ్మాయి నిచ్చి పెళ్ళి చేసారు ఆమెంతో అమాయకురాలు ఈయన ఏం చేసినా చూస్తూ వూరుకునేది ఏం చేసినా వూరుకుంటోంది గదాని, ఈయన ఆమెని రంభ చేసిన పనిని చెయ్యమన్నాడు చెయ్యనంది చేస్తావా లేదా అనడిగాడు చెయ్యనంది మరేం చేస్తావు అనడిగారు చస్తానంది సరే కానివ్వు అన్నాడు. ఆమె కానిచ్చింది అట్టా ఆరు పెళ్ళిళ్లు చేసుకున్నాడు అతనికి ఆడవాళ్ల గురించి బాగా తెలిసి పోయింది వాళ్లను ఎట్టా లొంగదీసుకోవచ్చో, ఏ పనులు చేయించవచ్చో బాగా తెలుసుకొని, బోల్డంత డబ్బు సంపా యించాడు బారులు, లాడ్జిలు, షాపులు, ఎన్నో పెట్టాడు డబ్బు తెగపెరిగి పోయింది దాంతో అతనికి గౌరవం పెరిగి పోయింది అతనికి తల్లి అంటే మాత్రం గౌరవం కానీ ఆమె మాత్రం ఇతని గుణగణాలకు ఆశ్చెరువొంది రంభని చేసుకున్న రోజునే, పరలోకయాత్ర చేసింది

డబ్బు బాగా పోగయ్యాక అతనికి ఏం చెయ్యాలో తెలీలేదు పన్నులు తెగకట్టాల్సి వచ్చింది ఇదేం న్యాయం, సంపాదించినంత మాత్రాన పన్నులెందుకు కట్టాలి నే కట్టను అని మంకు పట్టుపట్టుక్కూర్చు న్నాడు అందరూ చెప్పారు, అయ్యా, పన్నులు కట్టదల్చుకో లేకపోతే, ప్రజాసేవ చెయ్యి, లీడరు వయిపో రోజులు బాగుంటే మంత్రి వయిపోతావు నువు పన్నులు కట్టటం అట్టావుంచు, పన్నులే వేస్తావు, కాబట్టి రాజకీయాల్లోకి దిగిపో, అని అతన్ని అందులోకి తోసేసారు ఇప్పుడతను లీడరు గా వెలుగుతున్నాడు రేపు ఎలక్షన్లో నిలబడి గెలిచి పైకి, పైపైకి పోదామని చూస్తున్నాడు అదీ కథ అని ముగించాడు గేమ్సుబాండ్

'ఓసి, ఇంతేనా? వాడు నాకంటే ఎంతో గొప్పోడనుకున్నానే' నవ్వాడు, పె సే రావు

'అదేవిటీ, ఆరేడు పెళ్లిళ్లు చేసుకున్న వాడు గొప్పోడు కాదా? గేమ్సు బాండ్ అన్నాడు

చాల్లే పూర్కోవయ్యా' పెళ్ళిళ్ళు చేసుకోటం గొప్పుంటావా? పె సే రావు తీవ్రంగా అడిగాడు

మరయితే ఏం చేస్తే గొప్ప? అడిగాడు గేమ్సుబాండు



"ఆడు మొట్ట మొదట ఏవయసులో వుండగా అమ్మాయి దగ్గరికెళ్లాడో చెప్పు!" పె సే రావు అడిగాడు బల్లగుద్ది

గేమ్సుబాండ్ గబగబా బ్రీఫ్‌కేసు తెరిచి చిన్న కంప్యూటరు బటన్ను నొక్కి స్క్రీన్ మీద వివరాలు చూసి "పదిహేనో సంవత్సరం అన్నారు

"హిహిహి నేను పద్నాలుగో ఏటనే అమ్మాయిల్ని అనుభవించేసాను మరో కొచ్చను ఆడెంతమందిని అనుభవించి వుంటాడో చెప్పు?

"మూడొందల తొంభై ఆరు"

"హిహిహి. నా స్కోరు తొమ్మిదొందలు దాటింది.. ఇంకో కొచ్చను ఆడెంత మందిని రేప్ చేసాడో చెప్పు!

"ఇరవై రెండు!

"హి హి హి నా స్కోరు నలభై తొమ్మిది ఇంకో కొచ్చను, ఆడెంత మందిని చంపించాడో చెప్పు"

"ఆరు!"

"నా స్కోరు తొమ్మిది! ఇంకా అవలేదు, మరో కొచ్చను.. ఆడెంత సంపాయించాడో చెప్పు ?"

"రెండు కోట్ల ఇరవై లక్షల "

"ఆవు.. నేను ఆరేడు కోట్లు మరో కొచ్చను.. ఆడికి తండ్రు లెంతమంది?"

"ఒక్కడే!

"హీ హీ హీహీ..... నాకు నలుగురు!' అని నవ్వి ఇక




పెజాసేవకు లొస్తున్నారు జాగర్త!

నవ్వలేక పడి పోయాడు పె. సే రావు

అప్పటికే తెల్లవార బోతోంది. గేమ్సుబాండ్ ఒక్కసారి తెలివి తెచ్చుకుని "అయ్యో, నా పని పూర్తి అయింది. నా ఫీజు ఇస్తే పోతా", అన్నాడు. పె. సే. రావు గేమ్సు బాండుకి తాళాలిచ్చి, "అదిగో ఆ బీరువాలో వుంది పట్టుకుపో! క్రింద అరలో దొంగనోట్లున్నాయి జాగర్త" అన్నాడు. గేమ్సు బాండ్ గబగబా మంచి నోట్లని తన ఫీజుగా తీసుకుని, తాళాలు పె సే రావు చేతిలో పెట్టేసి గదిలోంచి బయట పడ్డాడు అప్పుడు తెల్లవారింది పె సే రావు నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★ ★ ★

రాత్రి తొమ్మిది గంటలు

పె సే రావు యొక్క ప్రత్యర్థితో మందు తాగుతూ కూర్చున్నాడు గేమ్సు బాండ్

"పె సే రావు చరిత్ర చెప్పు రేపు మీటింగులో ఆడ్ని తిట్టాలి అడిగాడు ప్రత్యర్థి

గేమ్సు బాండ్ మొదలెట్టాడు. ఫీజు ముందే తీసుకుని

అక్కడ ఓగంటలో చరిత్ర చెప్పటం ముగించి వెంటనే బ్రీఫ్‌కేసుతో మరో అభ్యర్థి దగ్గరి కెళ్లాడు.

అక్కడ పె సే రావు చరిత్ర, ఆయన ప్రత్యర్థి చరిత్ర గంటలో ముగించాడు అక్కడ ఫీజు తీసుకుని మరో అభ్యర్థి ఇంటికి బయలు దేరాడు. అట్లా పాపం రాత్రంతా తిరుగుతునే వుండి పోయాడు గేమ్సు బాండ్ □




**ఎన్. యాదగిరి, కొత్తకొండ**

హిందీ సినిమా పరిశ్రమ పై మీ అభిప్రాయం ఏమిటి?

అభిప్రాయం ఏర్పరుచుకునే దశకి నేనింకా ఎదగలేదు!

**బి. బి. భారతి, ఖమ్మం**

మీరు తెలుగులో నా అభిమాన నటి. చూడబోతే మీరు ముందు ముందు హిందీలో సెటిల్ అయ్యే టట్టున్నారు?

తెలుగులో సెటిలయ్యాను– హిందీలో సెటిలయ్యేటట్టున్నాను.

**జి. కృష్ణ, సంగారెడ్డి, మెదక్**

భానుప్రియగారూ! మీకు చాలా లేఖలు వ్రాశాను. కాని మీరు ఒక లేఖకు కూడా సమాధానం వ్రాయలేదు. అందుకు కారణం?

రాశాను! మీకు అంది వుండదు!

**ఐ. ఎస్. హరిబాబు, పాకాల**

నా అభిమాన నటి మీరు. మీ అభిమాన నటి ఎవరు?

భానుప్రియ.

**కె. డి. రమేష్‌రెడ్డి, భాగ్యనగర్**

మీరు రాజకీయాలలో ప్రవేశించి, నేటి సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అత్యాచారాలను రూపుమాపాలని ఎప్పుడైనా ఊహించుకున్నారా?

లేదు!

**పి.జి. కృష్ణవేణి, అనంతపూర్**

ఆడది మగాడి చేతిలో ఏ విధంగా మోసపోయేది సినిమాల ద్వారా చూపించినా– మళ్ళీ స్త్రీ మోసపోతూనే ఉంది. ఈ చరిత్ర మారదా?

ఆడదానిలో మోసపోయే గుణం వున్నంత వరకు మారదమ్మా.

**డి. అర్జున్‌రావు, టాటానగర్**

అక్కా! ప్రపంచంలో డబ్బుతో పొందలేని విలువైనది ఏమిటి?

సంతృప్తి!

**ఎం. డి. షేక్ వాహెద్, వంగూరు**

నీ దృష్టిలో నటుడి విలువ ఎక్కువా? లేక ప్రేక్షకుడి విలువ ఎక్కువా?

ప్రేక్షకుడి విలువ.

**టి. శేఖర్ రెడ్డి, అనపర్తి**

ప్రేమికులైన యువతీ యువకులను ప్రతీ తల్లి దండ్రులు ఆశీర్వదించి పెళ్ళి చేయాలంటాను. మరి మీరేమంటారు?

ఏమీ అనను.

## ఉత్తమ ప్రశ్న

**కె. విజయకుమార్, ఖమ్మం**

అక్కా! జీవితం అనే నాటకానికి హీరో హీరోయిన్లు ఎవరు?

మగవాడూ– ఆడదీ!

**ఎన్. కనకారావు, పర్లాకిమిడి**

ప్రభుత్వం చలన చిత్ర సీమను రద్దు చేస్తే, నటీనటుల పరిస్థితి ఏమిటి?

చాలా బాగుంటుంది – మీకా భయం అక్కర్లేదు.

మీ దృష్టిలో సెన్సార్ వారు చిత్రసీమకు బంధువులా, అతిథులా?

నెత్తి మీద మొట్టే – తెలుగు రాని – తెలుగు మాస్టర్లు.

**జి. రమేష్, చేర్యాల్**

మీ జీవితంలోని ఒక కోరిక......?

ఏ కోరిక లేకుండా వుండడం

**ఆర్. కేశవరావు, కలవగుంటపాళెం**

నానా తంటాలుపడి తెలుగు పరిశ్రమలో పైకి ఎదిగి, తర్వాత హిందీ పరిశ్రమలోకి వెళ్ళాక తెలుగు పరిశ్రమను చిన్నచూపు చూసే వారినేమనాలి?

ముందు వాళ్ళ పేర్లు చెప్పు – తర్వాత వాళ్ళ నేమనాలి అనేది నే చెబుతా!

**ఎ. కేశవరావు, దోహ — కత్తర్ (అరేబియా)**

దేవలోకంలో దేవీ ప్రియగా, ఈ లోకంలో భానుప్రియగా అవతరించారు మీరు. నిజమంటారా?

నీ వూహని కాదని నేనెందుకనాలి?

**ఎన్. యశోదవర్ధనరావు, మంగళగిరి**

ఇప్పటి వరకు మీరు ధరించిన పాత్రలలో "కాష్మోరా, పవిత్ర" చిత్రాలలోని పాత్రలు చాలా బాగున్నాయి మళ్ళీ ఓ మంచి పాత్రలో ఎప్పుడు కనిపిస్తారు?

ఛాన్సు వచ్చినప్పుడు.

**కె. ఏసు, గుంటూరు**

కష్టపడి చదివి డిగ్రీ సంపాదించినా నిరుద్యోగమే. ఏ క్వాలిఫికేషన్ లేకుండా సినిమాలలో చేరి లక్షలు సంపాదించవచ్చు. ఏమంటారు.

నీకు సంబంధించిన ప్రశ్నకి నువ్వే సమాధానం వెతుక్కోవాలి.

**ఎ. వరప్రసాద్, త్రిపురాంతకం**

నేటి సినిమాలపై మీ అభిప్రాయం?

మీ అభిప్రాయమేమిటి? 

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

____________________

పంపిన వారి పేరు ____________________

పూర్తి చిరునామా ____________________

____________________

# అభిమాన తారలపై అభిప్రాయం

డేరింగ్ అండ్ డాషింగ్ హీరో అని మరొకసారి నా పిలుపే ప్రభంజనం ద్వారా కృష్ణగారు నిరూపించుకున్నారు. అందువలననే సాహసానికి మరొక పేరు కృష్ణగారని చాలామంది మన సినీ ప్రముఖులు వర్ణించారు ఆయన అప్పటికి, యిప్పటికి, ఎప్పటికీ జేమ్స్‌బాండ్ హీరోయే అలనాటి అల్లూరి





సీతారామరాజు" నుండి నిన్నటి "నా పిలుపే ప్రభంజనం వరకు ఎన్నో విప్లవాత్మక చిత్రాలలో నటించి ఆయనకు మరెవ్వరూ సాటిరారని నిరూపించుకున్నారు కృష్ణగారికి గంభీర పాత్రలలో నటించడమనేది వెన్నతో పెట్టిన విద్యలాంటిది అందుకు తార్కాణము ఆయన నటించిన అగ్నిపర్వతాలు, పల్నాటి సింహం", ఖైదీ రుద్రయ్య లలో ఆయన పాత్రలే సూపర్ స్టార్‌గారు నటించిన ఎన్నో కుటుంబ కథా చిత్రాలు హిట్ అవ్వడము ద్వారా వానిలో కూడా తన సామర్థ్యము తక్కువకాదు అని అనిపించుకోగలిగారు యింకా ఆయన ఎన్నో విభిన్న తరహా పాత్రలు పోషించి ప్రేక్షకులచే భేష్" అనిపించుకోగలిగారు. అంతేగాదు ఆయన ఒక మంచి నిర్మాత, దర్శకుడు కూడాను ఇంత మంచి ఆల్‌రౌండర్ మన సినిమా రంగంలో యుండడము గర్వించదగిన విషయము

—ఎస్. శ్రీనివాసరావు, కొత్త అగ్రహారం, విజయనగరం

* * *

చిరుదరహాసిని, సుమధురహాసిని అయిన సుహాసిని నా అభిమాన నటి. కెమెరా ఉమన్ అయిన ఆమె





ఆంధ్రుల అభిమాన నటి కావటం గొప్ప విశేషం. 'కొత్త జీవితాలు' చిత్రం ద్వారా సినీరంగ ప్రవేశం చేసినా, మౌనగీతం" చిత్రం ద్వారా ఆమె ప్రేక్షకులలో అత్యంత గుర్తింపు పొందారు

మంగమ్మగారి మనవడు లో అందాల పల్లె పడుచుగా, "ముద్దుల మనవరాలు"లో హుషారైన మనవరాలుగా, "మాంగల్య బంధం లో ప్రేమ మూర్తియైన ఇల్లాలుగా, స్వాతి లో అన్యాయాలను నిర్భయంగా ఎదిరించే యువతిగా – ఇలా ఏ పాత్రలో నటిస్తే ఆ పాత్రకే ఒక ప్రత్యేకతను చేకూర్చటం ఆమెకు మాత్రమే దక్కింది ఏ చిత్రంలో నయినా ఎటువంటి పాత్రలో నయినా అసభ్యత గోచరించకుండా అద్భుతంగా నటించగలగటం ఆమె ప్రత్యేకత

ఆమె మాతృభాష తమిళం అయినప్పటికీ ఆమె ఎక్కువగా తెలుగు చిత్రాలలోనే నటించటం ఆంధ్ర అభిమానుల అదృష్టం. "సింధు భైరవి" చిత్రం ద్వారా ఆమెకు జాతీయ అవార్డు లభించినప్పటికి రాబోయే చిత్రాల ద్వారా ఇంకా అవార్డులు పొంది ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచి పోవాలని అభిమానిగా నా కోరిక.

—కె. ఉమాదేవి, ఇంద్రపాలెం, కాకినాడ

* * *

నా అభిమాన నటుడు శ్రీకైకాల సత్యనారాయణ గారు. ఆయన ఎటువంటి పాత్ర కైనా అవలీలగా నటించగల నవరస నటనా సార్వభౌముడు. కరుణ రస పాత్రధారిగా శారద, రామయ్య తండ్రి, దాదా మొదలైన చిత్రాలు... హాస్యనటునిగా "ముందడుగు"





చిత్రంలో ఆయన నటన మరువలేనిది బాధ్యతా యుతమైన పోలీసు అధికారిగా నాటి "ఇద్దరు దొంగలు మొదలుకొని నేటి తండ్రి – కొడుకుల చాలెంజ్' వరకు, విలన్‌గా అసంఖ్యాకమైన చిత్రాలలో ఆయన నటన మహోన్నత శిఖరాలను అధిరోహించి ప్రేక్షకులచేత జేజేలు పలికించింది. ఆయన గంభీరమైన భారీ విగ్రహంతో హుందాగా ఎంతో క్లిష్టమైన సంభాషణలను సైతం చక్కని అభినయం ద్వారా ముఖంపైభావ ప్రకటన చేయగల మహానటుడు సత్యనారాయణగారు మరెన్నో చిత్రాలలో తన అద్వితీయ నటనను ప్రదర్శించి మమ్మానందింప జేయాలని కోరుకుంటున్నాను

—వై. రామక్రిష్ణారెడ్డి, ప్రొద్దుటూరు

* * *

నా అభిమాన నటుడు టీనేజర్స్ క్రేజ్ హీరో భానుచందర్. తరంగిణి చిత్రం చూసి నేను భాను అభిమానిని అయ్యాను. రేచుక్క, పసాద్, డిరర్, భలే మిత్రులు చిత్రాలలో భాను నటన చెప్పుకో దగ్గ విధంగా వుంది. నేటి మన సినీ పరిశ్రమ వారసత్వం అయిపోయింది. ఏ కొద్ది మంది మటుకో తమలో వున్న- ఎంతో కొంత కళతో అయినా తమ స్థానాలను నిలుపుకుంటున్నారు. అలాంటి వారిలో భాను ఒకడు. తనలోని ఫైట్స్ నైపుణ్యంతో ప్రేక్షకులను రంజింపజేయగలుగుతున్నాడు. 'నిరీక్షణ' చిత్రంలో భాను నటించిన పాత్రను నేడు ధ్రువ తారలుగా వెలుగొందుతున్న ఏ హీరో అయినా నటించటానికి వెనుకాడతారని





చెప్పగలను. ఎందుకంటే నేటి సినిమాలలో హీరో యిమేజ్ పాడయిపోతుందనే ఉద్దేశ్యంతో హీరోయిజాన్నే చూపిస్తారేగాని పాత్రానుగుణంగా నటన కనిపించటం లేదు. చివరగా నేను చెప్పేది ఏమిటంటే భాను కేవలం ఫైట్స్‌కే పరిమితం కాకుండా 'మంచి మనుసులు' చిత్రంలాంటి చిత్రాలలో నటించాలని, డాన్స్ కూడా ప్రాక్టీస్ చేస్తే మంచిదని, కరాటేలో బ్రౌన్ బెల్ట్ సాధించిన నా అభిమాన నటుడు భాను బ్లాక్ బెల్ట్ కూడా సాధించాలని కోరుకుంటున్నాను.

—దిడ్ల జక్రయ్‌బాబు, గొరగనమూడి (ప.గో.)

* * *

ప్రేక్షకాభిమానుల హృదయాలలో తనదైన ప్రత్యేక నటనాపటిమతో తన మొదటి చిత్రం "కలియుగ పాండవులు" తోనే చెరగని ముద్ర వేసుకున్నారు వెంకటేష్ గారు. వారికి నా హృదయ పూర్వక అభినందనలు.

"కలియుగ పాండవులు" చూసిన కొద్దీ మళ్ళీ మళ్ళీ చూడాలి అనిపిస్తుందేది నామనస్సుకి. వెంకటేష్ గారు తన మొదటి చిత్రంలోనే వడిదుడుకులు





లేకుండా ఎంతో చక్కగా నటించినందుకు నేను ఎంతో గర్వపడుతున్నాను.

అంతేకాకుండా కోట్లాది మంది ప్రేక్షకాభిమానుల హృదయాలలో ముద్రవేసుకొని ఎంతో పేరు పొందుతారు అని నూతన సంవత్సర శుభాకాంక్షలతో తెల్పుచున్నాను.

—బి. సత్యవతి, శృంగవరపుకోట



"కళ్యాణ తాంబూలం"లో విజయశాంతి, శోభన్‌బాబు

# సినిమా విశేషాలు

-జీ.వి.జీ.

## "జ్వాలాముఖి"లో యువరాజా

వేలు తీవిగా వచ్చి ఈ ఊళ్ళో మేము ఫ్రీగా ఉండడానికి మాంచి ఫైవ్‌స్టార్ హోటలుందా? అని అడిగాడు అప్పారావు చక్రవర్తి రాజేంద్ర ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు ఫైవ్ స్టార్ హోటల్స్ లేవు అని చక్రవర్తి అంటే ఈ ఊరు మొత్తం మీద బేవార్స్‌గా టీ సప్లయ్ చేసేది నేనొక్కడ్నే నండి, అన్నాడు అప్పారావు

వేలు సంతృప్తిగా అంటే ఇప్పుడు నాక్కూడా బేవార్సుగా టీ దొరికే అవకాశముందన్న మాట' నాకు మీ ఊరు నచ్చిందోయ్' ఉన్న పదిహేను రోజులూ ఇక్కడే ఉండాలని నిర్ణయించుకున్నాం నేను దేవేంద్రపురి యువరాజును నా పేరు విక్రమ కుమార మంగళ మృత్యుంజయవర్మ ఈ సంగతి బ్రహ్మకు కూడా తెలియకూడదు పదిహేనో రోజున నా కోసం ఓ బంగారు విమానం వస్తుంది ఓ వెండి పల్లకి వస్తుంది స్వర్ణ సింహాలు మా తండ్రిగారు – మరో పదిహేను రోజుల్లో నాకు పట్టాభిషేకం చేసి వానప్రస్థం వెళ్ళిపోవాలని సంకల్పించు కున్నారు. మా కుటుంబ సాంప్రదాయం ప్రకారం రాజ్యాభిషేకానికి ముందు ఓ పదిహేను రోజులు దేశ సంచారం చెయ్యాలి అయితే ఓ చిక్కుంది ఈ పదిహేను రోజులూ జేబులో పైసా లేకుండా బ్రతకాలి దొంగతనం చెయ్యకూడదు. అడుక్కోకూడదు అప్పు చెయ్య కూడదు మా తర్వాత రాజవంశీయులు సగర్వంగా మీసం తిప్పుకునేలా బ్రతకాలి అంటూండే సరికి అక్కడున్న యువకులు ఒక్కొక్కరుగా తమ చెవుల్లో పువ్వు లెట్టుకున్నారు

అయ్' చెప్పండి అందరి చెవిలో అన్ని రకాల పూలెట్టేసినారు తమరు అన్నాడు అప్పారావు

మీ చెవుల్లో అంతకు ముందు నుంచే పువ్వులున్నాయ్ ఇవ్వాళ నేను కొత్తగా పెట్టాల్సిన పనిలేదు కాలేజీలో డొనేషన్ కట్టి మరీ సంపాదించుకున్న డిగ్రీలు మీ చెవిలో ప్రభుత్వం పెట్టిన మొదటి కాగితం పువ్వు అదిగో అక్కడ ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌ఛేంజ్ ఉందే– అది మీ చెవిలో ప్రభుత్వం పెట్టిన ఉమ్మెత్త పువ్వు మీకిచ్చిన రిజర్వేషన్‌లు మీ రెండు చెవుల్లో ప్రభుత్వం పెట్టిన గన్నేరు పువ్వు ఆ పువ్వులుండగా మీరు మళ్ళీ ఈ ప్లాస్టిక్ పువ్వులు పెట్టుకోవడం దండగ, అన్నాడు వేలు

దాంతో అందరూ చెవుల్లోని పువ్వులు తీసేశారు

ప్రముఖ ఛాయాగ్రాహకుడు వి ఎస్ ఆర్ స్వామి దర్శకత్వంలో అల్లూరి సూర్యనారాయణ రాజా నిర్మించే జ్వాలాముఖి చిత్రం పుయ్యూరు బసివిరెడ్డి సమర్పణ

## సత్యమూర్తి దర్శకత్వంలో 'కిరాయి రౌడీ'గా భానుచందర్

సెంటిమెంట్ క్రయిమ్ సెక్స్ హ్యూమర్ అన్నీ సమపాళ్ళలో ఉంటాయి ఫిబ్రవరి నుంచి ఏప్రిల్ వరకు షూటింగ్ అన్నారు సత్యమూర్తి ఈయన రచన దర్శకత్వంలో ఆర్ ఆర్ సత్యం నిర్మించే ఉదయబాను మూవీస్ పై చిత్రంలో బానుచందర్ అశ్విని, శ్రీలక్ష్మి వై విజయ దేవి అనూరాద రాళ్ళపల్లి, వేలు కోట శ్రీనివాసరావు నాగేష్ ఆదిగా గల వారు పాల్గొంటున్నారు చక్రవర్తి సంగీతం బాలు శిల్పం దివాకర్ ఛాయ వెంకటరత్నం కూర్పు నిర్వహిస్తున్నారు

(56వ పేజీ చూడండి)

"జ్వాలాముఖి"లో రమ



వై. హరికృష్ణ సారథ్యంలో శ్రీనికేతన్ ఆర్ట్ క్రియేషన్స్ శోభన్‌బాబు సమర్పించు




SREE PUBS

# బాపు కళ్యాణ తాంబూలం

సినిమా స్కోప్

ముళ్ళపూడి వెంకటరమణ కె.వి.మహాదేవన్ శరత్ గౌతంరాజు.

వై. రాజ్యలక్ష్మి. బి.లక్ష్మి

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## దృక్పథం మారాలి

ముద్దులు మూటగట్టే చిన్నారి బాలల్ని చూస్తే ఎవరికైనా సంతోషం వేస్తుంది నేడు భారతదేశంలో ఎంతో మంది బాలలు అతి చిన్న వయసులోనే శక్తికి, వయసుకి మించిన పనులలో నియుక్తులగుచున్నారు ఈ పరిస్థితికి తలిదండ్రులు, చుట్టూ ఉన్న వాతావరణం, స్నేహితులు, ఆర్థిక పరిస్థితులు చాలామటుకు దోహద పడుచున్నవి పాశ్చాత్య దేశములలో ఒక వ్యక్తి అనేక వివాహములు చేసుకొనుట వలన పిల్లలు సవతి తల్లి లేదా తండ్రి అసూయా, ద్వేషములకు బలవుతున్నారు మన దేశంలోని బాలలకి ఇటువంటి సమస్యలు లేవు కొంతవరకు నయం పేదలు వీలైనంత ఎక్కువ సంతానం కని గాలికి పెంచినట్లు పెంచి చదువు సంధ్యలు చెప్పించక, వారిని ఫ్యాక్టరీలకో, కూలీ పనికో పంపించి వారు సంపాదించే అతి తక్కువ వేతనములకు ఆశపడి ఆ యా పిల్లల భవిష్యత్తు పాడు చేయుచున్నారు కొందరు చిన్న పిల్లల కాళ్ళు, కళ్ళు, చేతులు, చెవులు మొదలగు అవయవములు విరిచి, రోగాలు సృష్టించి వారిని బాల్యంలోనే బిచ్చగాళ్ళుగా మారిస్తే, మరికొందరు వారిని దొంగలుగా, మోసగాళ్ళుగా, సంఘ విద్రోహులుగా మారుస్తున్నారు ఇక ధనిక వర్గాలలోని బాలలు తలిదండ్రుల ప్రేమానురాగాలు కరువై, ధనం ఎక్కువగా అందుబాటులో ఉండుట వలన చెడు అలవాట్లకి బానిసలగుచున్నారు అక్రమ సంతానముగా జన్మించిన బాలలు అనాథ శరణాలయాల పాలగుచున్నారు ఆకలిబాధ తాళలేక ఎందరో పిల్లలు తరచూ దొంగతనాలకి పాల్పడుతున్నారు

వీటన్నిటికి పరిష్కార మార్గములు కలవు తలి దండ్రులచే అమ్మివేయ బడిన బాలలను వెట్టి చాకిరి నుండి విముక్తి చేయాలి పేదలు మిత సంతానంతో తృప్తి పడి వారి పిల్లలను



విద్యావంతులను గావించాలి ధనికులు తమ పిల్లల భవిష్యత్తు దగ్గరుండి తామే తీర్చిదిద్దాలి అనాద శరణాలయాలలోని పిల్లలకు పెద్దల ప్రేమానురాగములతో బాటు సరియైన విద్య, వసతి కల్పించి మంచి నడవడి నేర్పించాలి ఫ్యాక్టరీలలోగాని, మరే రంగములలో గాని చిన్న పిల్లలను పని కొరకు నియమింప కూడదు బాల బిచ్చగాళ్ళను సంస్కరించి వారికి ఉచిత విద్యా, భోజన వసతులు కల్పించాలి దీనికి ప్రభుత్వంతో పాటు స్వచ్ఛంద సంస్థలు కూడా నడుం కట్టి ప్రజల దృక్పథంలో పిల్లల యెడ ప్రేమానురాగాలు, జాలి, సానుభూతి కలిగేలా మార్పు తేవటమే కాక తగిన చర్యలు, చట్టాలు చేయాలి అప్పుడు మాత్రమే ఈ భావి పౌరులు పెరిగి ఉత్తమ పౌరులుగా తయారు కాగలరు

ఉద్దెమర్రి పద్మావతీదేవి,
ఆదిలాబాద్

కుటుంబనియంత్రణ పాటించి వుంటే మన పిల్లల్ని అనాథ శరణాలయానికి పంపించ బాధుండకపోను కదండీ!!

## బాగుపడే అవకాశం ఉంది

ఎందరో ముక్కు పచ్చలారని బాలలు పుస్తకం, కలం చేపట్టే వయస్సులో గనుల త్రవ్వకాలు, క్రిమి సంహారక సంబంధమైన పరిశ్రమలు, బాణసంచా తయారీలాంటి ప్రమాద కరమైన ఉద్యోగాలు చేపట్టి, ఆకలి మంటల మధ్య కొట్టు మిట్టాడుతూ పౌష్ఠికాహార లోపం వల్ల పేదరికం, అనారోగ్యం, అశుచిత్వాల విష వ్యూహంలో బంధింపబడి నలిగి పోతున్నారు ప్రపంచంలో 29 కోట్ల మంది బాలలు కనీస అవసరాలకు కూడా నోచుకోక దరిద్ర దేవత గుప్పిట్లో కుమిలి పోతున్నారు మన దేశంలో తల్లిదండ్రుల నిరాదరణకు లోనయి 3 వేల మంది అపరాధాలు చేసి కటకటాల వెనుక కన్నీళ్ళు కారుస్తున్నారు అంతర్జాతీయ కార్మిక సంస్థ ప్రకారం వర్ధమాన దేశాల్లో 15 మిలియన్ల బాలలు ప్రమాదకరమైన వృత్తులు చేస్తూ నిరక్షరాస్యతకూ, శ్రామిక దోపిడీకి, యజమానుల దౌర్జన్యానికి గురవుతున్నారు ఏటా పోలియో వ్యాధికి 2 లక్షల బాలలు గురవుతుంటే, 30 కోట్ల మంది బాలలు వికలాంగులయి, జీవితాంతం పనికిరానివారవుతున్నారు

తమ తోటి వయసువారు సమ వస్త్రాలు ధరించి పాఠశాలకు వెళుతుంటే బీడీలు చుడుతూ, బూట్ పాలిషింగ్ చేస్తూ వారిని వింతగా చూసే బాలల అమాయక చూపులు ఎంత కఠిన హృదయంగలవారి కళ్ళలోనూ నీరు నింపక మానవు ఈ సమస్యకి కారణాలు ఎన్నో ఉన్నా కొన్ని ముఖ్యమైనవి, పరిష్కారమార్గం సునాయాసంగా లభించేలా చేసేవి ఉన్నాయి అవి,

1 గర్భధారణ సమయంలో స్త్రీలు సంతులిత పోషక ఆహారం తీసుకునేలా ప్రభుత్వం సౌకర్యాలు కలిగించాలి

2 సరయిన వైద్య సదుపాయాలు కలిగించి, బాలల్ని దీర్ఘకాలిక వ్యాధుల బారి నుండి రక్షించాలి మురికివాడల పరిస్థితి మెరుగుపరచాలి

3 బాలలందరికీ నిర్బంధోచిత ప్రాథమిక విద్య అందించాలి

4 తప్పనిసరి పరిస్థితుల్లో కార్మికులయిన బాలలకు సరయిన వేతనాలు అందేలా నూతన చట్టం అమలు పరచాలి వారు పనిచేసే కాలాన్ని 3 గంటల అవధికి తగ్గించేందుకు కార్మిక మంత్రిత్వశాఖ గట్టి చర్యలు తీసుకోవాలి బాలల అభివృద్ధికి కృషి చేసే సంస్థలకి అవార్డులిచ్చి ప్రోత్సహించాలి అంతేకాక సమగ్ర స్త్రీ, శిశు సంక్షేమ కార్యక్రమాల్లో బలహీన వర్గాల ప్రజలకి కూడా పాల్గొనే అవకాశం కల్పించాలి బాల కార్మికులకు విద్య, వైద్య సౌకర్యాలతో బాటు వసతులు కల్పించి, మానసిక, సాంస్కృతిక వికాసానికై రిక్రియేషన్ సౌకర్యాలు కల్పించాలి మానవ వనరుల అభివృద్ధి శాఖలో బాలల సంక్షేమానికి ప్రత్యేక విభాగాలు ఏర్పాటు చేయాలి వర్ధమాన దేశాలు ఆయుధ సామగ్రికై ఖర్చు పెట్టే డబ్బులో 25 శాతం పిల్లల విద్య, వైద్య, రక్షిత నీటి సదుపాయాలకై వినియోగిస్తే, రేపటి పౌరులైన బాలలెందరో బాగుపడే అవకాశం ఉంటుంది

-ఎ.ఎస్. రమేష్, బెంగుళూరు

నేడు: ఆకలి... ఆకలి...

రేపు: ప్రభుత్వం చర్యలు తీసుకున్నాక...

# అందరి బాధ్యత

"పసి పిల్లలు దేవుని ప్రతిరూపాలు' అని మన శాస్త్రాలు వచించి వున్నాయి అయితే మన దేశంలో చిన్నారి బాలల పరిస్థితులను పరికించి చూస్తే మాత్రం యిందుకు విరుద్ధంగా కనిపిస్తున్నది ఎన్నో లక్షలమంది బాల బాలికలు ఎంతో దీనస్థితిలో, దయనీయ పరిస్థితులలో బ్రతుకుతున్నారు చదువుకోవలసిన వయస్సులోనే శరీరశ్రమకు అలవాటు చేయబడుతున్నారు పరిశ్రమలలో, వ్యవసాయ క్షేత్రాలలో, యితరచోట్ల ఎందరో బాల బాలికలు పనులు చేస్తూ జీవిస్తున్నారు దోపిడీ అనే ఆయుధం అభంశుభం ఎరుగని బాలబాలికలను కూడ ఎంతో దారుణంగా బలితీసుకుంటున్నది అనునిత్యం



మనం వార్తా పత్రికలలో చూస్తూనే వున్నాం- అమాయకులైన బాలికలపై అత్యాచారం జరగడం ఇది చాలా చిన్నతనంతో, సిగ్గుతో, తలవంచుకోవలసిన పరిస్థితి

మనదేశంలో బాలబాలికల స్థితి యీ విధంగా వున్నదంటే కారణం- ముఖ్యంగా 'పేదరికమేనని' చెప్పవచ్చు బిడ్డలద్వారా కొంత ధనం రోజూ సంపాదించుకోవచ్చుని, కుటుంబ పోషణ జరుపుకోవచ్చుని ఆశతో ఎందరో తల్లిదండ్రులు తమ బిడ్డలను పాఠశాలలకు పంపకుండా కార్మికశాలలకు పంపుతూ వారి జీవితాలను కష్టాలమయం చేస్తున్నారు యజమానులు కూడ పిల్లలచేత అన్ని రకాల పనులు చేయిస్తూ ఒక్కోసారి పిల్లలను ప్రమాదకర పరిస్థితులలో పడవేస్తున్నారు తల్లిదండ్రుల పోషణ లేక నిర్లక్ష్యానికి గురై తిరుగుతున్న




బాలబాలికలను కొందరు సంఘ విద్రోహులు చేరదీసి వారిచేత నేరాలు చేయిస్తున్నారు యాచకవృత్తి, పడుపువృత్తి ఆడపిల్లల పాలిటి శాపాలుగా తయారయ్యాయి ఈ విధమైన దోపిడీ వ్యవస్థలో బ్రతుకుతున్న బాలబాలికలు రేపటి పౌరులుగా రూపుదిద్దుకొని జాతి భవిష్యత్తును గర్వించదగ్గ స్థాయిలో నడిపించగలరని ఎలా ఆశించగలం?

ఈ సమస్య పరిష్కరింపబడాలంటే అందరి కృషి, ప్రయత్నము ఎంతో అవసరం తల్లిదండ్రులు బిడ్డలను ఎన్ని కష్టనష్టాలనైనా భరించి పాఠశాలల్లో చేర్పించాలి పసిపిల్లలచేత కూలీ చేయించటం, ఫ్యాక్టరీలలో పనిచేయించడం చట్టవిరుద్ధం ఈ విషయాన్ని కఠినంగా అమలు పరచాలి అనాథ బాలబాలికలు సంఘ విద్రోహశక్తుల చేతుల్లోకి వెళ్ళకుండా వారిని అనాథ శరణాలయాలలో చేర్పించి వారికి వృత్తి విద్యలు నేర్పించాలి పసి పిల్లల ఎడ అకృత్యాలకు, అరాచకాలకు పాల్పడేవారికి శిక్షలు కఠినతరం చేయాలి పసిపిల్లల మనస్సుల్లో స్వచ్ఛత, నీతినిజాయితీలపట్ల, శీల సంపదపట్ల గౌరవం పెరగాలంటే వారిపట్ల సమాజం శ్రద్ధవహించి తీరాలి అప్పుడే వారిభవిష్యత్తు ఆనందమయం అవుతుంది

–ఇ.టి. రామారావు, శ్రీహరికోట

# బాధ్యత ప్రతి ఒక్కరికీ ఉంది

నేటి బాలలే రేపటి పౌరులన్నారు ఆ బాలలను ఆదర్శవంతమైన భారత పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత ప్రతీ పౌరుడి మీదా ఉంది ముఖ్యంగా తల్లితండ్రులు వారి భవిష్యత్‌పై ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి

చాలామంది పసివారి ద్వారా ఏమైనా పని చేయించుకోవాలనుకుంటే ఆ పసి వారికి ఆ పని చేస్తే పావలా ఇస్తామనో, సినిమాకు తీసుకెళ్తామనో, స్వీటు ఇస్తామనో ఆశపెట్టి ఆపని చేయించుకుంటారు అలా ఆ పసి వారిలో లంచగొండితనాన్ని ప్రవేశపెట్టి పెంపొందిస్తారు ఆ తర్వాత పిల్లలు ఏ పని చేయాలన్నా లంచం ఇస్తే కాని చేయమని మారాం చేస్తారు.

మరి కొంతమంది తల్లి తండ్రులు మగపిల్లలను మంచి కాన్వెంటులో చేర్పించి ఆడపిల్లలను మామూలు వీధిబడిలో జాయిన్‌చేసి చేతులు దులుపుకుంటారు ప్రతీ విషయం లోనూ మగవాడికన్నా ఆడపిల్ల తక్కువ స్థాయి అన్న భావన కలిగేలా ప్రవర్తిస్తూ ఉంటారు ఆ వ్యత్యాసం ఆ పిల్లలను ఎంతగా కృంగదీస్తుందీ ఆలోచించరు పిల్లలు స్కూల్‌నుండి ఆకలి, చిరాకుతో ఇంటి దగ్గర తల్లి ఒడిలో సేదదీరాలని గబగబా వచ్చేసరికి అమ్మ ప్రక్కింట్లో పిచ్చాపాటి కబుర్లతో, ఉండటం వారిని మరింత చిరాకు పరుస్తుంది పిల్లలు స్కూల్‌నుండి రాగానే వాళ్ళ చిరాకును మంచి మాటలతో పోగొట్టి సేదదీర్చే తల్లులు ఎంతమంది ఉన్నారు?

తల్లితండ్రుల నీడలో హాయిగా ఏ చీకూ చింతా లేకుండా పెరగవలసిన కొందరు పసివాళ్ళ జీవితాలు మరీ దీనంగా ఉంటాయి తల్లితండ్రుల్లో కొంతమంది పిల్లలు తమ సరదా జీవనానికి అడ్డు వస్తున్నారనో మరెందుకో నిర్లక్ష్యంగా హాస్టల్లోనో లేక తమ బంధువుల ఇళ్ళల్లోనో ఉంచి చదివిస్తుంటారు పిల్లల పట్ల తమ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించు తున్నామని ఆనందపడి పోతారే కానీ అక్కడ వారు ఏ బాధలు పడుతున్నారు వారి మానసిక పరిస్థితి ఎలా ఉంది అని కొంచెమైనా ఆలోచించరు అది ఆ పసివారిమీద ఎంతో ప్రభావాన్ని చూపుతుంది తల్లితండ్రులకు తామంటే ఇష్టం లేదని, అందుకే ఇలా తమని వదిలేశారని వాళ్ళకు మేమంటే ఇష్టం లేనపుడు మేమేం చేస్తేనేం అని వారిష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తూ ఉంటారు మరి కొందరు పసి బాలలు స్కూల్లో తోటి పిల్లలు డబ్బులు




తెచ్చుకుని తినుబండారాలు కొనుక్కుని తింటూ ఉంటే తామూ అలా కొనుక్కోవాలని దొంగతనానికి పాల్పడే సందర్భాలూ ఉంటాయి

పిల్లలు తప్పుచేస్తే మందలించ కుండా ఆ పిల్లల ఎదుటే అదేదో గొప్ప విషయంలా చెప్పుకుని సంతోషించే తల్లితండ్రులూ ఉన్నారు. తమ పిల్లలు తప్పుచేస్తే దాన్ని నలుగురి తోనూ చెప్తూ సమర్థించే తల్లి తండ్రులవల్ల కూడా పిల్లల భవిష్యత్ పాడయే అవకాశం ఉంది

కాబట్టి ప్రతీ ఒక్కరూ పిల్లల విషయంలో చాలా శ్రద్ధ తీసుకోవాలి పసివారి బంగారు భవిష్యత్‌కు సక్రమమైన బంగారుబాటవేసి ఆ బాటలో నే వారిని నడిపించే బాధ్యత ప్రతీ ఒక్కరి మీదా ఉంది

-చెన్నా కృష్ణవేణి, సాయినగర్, విజయనగరం ☐

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్






సాయం సమయం

రామకృష్ణా బీచ్ షికారు కొచ్చిన జనంతో సాగర కన్య ధరించిన చీర అంచులా వుంది

కెరటాలు యవ్వన శోభతో ఎగిరెగిరి పదు తున్నాయి

నైటింగేల్ ఒడ్డున కూర్చుని నూతన్ రాకకోసం ఎదురు చూస్తోంది.

ఇంతలో రానే వచ్చాడు నూతన్

"దేవిగారు నా రాకకోసం చాలాసేపటి నుంచి ఎదురు చూస్తున్నట్టున్నారే" అంటూ నవ్వుతూ ఆమె పక్కనే చతికిలబడి కూర్చున్నాడు

అందంగా నవ్వింది నైటింగేల్

నవ్వినప్పుడు బుగ్గలు సొట్టలు పడ్డాయి

ఆ బుగ్గల అందానికి లిప్తకాలం ముగ్ధ దయ్యాడు నూతన్

అవును ఈ రాజాగారి కోసం ఈ దీనురాలు ఇలా అస్తమానం ఎదురు చూడటం తోనే గడిచి పోతోంది ఈ ఎదురుతెన్నులు ఇంకెంత కాలం బాబు?' బుంగమూతి పెడుతూ చిరుకోపంతో అంది నైటింగేల్

అతను అల్లరిగానవ్వాడు

ఆ నవ్వులో అందమైన పెదాల విరుపుకు పరవశించిపోతూ అలాగే చూస్తుండి పోయింది నైటింగేల్

"ఇంకెంతో కాలం లేదులే! మరొక్క నెల అంతే! ఈ లోపలే నాకు వుద్యోగం వచ్చేస్తుంది ఇంటర్వ్యూ ఎలాగూ అయిపోయిందిగా! ఇక అపాయింట్‌మెంట్ ఆర్డర్సు టైప్ చేసి ఇవ్వడమే తరువాయి అమ్మాయిగారి మెడలో మూడుముళ్ళూ వేసేయడం వెంటనే జరిగిపోతుంది సుతారంగా ఆమె చేయి నొక్కుతూ అన్నా దతను

నైటింగేల్ సిగ్గుల మొగ్గయింది

"నీలాంటి విశాల భావాలు గల యువకుడు నా జీవిత భాగస్వామి కాబోవడం నిజంగా నా అదృష్టం' అంది నైటింగేల్ ఆనందంతో పొంగిపోతూ

"నీలాంటి మంచి యువతిని, అందగత్తెని భార్యగా పొందబోవడం నాదీ అదృష్టమే' ఆమె కళ్ళలోకి ఆరాధనగా చూస్తూ అన్నాడు నూతన్

'అదృష్టం నీదికాదు నాది

'కాదు నాది '

కాదు నాది '

పోనీ మనిద్దరిదీను సరేనా!" అన్నాడతను హాయిగా నవ్వేస్తూ

ఆ నవ్వుతో ఆమె శృతి కలిపింది

నూతన్! అన్నట్టు చెప్పడం మరిచాను ఈ పత్రిక చూశావా' అంటూ వేనిటీబేగ్ లోంచి ఓ వార పత్రిక తీసి చూపించింది నైటింగేల్

"ఏమిటి ఇందులో విశేషం? ప్రశ్నించాడు నూతన్

నువ్వే చూడు" అంటూ పత్రిక అందించిం దతనికి

నూతన్ ఆ పత్రిక అందుకుని చూశాడు

ఆ వార పత్రికపేరు "నవతరం'

అట్ట పేజీ తిరగేశాడు

మొదటి పేజీలోనే ఒక ప్రకటన ఇలా దర్శన మిచ్చింది

నేడు సమాజంలో వరకట్న దురాచారం వేళ్ళూనుకుని శాఖోపశాఖలుగా విస్తరిల్లుతూ నానాటికీ ప్రబలిపోతోంది. రోజూ ఉదయం లేవగానే వరకట్న హత్యల దారుణాల గురించి పత్రికల్లో ఎన్నో వార్తలు చదువుతున్నాం మనం. అందుకే ఆ కట్న పిశాచాన్ని రూపుమాపాలని , యువతీ యువకులను ప్రోత్సహించడానికి మా పత్రిక ఓ నిర్ణయం తీసుకుంది కట్నం లేకుండా పెళ్ళి చేసు కోవా లనుకునే యువతీ యువకులు తమ ఆదర్శాలు రాసి ఫొటోలతో సహా పంపిస్తే వీలు వెంబడి వాటిని వరుసగా ప్రచురిస్తాం కట్నాల రక్కసిని రూపు మాపడమే మా ముఖ్యోద్దేశం ఇదే మా ధ్యేయం! యువతీ యువకులు మా పవిత్ర ఆశయానికి కంకణం కట్టుకుని ముందుకు రాగలరని ఆకాంక్షిస్తున్నాం సెలవ్!

–సంపాదకుడు

నూతన్ ఆ ప్రకటన చదివి–

ఆహా! ఈ పత్రికా సంపాదకులు యువతీ యువకులకు ఎంత చక్కటి అవకాశం కల్పించారు! నిజంగా వాళ్ళకి మనం చేతులెత్తి నమస్కరించాలి అంటూ తన హర్షాన్ని ప్రకటించాడు

ఆ సంపాదకులకు మనం నమస్కరించ నవసరంలేదు నూతన్! మనలాంటి యువతరానికి తిరిగి వాళ్ళే చేతులెత్తి నమస్కరిస్తారు ఎందుకో తెలుసా? సమాజంలో మంచి మార్పులు తెచ్చేవి

పత్రికలే! యువతని చైతన్యవంతం చేసేవి అవే! ఈ సమాజం ప్రగతిపథం వైపు పయనిస్తుంటే-- అలాంటి పత్రికలు స్థాపించిన సంపాదకులు ధన్యచరితు లవుతారు. ఆ ఆనందంలో వాళ్ళే మనకు చేతులెత్తి నమస్కరిస్తారు" అంది నైటింగేల్.

"నువ్వన్నది నిజం నైటింగేల్! సమాజంలో మార్పుకి కారణం పత్రికలే! వాటిని స్థాపించిన

డాక్టర్ సత్యశ్రీ &
సారె రామమోహన రావు



సంపాదకులు నిజంగా ధన్యజీవులు" మెచ్చుకున్నాడు నూతన్.

"అయితే ఈ పత్రిక్కి నీ ఫోటో పంపు. కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవాలనే నీ ఆశయం రాయి. కట్నాల రక్కసి కరాళ నృత్యం చేస్తున్న ఈ సమాజంలో నేటి యువతరానికి నీ ఆదర్శం కనువిప్పు కలిగించాలి. అదే నా కోరిక" చెప్పింది నైటింగేల్.

"అలాగే నైటింగేల్! తప్పకుండా నా ఫోటో పంపిస్తాను. నేటి యువతకి నా ఆదర్శం కొంత కాకపోతే కొంత అయినా కనువిప్పు కలిగిస్తే నా జన్మ ధన్యమౌతుంది". ఆవేశంగా....దృఢంగా అన్నాడు నూతన్.

సాగర కెరటాలు అతని మనసులోని ఆశయంలా ఆవేశంతో ఉప్పొంగి పడుతూ తీరాన్ని తాకుతున్నాయి.

"వెరీగుడ్! రేపే నీ ఫోటో పంపు. పత్రిక నీదగ్గరే వుంచు" అంటూ మెచ్చుకుంది నైటింగేల్.

అప్పటికి బాగా చీకటిపడింది.

బీచ్‌లో లైట్లు వెలిగాయి.

ఆదర్శాన్నే తమ ఊపిరిగా భావించే ఆ ప్రేమికులిరువురూ లేచి నిలబడి ఇళ్ళముఖాలు పట్టారు.

వాళ్ళ మనసులలోని ఆదర్శాలకి ప్రతీకలా సాగర కెరటాలు మరింత ఎత్తుగా ఆవేశంతో ఎగిసెగిసి పడుతూ తీరాన్ని తాకుతున్నాయి.

* * * * * * * * *

ఆరోజు సాయంకాలం.

ఎప్పటిలా రామకృష్ణా బీచ్ జనావళితో సముద్రం ధరించిన చీర అంచులా కళకళలాడుతోంది.

తీరమనే తన ప్రియుడితో సాగర కెరటాలు సరసమాడుకుంటున్నాయి.

వాళ్ళిద్దరూ ఒద్దున కూర్చునివున్నారు.

నైటింగేల్ ఇసుకలో పిచ్చుకగూడు కడుతోంది.

నూతన్ చిలిపిగాఆమె కాలుమీదకాలు వేశాడు.

గూడు విరిగిపోయింది.

పాదంకింద పాదం చిక్కుకుంది!

ఆమె విసురుగాకాలు లాక్కుంది.

"ఛీ! పెంకి" బుంగ మూతిపెడుతూ చిరుకోపంగా అందామె.

అల్లరిగానవ్వాడతను.

"నా గూడు విరగ్గొట్టావేం?" కోపాన్ని అభినయిస్తూ అడిగింది.

"ఆ గూడు విరగ్గొట్టినా నీకోసం మరో గూడు నాదగ్గర సిద్ధంగావుంది." అన్నాడు నూతన్.

"ఏదీ? ఎక్కడ?" చుట్టూ పరికించి చూస్తూ అందామె.

"కనిపించడం లేదూ!?"

"లేదు."

"ఇదిగో! ఇక్కడ" అంటూ షర్టు గుండీ తొలగించి అతని ఛాతీ ఎడమవైపు చూపుడువేలు పెట్టి చూపించాడు.

ఆమెసిగ్గుతో తల దించుకుంది.

"అవును. ఆ గూడు నాదే!" అంది మురిసిపోతూ.

"ఈ గూడు ఎప్పటికీ నీదే నైటింగేల్! ఇది మాత్రం ఎన్నడూ విరగదు. ఈ గూటిలో శాశ్వతంగా నువ్వే కాపుర ముంటావు!" ఆర్తిగా ఆమె కళ్ళలోకి చూస్తూ అన్నాడు నూతన్.

# కడలి కెరటం

నైటింగేల్ చాలాసేపు ఆరాధనా దృక్కులతో అతనినే చూస్తూండి పోయింది

అన్నట్టు అతగతం మరిచాను నవతరం వార పత్రిక్కి నీ ఫోటో పంపావా? అడిగిందామె

పంపాను నీకు మరో గుడ్ న్యూస్ కూడావుంది

ఏమిటది?

నాకు నిన్ననే పోస్టులో అపాయింట్‌మెంట్ ఆర్డర్ అందింది రేపటి నుంచి నేను వుద్యోగానికి హాజరు కావాలి చెప్పాడు నూతన్

ఓ ఫెంటాస్టిక్' ఎగిరిగంతేసి నంత పని చేసింది నైటింగేల్

ఇక మన పెళ్ళి త్వరలో నే జరిగి పోతుంది కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవాలనే మన ఆదర్శం త్వరలో నే నెరవేర బో తోంది' అన్నాడతను

నైటింగేల్ ఆనందం అవధులు దాటింది

ఆమె ఆనందం లాగే సాగర కెరటాలు కూడ అవధులు లేనట్టుగా ఎగిరెగిరి పడుతూ తీరాన్ని తాకుతున్నాయి

★ ★ ★ ★

'ప్రేమించి పెళ్ళి చేసుకోవడం పెద్ద గొప్ప కాదు అది అందరికీ తెలుసు' అన్నారు ఆనందరావు గారు

అవును నాన్నగారూ! మీరన్నది నిజం! ప్రేమించి పెళ్ళి చేసుకోవడం పెద్ద గొప్పేమీ కాదు గాని కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకోవడంలోనే అసలు గొప్పంతా వుంటుంది! అదే నిజమైన ఆదర్శం! అదే అసలు సిసలైన పెళ్ళి అవుతుంది! ఏమంటారు?" అడిగాడు నూతన్.

"పిచ్చివాడా!" నవ్వారు ఆనందరావుగారు.

"నా నిర్ణయం, నా ఆశయం మీకు పిచ్చిదిగానే కనిపించవచ్చు! నేను పిచ్చివాడినని మీరనుకోవచ్చు! కాని, కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవాలనుకునే నా ఆశయానికి ఎన్ని అడ్డంకు లొచ్చినా లక్ష్య పెట్టను' నూతన్ కంఠం దృఢంగా, దీక్షగా పలికింది

'చూడు ఆ తాడేపల్లిగూడెం వాళ్ళు లక్ష కట్నం ఇస్తా మన్నారు యాభై కాసుల బంగారం పెడతా మంటున్నారు నీకు కావాలంటే స్కూటర్ కూడ కొనిస్తారట! నిక్షేపం లాంటి సంబంధం అది ఎల్ల కాస్త నల్లగా వుంటే ఏం? వెతుక్కుంటే నలుపులో నూ తెలుపు అందాలు కనిపిస్తాయి! కట్నం పేరిట వచ్చే అంత డబ్బు మన జన్మలో కళ్ళ చూడగలమా? నువ్వే చెప్పు' అన్నారు ఆనందరావు గారు

నూతన్ మాట్లాడ లేదు

మౌనంగా వుండి పోయాడు

చూడు నూతన్! ఈ రోజుల్లో అంత డబ్బంటే మాటలు కాదు లక్ష రూపాయలు కట్నం అంటే మామూలు విషయమా? దానికి తోడు యాభై కాసుల బంగారం అంటే అదో లక్షపైనే వుంటుంది ఇకపోతే స్కూటర్ అదీ పదిహేను, ఇరవై వేలకు తగ్గదు ఇంకా ఆపైన పెళ్ళయ్యాక పండగలని, పబ్బాలని పెట్టు పోతలు వుండనే వుంటాయి వద్దంటే డబ్బొచ్చి పడుతుంది లేనిపోని ఆశయాలకి పోయి, ఆలోచనా రహితంగా ప్రవర్తించి, లక్షలు విలువ చేసే సంబంధాన్ని పోగొట్టుకోకు వచ్చే కట్నాన్ని కాలదన్నుకోకు బాగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికిరా!" అని హెచ్చరించి అక్కడి నుంచి నిష్క్రమించారు ఆనందరావుగారు.

ఆ మాటలు నూతన్ చెవుల్లో గింగురు మన్నాయి.

అతను ఆలోచనలో పడ్డాడు.

కళ్ళముందు లక్షల కట్టలు మెదిలాయి.

బంగారం కదలాడింది.

స్కూటర్ గిర్రున తిరిగింది.

పెట్టుపోతలు గుర్తొచ్చాయి.

ఆ వెనకనే అతని ఆశయం కూడ మదిలో మెదిలింది.

హు!

ఆశయం

ఆశయం

ఆశయం

అవును! ఆశయం సాధిస్తే ఒరిగే దేముంది? బూడిద తప్ప!

ఆదర్శాన్ని పాటించడం కోసం ఓ మెడలో పసుపుతాడు కడితే ఒరిగేది!?

ఏమీ లేదు!!

అదే ఆదర్శాన్ని వదిలేసుకొని మరో మెడలో ఓ పసుపుతాడు కడితే ఒరిగేవి?

లక్షలు!

ఆదర్శమా?

లక్షలా?

జీవితానికి ఏది ముఖ్యం?

నూతన్ మనసులో పోరాటం జరుగుతోంది

తుదకు ఆ పోరాటంలో –

ఆదర్శం ఓడిపోయింది

లక్షలు గెలిచాయి

మనసులో ఒక నిర్ణయానికి వచ్చాడు నూతన్

★ ★ ★ ★

ఆ రోజు సాయంకాలం రామకృష్ణా బీచ్‌లో నైటింగేల్‌ని కలిశాడు నూతన్

సాగర కెరటాలు ఒడ్డుని ఒరుసుకుంటూ విరిగి వెనక్కు వెళ్ళిపోతున్నాయి

అతను మౌనంగా కూర్చుని వున్నాడు

అలా వున్నావేం నూతన్? అడిగింది నైటింగేల్

అతను అదోలా నవ్వాడు.

ఆ నవ్వులో అందమైన పెదాల విరుపు లేదు.

ఆ నవ్వు కొత్తగా వింతగా అనిపించిందామెకు. ఆ నవ్వులో నిర్మలత్వం లేదు. స్వచ్ఛత అంతకన్నా కానరాలేదు.

ఆ నవ్వు చూడగానే నైటింగేల్ మనసు ఏదో చెడు శంకించింది.

"ఏమి లేదు. కాస్త వంట్లో నలతగా వుందంతే!" అన్నాడు నూతన్.

ఆమె అతన్ని అనుమానంగా చూసింది

నూతన్ ముఖంలో ఎక్కడా సుస్తీ చేసిన జాడ కొంచెం కూడ కానరాలేదామెకు

"లేదు నూతన్! నీకు వంట్లో బాగానే వుంది నువ్వేదో దాచి నాతో అలా అని అబద్ధం ఆడుతున్నావు కదూ? అవునా?' అడిగింది నైటింగేల్

నూతన్ మళ్ళీ అదోలా నవ్వాడు

'అవును అన్నాడు

"నువ్వు నా నుండి దాచిన ఆ విషయం ఏమిటో చెప్పు నేనేమీ అనుకోను అంది నైటింగేల్

కాని, అది నీకెలా చెప్పాలో తెలీటం లేదు నైటింగేల్!" బాధగా అన్నాడతను

ఫరవాలేదు చెప్పు

మరి నువ్వు బాధపడతావేమో!"

నేనేమీ బాధపడను చెప్పు ఫరవాలేదు '

"నన్ను క్షమించు నైటింగేల్! నిన్ను నేను పెళ్ళి చేసుకోలేను' ఎటో చూపులు తిప్పి అన్నాడు

అంతే!

ఆమె స్థాణువే అయింది

చాలాసేపు అలాగే చలనరహితంగా వుండి పోయింది

తరువాత తేరుకుని–



# ధర్మపథం వక్తృత్వం




ఉత్తమ గుణాల్లో కొన్ని సహజంగా అలవడి ఉంటాయి. కొన్ని అభ్యాసంవల్ల లభిస్తాయి. "అభ్యాసేన న లభ్యంతే చత్వారః సహజా గుణాః, దాతృత్వం ప్రియ వక్తృత్వం కవిత్వ ముచి తజ్ఞతా." అని పెద్దల నానుడి. దానం చెయ్యడం, ప్రియంగా మాట్లాడుట, కవిత్వం, ఔచిత్యం అనేవి పుట్టకతో వచ్చేవే కాని అభ్యాసంవల్ల అలవడవు.

మంచివక్తగా తయారవడం అటు వంటిదికాదు. వక్తృత్వమనేది అలవాటు పైనే ఆధారపడి వుంటుంది. వ్యక్తి ప్రతిభావంతుడే కావచ్చును. నలుగురి మధ్యా కూర్చుని యిష్టాగోష్ఠితో సయుక్తికం మాటలాడి ప్రశంసలు పొందవచ్చును. కాని వేదికపై కెక్కి మాటలాడలేకపోవచ్చును. వక్త కాని వాడు ఉపన్యసించలేడు. ప్రతిభా వంతులు కూడా వేదికకెక్కి నోటమాట వెలువడక నవ్వుల పాలు కావడం ఉన్నది.

ఒకవ్యక్తి పేరు నరసింహాచార్యులు. కాని, ఆయనను అందరూ "రంగనాయ కులుగా" రనే పిలిచేవారు. ఆపేరెలా వచ్చినదీ తెలియదు. ఆపేరుతో పిలిస్తే ఏమీ అనుకునేవారుకారు. అసలు పేరు ఏ కొద్ది మందికో కాని తెలియదు. ఆయన తమ ఇంటి అరుగుపై కూర్చుని నలుగురితోనూ ఇష్టాగోష్ఠి జరిపేవారు. యుక్తిపరులు. అందరికీ చక్కని సలహాలిచ్చేవారు. జాతీయవాది. కాని ఎన్నడూ సభ కెక్కలేదు.

ఒకసారి ఆ వూళ్లో ఒక సభ జరిగింది. పైచోట్లనుంచి కొందరు కాంగ్రెసు నాయకులు వచ్చారు. జనం కూడా నలభై ఏభై మందికి ఎక్కువగా లేరు. ఒకరిద్దరు ప్రసంగించాక సభాధ్యక్షుడు, "ఇకమీద రంగనాయకులుగారు మాట్లాడతారు" అని, ఆయనను వేదికపైకి రమ్మని ఆహ్వానించాడు. ఆయన వేదికపై కెక్కేసరికి ముచ్చెమటలూ పోశాయి. నోటమాట రాలేదు. తడువుకుంటూ నాపేరు రంగనాయకులు కాదు. నరసింహాచార్యులు. నిశ్చయము. ముమ్మాటికీ నిశ్చయము. నేను జాతీయ వాదిని. నిశ్చయము. ముమ్మాటికీ నిశ్చయము" అని చెప్పి, మరి మాట రాక కిందికి దిగిపోయారు. సభ నవ్వులతో నిండిపోయింది. తెలివి తేటలూ, ఆలోచనలూ ఉన్నా, ఉపన్యసించే అలవాటు లేనందువల్లనే ఇలా జరిగింది.

ఉపన్యాసం ఇవ్వడానికి అలవాటు పడాలి. వక్తృత్వం ఉండాలి. అది వున్నప్పుడు ఉపన్యాసంలో విషయం లేకపోయినా - చెప్పినది అర్థం కాకపోయినా అందరూ "బాగా ఉపన్యసించారు" అని మెచ్చుకుంటారు.

సభల్లో ఉపన్యసించే నాయకుల్లో చాలామంది ముందు వక్తృత్వాన్ని అలవాటు చేసుకుంటారు. చెప్పవలసిన విషయాన్ని పదిసార్లు మననం చేసుకుంటారు. లేకపోతే, వేదిక ఎక్కేసరికి చాలా విషయాలు మరపునకు రావచ్చును. అందువల్లనే మననం కావాలి. అలవాటువల్ల ధోరణి కలుగుతుంది. "అనగ నగగ రాగ, మతిశయిల్లుచునుండు - తినగ తినగ వేము తియ్యనుండు" అనిగదా వేమన సూక్తి. మనం మంచి వక్తలం కావా లంటే దానికి తగిన అభ్యాసం ఎంతైనా అవసరం.

—బులుసు వేంకట రమణయ్య

"నువ్వు నాతో పరాచిక మాడుతున్నావా?" అని అడిగింది అనుమానం తీరక

"లేదు నైటింగేల్ నేను హాస్యమాడటంలేదు నిజమే చెబుతున్నాను!" అన్నాడతను.

"కారణం ఏమిటి?" అని అడిగింది

"లేనిపోని ఆదర్శానికి పోయి లక్షలు విలువ చేసే కట్నాన్ని వదులుకోవడం నా కిష్టం లేదు. మా నాన్నగారు నాకో ఖరీదైన సంబంధం చూశారు నేను ఆ అమ్మాయినే పెళ్ళి చేసుకోదలచుకున్నాను. నిన్ను కాదంటున్నందుకు నన్ను మన్నించు" సీరియస్‌గా అనేసి అక్కడి నుంచి లేచి నిలబడి వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు నూతన్.

'హుఁ" బాధగా నవ్వుకుంది నైటింగేల్

కళ్ళలో నీళ్ళూరాయి

బొట్లు బొట్లుగా బుగ్గల మీదుగా జాలు వారుతూ ఇసుకలో ఇంకి పోతోందా కన్నీరు

ఆమె వానిటీ బేగ్‌లోంచి ఆ రోజే మార్కెట్లోకి విడుదలైన "నవతరం" వారపత్రిక బయటికి తీసింది. ఆ పత్రిక ఆమె నూతన్‌కి ఇద్దామని వెంట తెచ్చింది.

పేజీలు తిరగేసి చూసింది.

ఓ పేజీలో నూతన్ ఫోటో ప్రచురింపబడి వుంది.

ఆ ఫోటో కింద- తను అసలు కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకుంటాడని, అది తన జీవితాశయమని, కట్నం తీసుకునే యువకులు తన దృష్టిలో నీచులని, నికృష్టులని. ఇంకా ఏవేవో పెద్ద పెద్ద పదాలు ప్రయోగిస్తూ అతను రాసిన మేటరు అచ్చు అయివుంది

నైటింగేల్ పెదాలపై బాధాపూరితమైన ఓ శుష్కహాసం వెలిసింది.

"వరకట్నమా! వర్ధిల్లు!! వర్ధిల్లు!!!" అస్ప ష్టంగా.. ఆవేదనగా గొణుక్కుంది.

అప్పుడే ఓ కదలి కెరటం నూతన్ మనసులోని ఆశయంలా ఆవేశంగా ఎగిరెగిరి పడుతూ వచ్చి ఒడ్డుని తాకి విరిగి వెనక్కు వెళ్ళి పోయింది.

నైటింగేల్ ఆ కెరటాన్ని చూస్తూ అలాగే నిస్తేజంగా వుండి పోయింది. □




జి. ఆర్ పి జిల్లేడుపల్లె

★ మనదేశం సోషలిస్టు దేశంగా ఎప్పుడు మారుతుంది?

● ఇప్పుడు కాదా?!

★ మన ముఖ్యమంత్రిపై మీ అభిప్రాయం?

● ధైర్యంకల మనిషి!

★ చాలామంది బీదవారి బిడ్డలు తెలివిలేని మూర్ఖులుగా జన్మిస్తారు ఇది వారిక భగవంతుడిచ్చిన శాపమా?

● ఎవరు చెప్పారీ సూత్రం? అది శుద్ధ తప్పు మూర్ఖత్వానికి పుట్టుకకాదు కారణం తెలివైన పేదవారు, మూర్ఖులైన గొప్పవారే ఎక్కువ!

★ జ్ఞాపకానికి జ్ఞానానికి తేడా?

● జ్ఞాపకం – వస్తు, విషయ సేకరణ జ్ఞానం అంతఃకాంతి

★ పాఠకులు ఏం అడిగినా కోపం చేసుకోక మీరు సమాధానాలు చెప్తున్నందుకు కంగ్రాట్స్!

● కోపం – చేతకానివారి ఆయుదం అని నా నమ్మకం నాకు కోపంరాదు ఒళ్ళు మండుతుంది! అంతే

సి. హెచ్. ఎస్. మోర్తి ప. గో. జి

★ మీరు రచనలు చేయుట వివాహమునకు పూర్వమా? వివాహము జరిగిన తరువాతనా? దయచేసి తెలుపగలరు

● వివాహానికి పూర్వం నుంచీ – రచనలు చేస్తున్నాను శ్రీ ఆరుద్ర నా తొలి కథల సంపుటికి 53లో పీఠిక కూడా రాశారు! ఎందుకొచ్చిందీ అనుమానం?!

వి. హెచ్. ఆర్. హైదరాబాదు

★ మీ దృష్టిలో ధనికుడెవ్వరు?

● అప్పు చేయనవసరం లేనివాడు పొగడవలసిన అవసరం లేనివాడు!

బి. వి. ఆర్. కె. వి. ఆర్. నందివెలుగు

★ నేటి రాజకీయాలపై మీ అభిప్రాయం!

● ప్రజాస్వామ్య ప్రభుత్వం – ఎప్పుడూ ప్రజలకు తగినట్టే వుంటుందంటారు – ఎందుకో తెలుసా! అది వారెన్నుకున్నదే కనుక!

★ స్త్రీలు కొందరు భర్తకన్నా బంగారాన్నే ఎక్కువగా ప్రేమిస్తారేమిటి!

● భర్త యిచ్చే రక్షణ అంత గొప్పగా వుందన్నమాట రక్షణలేదన్న పిరికితనం వుంటేనే స్త్రీలకి నగలమీద ఆకర్షణ ఎక్కువ అవుతుంది

★స్త్రీకి జీవితంలో ముఖ్యమైనది ఏమిటి?

● స్వంతంగా ఆలోచించుకోకల్గడం

★ అన్ని రంగాలలో యింతగా పురోగమించినా స్త్రీని వరకట్నం అనే జాడ్యం యింకా పీడిస్తోందేమిటి?

● అది స్త్రీలకి పట్టిన జాడ్యంకాదు తమలో తమకు నమ్మకంలేని వరులకు పట్టిన జాడ్యం జీవితంలో ఆడదానికి పెళ్ళిని మించినది యింకలేదని అనుకోడంవల్ల – పట్టిన జాడ్యం ఆది అందుకే స్త్రీ పురోభివృద్ధికీ – దానికీ – సంబంధం లేకుండా పోయింది

★ బ్రతికి బట్టకట్టడం అంటే?

● ముందు వూపిరి పోసుకుని సవ్యంగా జీవనం సాగిస్తే – అదే పది వేలని!

★ మీ ప్రశ్నావళి పేజీ ఎన్నాళ్ళు?

● జరిగినన్నాళ్ళు ఏం? పేజీ తిప్పేయ లేకుండా వున్నారా?!

టి. ఎస్. కొంకుదురు

★ ప్రకటనలలో సినిమాలలో స్త్రీని అసభ్యంగా చూపిస్తున్నారని పోషిస్తున్న మహిళా సంఘాలు మొదలయ్యాయి వాటిలో నటించేది స్త్రీలేకదా అంటే దానికి మూలం స్త్రీలే కనుక వారిని విమర్శించక మొత్తం మగవారితో కలిపి వ్యవస్థను దుయ్యపట్టడం ఏం న్యాయం? తనలో వున్న మచ్చ తెలుసుకోని గురివింద గింజలాగా అనిపించడం లేదూ?

● ఎందుకనిపించడం లేదూ? వ్యవస్థ – పాలన ఎవరిచేతవుంది? సభ్యతలేని, సభ్యత తెలియని, సభ్యత తమ వ్యాపార పురోభివృద్ధికి అవసరంలేదని ఆలోచించే – పెద్దల చేతుల్లో వుంది కూలికి పనిచేసేవారి కందులో మంచి చెడులు చెప్పడానికి ఆస్కారం వుంటుందా? లేక కూలి చేయడం మానమంటారా? ప్రతివాదననీ వితండ వాదనగా మార్చడం మీ లక్షణంలా వుంది

డి. ఎమ్. ఆర్. విశాఖపట్నం

★ చావు సమం చేస్తుంది మనిషిని – మరింకేమైనా వుందా?

● ఎందుకులేదు? నిద్ర నిద్రకి దరిద్రుడు లేడు – ధనవంతుడూ లేడు జ్ఞానీలేడు అజ్ఞానీలేడు ఏమంటారు?!

సి. హెచ్. ఎన్ ఆర్. సత్తెనపల్లి

★ ప్రశ్నావళి శీర్షికకు వచ్చే ప్రశ్నలలో ఎంతశాతం ప్రచురణ పొందుతున్నాయి?

● పదిలో మూడు!

★ ప్రకృతి రహస్యం చేదించిననాడు దేవుడు మాయం అవుతాడు దీనిని మీరు అంగీకరిస్తారా?

● ఐతే గియితే ఐతంపూడి ఉద్యోగం కథలా వుందిది! ముందు ప్రకృతి రహస్యం చేదించ నివ్వండి

★ చౌకగా ముగ్గు రంగులు సప్లయిచేస్తా మహిళల ప్రావీణ్యము

● ఇంకా ముగ్గులేసుకుంటూ పొరుగూరుకు పోయిన ఆండాళ్ళమ్మల కార్టూనులు చూస్తుంటే ఎంత ఒళ్ళు మండుతుందో – మీ గోలకూ అంతే! అంత ప్రావీణ్య మోహంవుంటే మీరే నేర్చుకోకూడదా?!

★ దృశ్యశ్రవణ విధానం మన విద్యకెంత అనుకూలమైనది?

● మన టి వి ప్రోగ్రాముల్లాగే అవీను చూసినంతసేపు చూడ్డం వినడం తరవాత మరిచిపోవడం అమెరికావంటి అత్యాధునిక దేశాలలో – 'చూసినదంతా చెప్పు' అని ప్రోగ్రాం కాగానే అడిగినా 10/ కూడా వారి మెదడులో గుర్తువుండదని ఒక టీచరు ఒక అంతర్జాతీయ సెమినార్‌లో చెప్పారు

★ ఏ ఆధారంగా నేను రచయితను అని ప్రకటించుకోవచ్చు

● ఇంటికి బోర్డు తగిలిస్తే చాలదా?!

★ వృత్తి రీత్యా కొన్ని వ్యాధులు వస్తుంటాయి మరి రచయితకు–

● టైలర్స్ నెక్?! లేకుంటే మెగలో మేనియా! మొదటిది తననీ రెండోది చుట్టూ వాళ్ళనీ బాధపెడుతుంది! □



కరకరలాడే రుచికి
పాల సత్తువను పెంచే
న్యూట్రిన్ మిల్క్ బిస్కెట్స్







భారతదేశంలో అత్యధికంగా
అమ్మకమౌతున్న మిఠాయిలను
తయారుచేయువారు.

ACIL/ODB/BG-T 81

# కాబోయే శ్రీవారు

## ఇచ్ఛాపురపు రామచంద్రం

శ్రీమతి శిల్పా!

ఎవరినుంచి ఈ ఉత్తరం అని ఆశ్చర్యపడుతున్నారా? నేనే ... ఆ మధ్య పెళ్ళిచూపులలో మిమ్మల్ని చూసిన చక్రపాణిని సిగ్గుపడుతున్నారా? స్త్రీకి సిగ్గు అందమే కాని సిగ్గులో పడి ఉత్తరం సాకల్యంగా చదవడం మానెయ్యకండేం? శ్రీమతి శిల్ప అని సంబోధించాననా తర్జన భర్జనకు లోనవుతున్నారు వివాహితురాలయినా కాకపోయినా గౌరవనీయురాలయిన స్త్రీ- శ్రీమతి అనిపించుకుందుకర్హురాలే అని విన్నాను.

నాలుగు రోజుల కిందట మన పెళ్ళిచూపులు జరిగినప్పటినుంచీ నాలాగే మీరూ ఆనందమూ ఆందోళనా ఆత్రతా కలగలిసిన చిత్రమయిన మానసిక పరిస్థితి అనుభవిస్తున్నారనుకుంటాను. జేను స్త్రీకయినా, పురుషుడికయినా వివాహమనేది జీవితంలో అతి పెద్దదీ ముఖ్యమయినదీ అయిన మలుపు. ఈ మలుపు తిరిగాక అవతలి జీవితం ఎలా ఉంటుందో అన్న ఆతృత యిద్దరికీ సహజమే. ఎందుకంటే యిప్పుడు జరుగుతున్నవి బాల్య వివాహాలు కావు సరికదా ఒక విధంగా ఆలస్య కళ్యాణాలే (లేట్ మారేజెస్) వివాహ వేళకి స్త్రీపురుషుల వయసులు తక్కువ ఉండడం లేదు. పెద్దవాళ్ళయి వ్యక్తిత్వం స్పష్టంగానూ దృఢంగానూ రూపుదిద్దుకున్నాక జరిగే వివాహం కనుక- పెళ్ళనగానే ఒకవేపు కలలూ మరొకవేపు సందేహాలూ- రెండూ సహజమే యువతీ యువకులకి

పాశ్చాత్య దేశాలలో అయితే డేటింగ్ ఉంది గనక పెళ్ళికి ముందు ఒకరినొకరు అర్థం చేసుకొనేందుకు వీలుంటుంది. వధూవరుల యిష్టాయిష్టాలు అక్కడ చెల్లుతాయి మనది అమెరికాకాదు. భారతదేశం ఇక్కడ డేటింగ్ లేదు. కాని – ప్రేమ ఉంది! అది సినిమాలలోనూ సీరియల్ నవలలోనూ ఎంత పుష్కలంగా వరదలై పారుతుందో వాస్తవిక జీవితంలో అంత అరుదుగా ఉంటూంది. సినిమాలలోనూ కథలలోనూ అయితే- కాబోయే వధూవరులు పెళ్ళిచూపులలో ఒకరితో ఒకరు మాట్లాడుకుని వొకరి గురించి వొకరు కొంచెం మేరకయినా తెలుసుకొనే మంచి పని చేస్తారు మిథ్యా గౌరవాలలో కొట్టుకొనే మనలాటి మధ్యతరగతి కుటుంబాలలో పెళ్ళికి ముందు అబ్బాయీ అమ్మాయీ మాట్లాడుకోవడమనేది 'బరితెగించడ'మే ఔతుంది యింకా. అందుకే యీ లేఖ! మాటకి విలువా శాశ్వతత్వమూ నశిస్తూ రాతే మనుషులని కొంతవరకూ బంధించి ఉంచగలుగుతున్న యీ రోజులలో – ఒక విధంగా యీ పద్ధతే మంచిదేమో సరే అసలు విషయంలోకి వొస్తున్నాను.

నా వయసు ఇరవైతొమ్మిది.

నాలుగేళ్ళ క్రిందట ఉద్యోగం సంపాదించాను. టౌనులో ఒంటరిగా గదిలో ఉంటున్నాను

అదుగో! అప్పుడే మీరేమేమో ఊహించుకుంటూ నన్నపార్థం చేసేసుకోబోతున్నారు. నేటి సినిమాలూ నవలలూ ఏ యువకుడినయినా ప్రేమలో

పడెయ్యకుండా వదలుతున్నాయా; నేనూ ఎవరినో ప్రేమించే ఉంటాననో, లేదా . నన్నూ ఎవరో ప్రేమించే ఉంటారనో మీరు ఛటుక్కున అభిప్రాయపడిపోతే–

"అబ్బే అలాటిదేమీలేదు." అని మాత్రమే అనగలను నేను

నమ్మడమూ మానడమూ మీ వంతు

ప్రేమలో పడలేదంటున్నాను కదా అని తొందరపడి నన్ను బుద్ధిమంతులలో జమ వెయ్యకండి. అనక పశ్చాత్తాపపడవలసి రావొచ్చు. అలాగ పశ్చాత్తాప పడవలసి రావడం నాకిష్టముండదు. అందుకేగదా యిలా మీకు ఉత్తరం వ్రాయడం! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నా ప్రయోజనముండవచ్చునేమో కాని తీరా పెళ్ళయిపోయాక ఎంతగా ఎన్నిసార్లు అయ్యో అనుకున్నా మళ్ళీ మీరూ నేనూ అవివాహితులం కాలేము కదా! అడుగు వేసేముందే ఎంతో ఆలోచించాలంటారే, వైవాహిక జీవితంలోకి – ఏడడుగులు వేసే ముందు యువతీ యువకులకి ఎంత ముందు జాగ్రత్త ఉండాలి!! నాకు జాగ్రత్త కొంచెం ఎక్కువే.

బ్రహ్మచారీ శతమర్కటః అని నానుడి ఉద్యోగ బ్రహ్మచారి సహస్ర మర్కటః ఏమో అంతవరకూ ప్రతిదానికీ నాన్నమీద ఆర్థికంగా ఆధారపడుతూ, నలుగురిలోనూ 'నిరుద్యోగి' అని చిన్నచూపు చూడబడేవాడికి ఉద్యోగం అనే కిరీటం వొచ్చి పడగానే నడమంత్రపుసిరి నరంమీద పుండులా అతన్ని నిలవనివ్వదు నిరుద్యోగ వైతరణిని చచ్చి చెడీ దాటి ఉద్యోగపు తీరం చేరిన అతను 'గొప్ప'గా ఫీలవడమే కాదు, తన 'గొప్పతనాన్ని ప్రదర్శించుకునేందుకు కూడా పాటుపడతాడు.

అదుగో అలా మొదలుపెట్టిందే యీ సిగరెట్! ప్రకటనలలో .. సినిమాలలో సిగరెట్ కాల్చేవాళ్ళు గొప్పగా కనపడ్డారు.హీమాన్ అనిపించారు గొప్పగా కనిపించడానికి సులభ మార్గం సిగరెట్టు అనిపించింది. తరువాత నా చుట్టూ ఉంటూ సిగరెట్టు కాల్చేవాళ్ళ ప్రభావం గొడ్డు గోతిలో పడితే నలుగురూ నాలుగు రాళ్ళు వేస్తారుట. నా బలహీనత చూసి నలుగురూ నాలుగు కోణాల లోంచి నన్ను బలహీనుణ్ణి చేశారు కపట స్నేహితుడిలా యిట్టే అంటుకుని – మంచి స్నేహితుడిలా ఎంతకీ వదలకుండా ఉందీ సిగరెట్ ఈ సిగరెట్ అలవాటుండే యిది నిజంగా వేసేటప్పుడు వేపమొక్కా తీయబోతే ఆసిరెమ్మే

పెళ్ళిచేసుకుందామన్న నిర్ణయానికి రాగానే నేను చేసిన మొట్టమొదటి పని – సిగరెట్ మానెయ్యాలని ప్రయత్నాలు మొదలుపెట్టడం ఎందుకంటే – సిగరెట్ స్త్రీకి చాలా శత్రుత్వమట యీ దేశంలో

భర్త – పదే పదే తన పెదవుల మధ్య ఉంచుకుని- పరవశిస్తూ పొగపీలుస్తూ . కాల్చే సిగరెట్ మీద స్త్రీకి చాలా అసూయ కలుగుతుంది అతనెక్కడికి వెళ్ళినా – అతని హృదయాని కంటిపెట్టుకునో (సిగరెట్ పెట్టి జేబులో ఉంటుంది జేబంటే హృదయానికి దగ్గర), కరకమలాల నలంకరించో ... అధరాల నలంకరిస్తూనో ఉండే సిగరెట్‌ని చూసి స్త్రీ – తన ఆస్తిమీద అది అన్యాక్రాంతం జరుపుతున్నట్టు అసూయ చెందడమూ ఆగ్రహించడమూ సహజమే న్యాయమే. అందుకనే సిగరెట్ భార్యాభర్తల మధ్య కలతలు రేపుతుంది దాంపత్యంలో ఈ విషయం మీద నేను ఒకటి రెండు మంచి కథలు చదివాను.

నేను బ్రహ్మచారినయినా నా మిత్రులు కొందరు వివాహితులే. కాపురం చేసుకుంటున్నవారే. వాళ్ళతోనూ వాళ్ళ కుటుంబాలతోనూ చనువుగా ఉంటాను కనుక భార్యాభర్తల మధ్య సిగరెట్ ఎటువంటి సమస్య కాగలదో ... దాని పరిణామాలిలా ఉంటాయో స్వయంగానే చూశాను. అందుకే- జీవితంలోకి భార్య అనే భాగస్వామిని ఆహ్వానించబోయే ముందు- వాతావరణ కాలుష్యానికి, దాంపత్య జీవిత వాతావరణ కాలుష్యానికి దారితీసే స్మోకింగ్ వ్యసనం నుంచి విముక్తి చెందడం నా ప్రథమ కర్తవ్యంగా భావించాను.

సిగ్ క్యూర్ . నా అలవాటుని తప్పించలేకపోయింది. విల్ పవర్ ఎఫెక్టు కూడా నిల్చే

అయిపోయింది. సిగరెట్ కాల్చే ముందు ప్రతిసారీ పాకెట్‌మీద ఉండే చట్టబద్ధమయిన హెచ్చరిక– 'స్మోకింగీజ్ యింజోరీయస్ టు హెల్త్'ను మూడేసి 'సార్లు చదివేవాడిని ఫలితం లేక – చిత్తుగా ఓడిపోయాను నేనూ సిగరెట్లూ మిగిలాం మళ్ళీ

కనుక – నేను స్మోకర్‌ని ప్రస్తుతం రోజుకొక ప్యాకెట్ (పది సిగరెట్లు మాత్రమే)తో సాగుతున్న యీ అగ్నిహోత్ర వ్రతం భవిష్యత్తులో ఎంత మాత్రమూ దిన దిన ప్రవర్ధమానం కాబోదని నేను ఆత్మవిశ్వాసంతో చెబుతున్నాను. కొంత అనుభవంమీద చెబుతున్నాను కాబట్టి యీ విషయంలో మీరు నన్ను విశ్వసించవచ్చు సానుభూతి చూపొచ్చు

శిల్పా' సాటర్‌డే ఈవెనింగ్ ఫీవర్ గురించి మీరు వినే ఉంటారు పట్టభద్రులూ అనుదినమూ పేపరు చదివేవారూ తరచుగా ఆంధ్రాంగ్ల పత్రికలు చూసేవారూ – మీకు సాటర్‌డే యీవెనింగ్ ఫీవర్ గురించి తెలియదేమో అని నేను సందేహపడడమేమిటి. నా తెలివితక్కువగాని ఆ ఫీవర్ అమెరికా నుంచి భారతదేశానికి వ్యాపించింది ముఖ్యంగా– సిటీస్‌లోని ఉద్యోగ బ్రహ్మచారులకి దానికి తగిన కారణం ఉంది.

కొంత వయసు వొచ్చాక వొంటరితనమనేది స్త్రీకయినా పురుషుడికయినా దుర్భరమే మనసు – తోడు కోసం ఆక్రోశిస్తుంది ఉద్యోగం కోసం ఎదురుచూసే యువకుడికీ, ఉద్యోగస్తుడి కోసం నిరీక్షించే యువతికీ లేట్ మ్యారేజ్ తప్పనిసరే అందుచేత– వొంటరితనానికీ, తోచకపోవడానికి మనవంటి వాళ్ళెందరో గురి అవుతూనే ఉన్నారు

రేపు ఆఫీసుకి వెళ్ళవలసి ఉందనుకునేసరికి నేటి దినచర్య ఎంత సజావుగా సాగిపోతుందో, మర్నాడు శలవనేసరికి ఒక్కసారి మనసు అస్తవ్యస్తమై పోతుంది ఈ బ్రహ్మచారి జీవితంలో శనివారం ఎంత విచిత్రంగా సాగుతుందో గమనించి సహృదయంతో అర్థం చేసుకోండి శనివారం– ఉదయం – రూముకి దగ్గరలో ఉన్న కాఫీ హోటలువాళ్ళు వేసే వేంకటేశ్వర సుప్రభాతం వినపడేసరికి మేలుకుంటాను, రోజూ ఎనిమిది వరకూ మంచం దిగని వాడిని సుప్రభాతం వింటూనే స్నానమూ అవీ కానిచ్చి– భక్తిగా దేముడికి నమస్కారం పెట్టుకుంటాను తరువాత రొటీన్ మామూలే ఆఫీసుకి పోతాను అంతవరకూ బాగానే ఉంటుంది సాయంత్రం ఆఫీసు నుంచి వొస్తానా– మనసు అదోలా ఐపోతుంది రేపు ఆదివారం, ఆఫీసుకి శలవు– అని రికార్డు మొదలౌతుంది మనసులో ఒక్కసారి అంతా శూన్యమయిపోతుంది స్తబ్ధత ఆవరించేస్తుంది కాలం– కదలకుండా ఆగిపోయినట్లు . గడవనట్లు ఏమీ తోచకుండా...

అదుగో అలాటి క్షణంలోనే 'బోర్' అనే దెయ్యం నా మనసుమీద దండెత్తి అతి సులభంగా లొంగదీసుకుంటుంది ఐడిల్ మాన్స్ బ్రెయినీజ్ డెవిల్స్ వర్క్‌షాపు కదా అన్నట్లు– డెవిలంటే మీకు తెలుసా? బహుశా తెలిసి ఉండదు డెవిలంటే– తెలుగు సీరియల్‌గా అనువదించబడిన ఆంగ్ల నవల కాదండీ శిల్పా డెవిలంటే– విస్కీ' అందుకే మీకది తెలియదు. డెవిల్ అంటే తినేసేది. మనిషి నావహించి మనసు నావరించి మరేమీ తోచకుండా చేసేది విస్కీ– మనిషి ఆరోగ్యాన్నీ, ధనాన్నీ, కాలాన్నీ తినేసేదే రేపాదివారం అనేసరికి– శనివారం సాయంత్రం యీ డెవిల్ నన్నూ ఆవహించేస్తుంది బార్‌కి పద ఫ్రెండ్స్‌తో జోరుగా గడుపు అని నిలవనివ్వకుండా తినెయ్యడం ప్రారంభిస్తుంది. ఒంటరిగా ఉంటానేమో యీ డెవిల్ నన్ను యిట్టే జయించిపారేస్తుంది వారానికోసారి వొక్కసారే దీనికి లొంగిపోతుంటాను ఐతే – మరో మనిషి, కాలక్షేపమూ ఉంటే యీ డెవిల్‌నీ సాటర్‌డే యీవెనింగ్ ఫీవర్‌నీ తప్పకుండా గెలవగలనన్న ఆశాభావం నాకు లేకపోలేదు డెవిల్‌ని బర్న్ చేసెయ్యాలని, శాశ్వతంగా బర్న్ చేసెయ్యాలని నాకు చాలా యిదిగా ఉంది నిజంగా సిగరెట్‌లాగే విస్కీకూడా స్త్రీకి అసహ్యమూ, ఆగ్రహమూ కలిగించి దాంపత్య జీవిత సుఖంలో నిప్పులు పోసేదే.



చూస్తున్నానుగా చుట్టూ ఉన్న కొందరిని

శిల్పా! చేదుగా ముఖం పెడుతున్నారు కదూ నా గురించి తెలుసుకుంటూ! ఇంకా ఏమేం చదవవలసి వొస్తుందో అని భయపడుతున్నారు కదూ?

మరొక్కటి చెప్పి యీ జాబితా ముగించేస్తాను వర్రీ అవకండి

సుఖ సంసారానికి- మగవాడి స్నేహితులూ స్నేహాలూ కూడా శత్రువులౌతుంటారు అప్పు డప్పుడూ వీరి ప్రభావం తక్కువకాదు స్నేహం మంచిదే కాని మితి మీరితే యిదీ అపవాదే ఔతుందేమో ఇల్లు పట్టకుండా స్నేహితులతో తిరుగుతూ వేళాపాళా లేకుండా అర్ధరాత్రి అపరాత్రి వొచ్చి తలుపు తట్టే భర్తని ఏ ఇల్లాలు ఎన్నాళ్ళని భరించగలుగుతుంది? ఆమె ఎంత ఉత్తమ యిల్లాలయినా తనని యింటి దగ్గర వొక్కతెనే వొదిలేసి అతనిమట్టుకతను బలాదూర్‌గా తిరిగే మగవాడిని ఎలా క్షమించగలుగుతుంది?

నాకు స్నేహితులు లేరని స్నేహాలు లేవనీ కాదు ఐతే నేను హద్దులోనే ఉంటున్నాను నా స్నేహాలూ స్నేహితులూ నా శ్రీమతికే మాత్రమూ అసౌకర్యం కలిగించరని ఘంటాపథంగా చెప్పగలను మీరు నమ్మండి

ఇంతసేపూ మీకు నేను నా గురించి అన్నీ నిరుత్సాహకరమయిన విషయాలే . చేదునిజాలే చెప్పాను కదూ? మీ మనసుని బాధపెట్టాను కదూ? ఏం చేసేది? కీడెంచి మేలెంచమని కదా ఆర్యోక్తి అందుకని- ముందుగా నాలో నాకు కనిపించే చెడుని చెప్పాను ఐతే- నేనేమి సినిమాలలోనో నవలలోనో పాత్రని కానుకదా కేవలము మంచి, లేదా అంతా చెడ్డ- తోనో మాత్రమే ఉండడానికి? మనిషిని కనుక- సహజంగా నాలో మంచీ ఉంటుంది, చెడూ ఉంటుంది

శిల్పా! యింతవరకూ నాలోని అవలక్షణాలు మాత్రమే చదువుతూ మీరు నా గురించి సకల గుణాభిరాముడనుకునేసుకుని ఉంటారు పొరపాటు కాదది. వాస్తవమే ఇంక నాలో నాకు కనిపించే మంచి లక్షణాలను చెబుతాను, టూకీగా లేకపోతే నాకు ఆత్మస్తుతి మీకు బోరుగా

# కాబోయే శ్రీవారు

అనిపిస్తుంది. తనని తాను ప్రశంసించుకోవడం ఆత్మహత్యాసదృశమే.

నాకు - పేకాటరాదు. చిరాకు కూడా గంటలకి గంటలు నడుము నొప్పెట్టేలా కూర్చోడం కనుక శలవు రోజులు యిల్లు పేకాట క్లబ్బయిపోయే ప్రమాదం ఎంత మాత్రమూ ఉండదు. గుర్ర ప్పందాల పట్ల అజ్ఞానమేకాదు అసహ్యమూను ఈజీ మనీమీద ఆశా, అభిలాషా రెండూ లేనివాడినే గనుక ప్రభుత్వ లాటరీ టికెట్లు కూడా కొనను మాటలతో కాని చేతలతో కాని ఒకరిని హింసించడ మంటే సంస్కార రాహిత్యంగా భావిస్తాను. కనుక నాకూ - రచయిత్రుల నవలలోని రాక్షసులలాటి మగ పాత్రలకీ పోలిక ఉండదేమాత్రమూ సాయంత్రాలు నేనెలాగూ షికారు వెళ్తుంటాను కనుక -సరదాగా శ్రీమతితో షాపింగ్‌కీ వాకింగ్‌కీ వెళ్ళడానికి సంకోచించను మంచి కంపెనీయే యివ్వగలను

"ఇన్ని కబుర్లు చెబుతున్నారే! మరి కట్నం సంగతి?" అని మీకు సందేహం కలుగుతుంది. అడగాలనిపిస్తుంది. ఔనా?

నా ఓటమి నంగీకరిస్తున్నాను. ఈ విషయంలో అమ్మనీ నాన్నగారినీ ఎదిరించలేని అసమర్ధుడినీ, జయించలేని అశక్తుడినీ నా సంస్కారం కంటె వారి 'సంప్రదాయం' ఎక్కువ బలమైనది మరి. ఐతే ఒకటి మాత్రం నిర్ద్వంద్వంగానూ నిస్సందేహంగానూ చెప్పగలను పెళ్ళయ్యాక, డబ్బు తెమ్మనో వస్తువులు తెమ్మనో, పుట్టింటిని దోచి ఇమ్మనో పీడించే హీనుడిని కానుగాక కాను కిరసనాయిలుతో హత్యచేసే కిరాతకుణ్ణి కానుగాక కాను జీవితం అనే సరదా ప్రయాణానికి శ్రీమతి జీవన సహచరి అని భావిస్తాను నేను అందుచేత మీ క్షేమంపట్ల మీకెటువంటి భయాలు సందేహాలూ అక్కరలేదు. నేను - మనిషినే తప్ప రాక్షసుడినీ కాను, దేవుడినీ కాను నా హద్దులూ శక్తిసామర్ధ్యాలూ నాకు కొంత తెలుసు మిమ్మల్ని పువ్వుల్లో పెట్టి పూజిస్తాననో .

క్షణ క్షణమూ మీ వెంటే ఉంటాననో అనలేను . ఎందుకంటే అలాగ నాకు సాధ్యమూకాదు, మీకూ యిట్టే బోరు కొట్టేస్తుంది. ఇరవైనాలుగుగంటలూ ప్రేమిస్తూ కూర్చుంటే ఆఫీసుకి వెళ్ళి ... పనిచేసి ... జీతం ఎవరు తెస్తారు? జీతం లేకపోతే బువ్వొచ్చేదెలా? నేను గుమాస్తాని. నా జీతం మేరలో - సాధ్యమైనంతవరకు యిద్దరమూ సుఖ పడదాం నా జీతానికి మించినవయితే మీ కోరికలూ సరదాలూ తీర్చలేను సుమండీ

శిల్పా! ఈపాటికి నేనంటే ఏమిటో ... యీ ఉత్తరం దేనికో మీకు కొంత అవగాహన అయ్యే ఉంటుందనుకుంటాను ఇక మీరు ప్రశాంతంగా ఆలోచించుకోండి నా వంటి వాడితో సహ జీవనం సాగించేందుకు సుముఖులో కారో నిర్ణయించు కోండి. మీ నిర్ణయం మీద- వ్యక్తుల ... పరిస్థితుల వొత్తిడి ఉండకూడదు. మీకు మనస్పూర్తిగా అంగీకారమయితేనే మన వివాహం జరగాలి.

నా గురించి మీకు నేనెలా తెలిపానో అలాగే మీ గురించి ... మీ యిష్టాయిష్టాల గురించీ ... ఆలోచనల గురించి .. కోరికలు ... బలహీనతల గురించీ నిస్సంకోచంగానూ నిర్మొహమాటంగానూ వ్రాయండి. మీరు నన్నేకాదు, నేను మిమ్మల్నీ తెలుసుకోవాలి కదా?

సహ జీవనం సాగించవలసిన ఇరువురిలోనూ ఒకరు మరొకరితో సర్దుకుంటే చాలదు. రెండవవారు మొదటివారితో సర్దుకుపోగలగాలి. అలాగే మీరు నా గురించి మాత్రమేగాక నేనూ మీ గురించి తెలుసుకోవాలి. నాకు - అమ్మాయిల గురించి తెలిసినదల్లా - సినిమాలు చూస్తారనీ, సీరియల్స్ చదువుతారనీ. అవి - సరదాలే తప్ప వ్యసనాలేమీ కావు చిన్నచిన్న సరదాలు కూడా లేకపోతే జీవితం బోర్ కొట్టెయ్యదూ? వివాహం జరిగిపోవడమే కాదు ముఖ్యం. వివాహానంతరం యిద్దరూ విధిలేక కాక నిజంగా హాయిగా జీవించగలగాలి. అందుకే మీ గురించి తెలుసుకోవాలనే ఆత్రతా, శ్రద్ధా.

విద్యావతులూ సంస్కారులూ అయిన మీరు నా ఉత్తరాన్నపార్ధం చేసుకోరనీ సరిగానే అర్ధం చేసుకుంటారనీ నా ఆశాభావం. ముఖాముఖి మాట్లాడుకుందు కనుకూలించని పరిస్థితులూ పెద్దలూ. మరి కాబోయే వధూవరులు వొకరి గురించి వొకరు ముందుగా తెలుసుకుందుకు మన మధ్యతరగతి కుటుంబాలలో యిలాగ ఉత్తరాల ద్వారాకంటె మరో మార్గమూ ఉందనుకోను.

శిల్పా! కలసి జీవించవలసిన వాళ్ళం - కళ్యాణం జరిగితే. అరత్యా నిమ్మారం కంటె అదీ నిమ్మారమే మేలనీ; వెయ్యేబద్ధాలతో జరిగే పెళ్ళికంటె, ఒక్క అబద్ధం కూడా లేకుండా అన్నీ నిజాలతోనే జరిగే పెళ్ళి ఫలప్రదమవుతుందని విశ్వసించేవాడినీ - కనుక యీ ఉత్తరం.

మీ జవాబు కోసం - నా అడ్రస్ వ్రాసిన కవరు జత చేస్తున్నాను.

ఎదురుచూస్తూ — భవదీయుడు

చక్రపాణి □






(గత సంచిక తరువాయి)

హోటల్ దిల్‌దార్ బార్ అండ్ రెస్టారెంట్

ఓ కార్నర్ టేబిల్ దగ్గర కూర్చొని ఉన్నాడు ఆనంద్

కూల్‌డ్రింక్ త్రాగుతూ పేపర్ చదువుతున్నాడు

విజయ్‌కి ఉరిశిక్ష పడిందని ఆ పేపర్లో వేసి ఉన్నారు

పేపర్ చదువుతున్న ఆనంద్ మనస్సు ఆ పేపర్‌పై లగ్నం కావటంలేదు ఆలోచనలతో తలనొప్పి వస్తుందేమో అన్పించింది ఆనంద్‌కి

ఎలా? ఎలా?

ఎలా తప్పించాలి ఉరిశిక్షనుంచి విజయ్‌ను?

సాక్ష్యాలు చాలా బలంగా ఉన్నాయి అన్ని కోణాల్నుంచి బందించారు రేప్, ఆ పైన హత్య– ఒకటి చాలదని రెండు నేరాలు ఎలా తప్పించాలి విజయ్‌కిచ్చిన మాట నిలబెట్టుకోవాలి

ఎలాగైనా తప్పించాలి

ఇంతలో

జావేద్ ఈ ఫోటోలు అర్జంటుగా బాస్ కందించాలి పోదాం పద

పోదాం ఉండు సలీమ్ ఇంకో రెండు పెగ్గులు లాగించనీ

ప్రక్క టేబుల్ దగ్గరనుంచి మాటలు వినపడేసరికి పేపర్‌పైనుంచి దృష్టిని అటు మరల్చాడు ఆనంద్

ఇద్దరు వ్యక్తులు ప్రక్క టేబుల్ దగ్గర కూర్చొని రమ్ త్రాగుతూ మాట్లాడుకొంటున్నారు

సలీమ్ . జావేద్

ఆ పేర్లు ఎక్కడో విన్నట్లుంది ఆలోచనలో పడ్డాడు ఆనంద్

ఎస్ మారుతి బాంక్ దోపిడీతో వారిద్దరికి సంబంధం ఉన్నట్లు పేపర్లో చదివాడు వారేవీరా? లేక

వారివైపు పరిశీలనగా చూశాడు ఆనంద్

**జరిగిన కథ-8 :** సబిన్‌స్పెక్టర్ విజయ్ తమ్ముడు రాజేష్‌ను చిదానందం కొడుకు రంగా హత్యచేసి దొంగ సాక్ష్యాలతో నిర్దోషిగా విడుదలవుతాడు. ఆనంద్ ఇచ్చిన సమాచారం మీద విజయ్ చిదానందానికి చెందిన గంజాయి లారీలు పట్టుకుంటాడు అడవిలో గంజాయి స్థావరాన్ని కూడ పట్టుకుని అందరినీ అరెస్టు చేస్తారు రక్షించమంటూ వచ్చిన ఒక మోసపు ఫోన్ పిలుపుతో వెళ్ళి విజయ్ రెండు శవాలతోపాటు గదిలో చిక్కుకుపోతాడు. అరెస్టు చెయ్యబడతాడు హత్యలు విజయ్ చేశాడని చూపే సాక్ష్యాధారాలు ఉండడంతో ఉరిశిక్ష విధించబడుతుంది నర్మదతో పెళ్ళి జరిగి ఉండవలసిన రోజు విజయ్ ఉరికంబం ఎక్కబోతుంటాడు.

వారిద్దరూ అటువైపు తిరిగి ఉండటంతో సరిగ్గా కనపడలేదు ఆనంద్‌కి

అంతలో వారిద్దరూ లేచి నిలబడ్డారు

సరే అనుమానం ఎందుకు? ఏ విషయం తేల్చుకుందాం అనుకొన్నాడు ఆనంద్

లేచి నిలబడ్డాడు

పాకెట్ ఒక్కసారి తడిమి చూసుకొన్నాడు రివాల్వర్ చల్లగా తగిలింది చేతికి

కౌంటర్‌వైపు నడిచాడు ఆనంద్ బిల్లు చెల్లించాడు

సలీం, జావేద్‌లు కూడా బిల్లు చెల్లిస్తున్నారు

బిల్లు చెల్లించి పోర్టికోలోకి వచ్చారు వారు

సలీం అక్కడే పార్కు చేయబడి ఉన్న బ్లూ అంబాసిడర్ కారు డోర్ తెరిచి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు

జస్టే మినిట్ అంటూ జావేద్ ప్రక్కనున్న కిళ్ళీబడ్డీ దగ్గరకు వెళ్ళాడు సిగరెట్ పాకెట్ కోసం

చటుక్కున అటు, ఇటు చూసి, ఎవ్వరూ గమనించటం లేదనుకొన్నాడు ఆనంద్

కారుడిక్కీ మెల్లిగా తెరిచి అందులో పడుకొన్నాడు ఆనంద్

సలీం ఇవన్నీ గమనించే స్థితిలో లేడు

త్రాగిన డోసు కొద్దిగా ఎక్కువైనట్లుంది స్టీరింగ్‌పై తలవాల్చి కళ్ళు మూసుకుని కూర్చొని ఉన్నాడు

జావేద్ సిగరెట్ పాకెట్ తీసుకొని తిరిగి వచ్చాడు

"పోనీ అన్నాడు జావేద్ సలీం ప్రక్కనే ఫ్రంట్ సీట్లో కూర్చొని

కారును ముందుకు పోనిచ్చాడు సలీం

సలీం కళ్ళు మూతలు పడటం గమనించాడు జావేద్

'తప్పుకో, నీకు కిక్కు ఎక్కువైనట్లుంది నేను డ్రైవ్ చేస్తాను" అన్నాడు జావేద్

'ఫర్వాలేదు కంట్రోల్ చేయగలను" అన్నాడు సలీం

కారును మలుపులు త్రిప్పుతూ వారి డెన్ (స్థావరం) ముందు ఆపాడు సలీం

కారును ప్రక్కనే ఉన్న పొదల చాటున ఆపి క్రిందకు దిగారు సలీం, జావేద్‌లు.

ప్రక్కనే ఉన్న పాడుబడ్డ బిల్డింగ్‌లోనికి నడిచారు వారిద్దరూ

ఒక్క నిముషం ఆగి నెమ్మదిగా డిక్కీ తలుపు తెరిచాడు ఆనంద్

చుట్టూ చూశాడు.

ఎవ్వరూ లేరు

డిక్కీలోంచి దిగాడు ఆనంద్

సలీం జావేద్‌లు పాడుబడిన బిల్డింగ్ లోపలికి పోతూ కనిపించారు

నెమ్మదిగా, శబ్దం కాకుండా, పిల్లిలా అడుగులేస్తూ అనుసరించాడు వారిని ఆనంద్

సలీం, జావేద్‌లు రహస్య మార్గం ద్వారా వెళ్ళి వరండా దగ్గరకు వెళ్ళారు

ఆనంద్ కూడా అనుసరించాడు

కొంత దూరం వెళ్ళి మూడో నంబర్ గది ముందు ఆగారు సలీం, జావేద్‌లు

కాలింగ్‌బెల్ ప్రెస్ చేశారు

తలుపు తెరచుకొంది

గార్డు మిషన్‌గన్‌తో ప్రత్యక్షమయ్యాడు ఎదురుగా

వారి ఐడెంటిఫికేషన్ కార్డు చెక్ చేశాడు గార్డు

"ఏం ఒక్కడివే ఉన్నావు. నీ సహచరుడేడి" అడిగాడు జావేద్ గార్డుని

"బాస్ ఎక్కడికో అర్జెంట్ పనుందని పంపించారు"

సరే అంటూ సలీం, జావేద్‌లు లోపలికి ప్రవేశించారు

అంతా గమనించాడు ఆనంద్ వరండా దగ్గర గోడచాటున నిలబడి

ధైర్యం చేద్దామనుకొన్నాడు

ఓ సారి పాకెట్ తడిమి చూసుకొన్నాడు కర్చీఫ్ ఉంది

కర్చీఫ్‌లో పవర్‌ఫుల్ మత్తు మందు ఉంది

ముందుకు అడుగులు వేసి ఆ రూమ్ ముందు ఆగాడు

కాలింగ్ బెల్ ప్రెస్ చేశాడు

తలుపు తెరుచుకొంది

గార్డు ప్రత్యక్షమయ్యాడు

నోరు తెరిచేలోపున టక్కున పాకెట్‌లో నుంచి కర్చీఫ్ తీసి వాడి ముక్కు మూసి పెట్టాడు ఆనంద్ ఒక చేత్తో వాడి నోరు మూసేసి

క్షణంలో నే స్పృహ తప్పాడు గార్డు

తోటకూర కాడలా వాలిపోయాడు గార్డు

వాణ్ని అలాగే క్రింద పడకుండా పట్టుకొని బయట రూమ్ గోడకు నిలబెట్టాడు ఆనంద్

ఎదురుగా ఇంకొక ద్వారం కనిపించింది

ఆ ద్వారానికి గ్లాస్ డోర్ బిగించి ఉన్నారు

ఆ గ్లాస్ ద్వారా లోపలి వ్యక్తులు స్పష్టంగా కన్పిస్తున్నారు

సలీం, జావేద్, వారికి ఎదురుగా ఒక ముసుగు మనిషి నిలబడి ఉన్నారు

సలీం ఏవో ఫోటోలు ముసుగు మనిషికిస్తున్నాడు

మెల్లగా డోర్ కొద్దిగా తెరిచాడు ఆనంద్

మేము వెళ్ళేసరికి ఎవరో వాణ్ని ముందే హత్య చేశారు హత్య చేస్తుండగా మేము వెనుక నుంచి వారి ఫోటోలు తీశాం ఆ కేసు విజయ్ మీద పడింది కాగల కార్యం గంధర్వులు తీర్చారన్నట్లు ఎలాగైతేనేం విజయ్‌కి ఉరిశిక్ష పడింది అని చెపుతున్నాడు సలీం ముసుగు మనిషికి ఫోటోలు అందిస్తూ

ఉలిక్కిపడ్డాడు ఆనంద్ ఆ మాటలు విని

అంటే విజయ్ అరెస్ట్ వెనుక చాలా పెద్ద మురాయే పని చేస్తోందన్నమాట

డోర్ మూశాడు ఆనంద్

తొందర తొందరగా బయటకు వచ్చి వరండా దగ్గర ఒక గోడ ప్రక్కన నిలబడ్డాడు ఆనంద్.

సలీం, జావేద్‌లు ఫోటోలు ముసుగు మనిషికిచ్చి వెనుతిరిగారు.

సీక్రెట్ ద్వారం ద్వారా పాడుబడ్డ బిల్డింగ్ ఆవరణలోనికి వచ్చారు సలీం, జావేద్‌లు

"సలీం ఎందుకలా అబద్ధం చెప్పావ్?" అన్నాడు ఉన్నట్టుండి జావేద్.

"ఏమిటి?"



# ✱ 5 Years of successful service in ho

| | | | |
|---|---|---|---|
| | **Anurag** Completed in 1983 | **Arun** Completed in 1984 | |
| **Anupama** Completed in 1984 | **Abhilash** Completed in 1984 | **Arun-1** Completed in 1986 | |
| **Aditya** Completed in 1986 | **Archana** Completed in 1987 | **Ashirwad** Under Construction | **Abhishake** Under Construction |



# SILPA

- A 23 Two B
- Built up area
- Terrace Garc
- Covered pa
- Electrical pa

LOCATION
Amruta Nagar, off Bandar Road







PROMOTERS & BUILDERS

**SILPA APARTMENT P**

40-1-142/A BANDAR ROAD OPP. HOTE

using...

andnow
# aparajita

.ed-room apartment complex
. of each 2 Bed-room apartment 940 to 960 Sq.ft.
len
rking space
ssenger Lift

TYPICAL FLOOR PLAN




ROMOTERS PVT. LTD.,
:L KANDHARI VIJAYAWADA-520 010

ARCHITECTURE
M.A. QUALIED

BLUESKY

## ఆశయం

"అదే నెగటివ్ ఉందిగదా" కాలిపోయిందని ఎందుకలా చెప్పావ్?"

'ఓ అదా? అసలు ఆ ఫోటో ఎవరిదనుకొంటున్నావు'

ఎవరిది?

రంగా అని, చిదానందం అనే పెద్ద స్మగ్లర్ కొడుకుది వాడు హత్య చేస్తుండగా తీసిన ఫోటో అది అసలు ప్రింట్ లిచ్చాంగదా నెగటివ్ మన దగ్గరే ఉంటే చిదానందాన్ని ఒక ఆట ఆడించవచ్చు

అంటే?'

'బ్లాక్ మెయిల్ చేసి సంపాదించవచ్చు అందుకే నెగటివ్ మన దగ్గరే ఉన్నా బాస్‌తో అలాఅబద్ధం చెప్పాను

శెభాష్ విన్పించింది వెనుకనుంచి

ఉలిక్కిపడి వెనక్కి తిరిగారు సలీం, జావేద్‌లు

వెనుక ఆనంద్ నిలబడి ఉన్నాడు అతని చేతిలోని రివాల్వర్ సూటిగా సలీం, జావేద్‌లనే చూస్తోంది

"హ!? ఎవరు నువ్వు అన్నాడు సలీం ఆశ్చర్యంగా

'నేనెవరో మీకు తెలియదా?

ఆనంద్

'యస్ ఆనంద్‌నే పరిచయాలు పలకరింపులు తర్వాత ఎక్కడ ఆ నెగటివ్?' అడిగాడు ఆనంద్

"ఏ నెగటివ్?

"అమాయకంగా నటించకండి నేనంతా విన్నాను నా దగ్గర అమాయకత నటించకండి ఎక్కడుంది ఆ నెగటివ్?

"మాదగ్గర లేదు

'మీ దగ్గర లేదు అన్న సంగతి నాకు తెల్సు ఎక్కడ పెట్టారో చెప్పండి ?

సలీం, జావేద్‌లు ఒక్క క్షణం మౌనంగా ఉన్నారు

"నా విషయం మీకు బాగా తెల్సు చెప్పక పోయారో చంప పారేస్తాను

ఒకటి రెండు లెక్క బెట్ట సాగాడు

ట్రిగ్గర్‌పై వ్రేలు బిగుసుకుపోతోంది

"రూమ్‌లో దాచి పెట్టాం అని చెప్పాడు వెంటనే సలీం

'నిజమేనా?

"నిజమె మా మాటనమ్ము

"ఓ. కే. దారిలో కొచ్చారన్నమాట. పదండి రూమ్‌కు పోదాం" అన్నాడు ఆనంద్.

సలీం, జావేద్‌లు కారులో ఫ్రంట్ సీట్లో కూర్చున్నారు.






సలీం డ్రైవింగ్ సీట్లో కూర్చొన్నాడు.

ఆనంద్ వెనుక సీట్లో కూర్చొన్నాడు. రివాల్వర్ మాత్రం సలీం తలకు గురిపెట్టబడే ఉంది.

కారును స్టార్ట్ చేశాడు సలీం.

సలీం ఎచ్చి వేషాలు వేశావంటే పిట్టల్ని కాల్చినట్లు కాల్చిపారేస్తాను. ఒళ్ళు దగ్గరుంచుకొని డ్రైవింగ్ చేయి హెచ్చరించాడు ఆనంద్

కిక్కురు మనకుండా డ్రైవ్ చేసి రూమ్ ముందు ఆపాడు కారును సలీం

కారు దిగి రూములోనికి ప్రవేశించారు

రూమ్ తలుపు తీశాడు సలీం

తలుపు తీస లోపలికి చూస్తూనే ఉలిక్కిపడ్డాడు సలీం

రూమంతా చిందర వందరగా ఉంది

దేనికోసమో? ఎవరో వెతికినట్లుగా ఉన్నారు.

ఏమిటి దంతా, ఇది రూమా లేక మునిసిపాలిటీ చెత్త కుండీయా?" అడిగాడు ఆనంద్

అదేమాకు అర్థం కావటం లేదు" అన్నాడు సలీం

రూమంతా అస్తవ్యస్తంగా ఉంది అలమరలన్నీ ఖాళీగా ఉన్నాయి. వస్తువులన్నీ క్రింద పడున్నాయి బెడ్‌పై నుండే పరుపు కోయబడి ఉంది. దూదంతా పడి రూమంతా చిందర వందరగా ఉంది

ఒక్క దూకున ముందుకు దూకి పరుపు ఎడమ వైపు కార్నర్‌లో చూశాడు సలీం

ఉలిక్కిపడ్డాడు

ఓ! మైగాడ్ ఎవరో నెగటివ్ ఎత్తుకెళ్ళారు అంటూ అరచాడు సలీం

వాట్!?

అవును నెగటివ్ ఇక్కడ పెట్టాను ఎవరో ఎత్తుకెళ్ళారు

నువ్వు చెబుతున్నది నిజమేనా?

అవును నిజమే చెబుతున్నాను

నువ్వు ఇక్కడ నెగటివ్ పెట్టినట్లు ఎవరెవరికి తెల్సు?

నాకు జావేద్‌కు తప్ప ఎవ్వరికీ తెలియదు అన్నాడు సలీం

అయితే ఎవరు తీసుంటారు?

అదే నాకు అర్థం కావటం లేదు

అనుమానంగా సలీం మొఖం వైపు చూశాడు ఆనంద్

అతను నిజమే చెబుతున్నాడనిపించింది ఆనంద్‌కి

అవకాశం కొద్దిలో మిస్సయి పోయింది నెగటివ్ చిక్కినట్లే చిక్కి చేజారిపోయింది. విజయ్‌ను కాపాడటానికి దొరికిన ఒక్క అవకాశం ఫలించకుండా పోయింది" అనుకొన్నాడు బాధగా ఆనంద్.

అటూ, ఇటూ చూశాడు రూమంతా.

ఒక మూలగా ప్లాస్టిక్ తాళ్ళు కనిపించాయి.

"జావేద్ వాటిని అందుకో" అంటూ చేతో తాళ్ళను చూపించాడు ఆనంద్.

"ఎందుకు?"

"ముందు చెప్పినట్లు చెయ్యి. ప్రశ్నలు తర్వాత".

తాడు తెచ్చాడు జావేద్.

"సలీం కాళ్ళు చేతులు కట్టెయ్".

చెప్పినట్లు చేశాడు జావేద్.

తరువాత ఇంకొక తాటితో జావేద్‌ను కూడా కట్టేశాడు ఆనంద్.

తర్వాత పోలీస్ కంట్రోలు రూమ్‌కు ఫోన్ చేశాడు ఆనంద్.

"హలో"

"కంట్రోల్ రూమ్. ఎవరు మాట్లాడేది?" విన్పించింది అవతలి నుంచి.

"ఎస్. పి. నందనరావుగారున్నారా?" ప్రశ్నించాడు ఆనంద్.

"పిలువ్ వారి".

"వారిప్పుడు కాన్ఫరెన్స్‌లో ఉన్నారు. ఏదో ముఖ్యమైన విషయం గురించి చర్చించుకొంటున్నారు. నాతో చెప్పండి. వారితో చెపుతాను".

"అలాకాదు. వార్నే రమ్మనండి".

"జస్ట్ మినిట్".

నందనరావు వచ్చాడు ఫోన్ దగ్గరకు

హల్లో ఎస్ ఐ సాబ్ మారుతీ బాంక్ దోపిడీలోను, సంతోష్ కుమార్ హత్యలోను, సి బి ఐ ఆఫీసర్ హత్య కేసులోను ముద్దాయి లయిన సతీం, జావేద్‌లు ఇక్కడ బందీలుగా ఉన్నారు వచ్చి వార్ని అరెస్ట్ చేయండి మీరెప్పటి నుంచో పట్టుకోవాలను కొంటున్న ముసుగు మనిషి ముఖ్య అనుచరులు వీళ్ళిద్దరు బాంక్ కాషియర్, మేనేజరు సాక్ష్యంచాలు వీర్ని అరెస్ట్ చేయటానికి చెప్పాడు ఆనంద్

ఎవరు నువ్వు? ప్రశ్నించాడు అవతలి నుంచి ఎస్ ఐ నందనరావు

నేనెవరయిందీ మీ కనవసరం వచ్చి అరెస్ట్ చేయండి" అంటూ అడ్రస్ చెప్పాడు ఆనంద్

* * * * * * * * * *

రాత్రి 12 గంటలు అయిందనట్లుగా జైలర్ గదిలోంచి గోడగడియారం 12 గంటలు కొట్టింది

సెంట్రీ డ్యూటీ మారుతున్నాడు

డ్యూటీ దిగిపోతూ విజయ్‌వైపు చూశాడు

విజయ్ పడుకొని కళ్ళపై మోచెయి పెట్టుకొని ఉన్నాడు చూస్తూనే తెలుస్తుంది అతడు నిద్రపోవటం లేదని

'సార్' పిలిచాడు సెంట్రీ

ఏమిటన్నట్లుగా చూశాడు విజయ్ సెంట్రీవైపు

సార్ నేను డ్యూటీ దిగి పోతున్నాను రేపు నేను వచ్చేసరికి ఈ గది ఖాళీగా ఉంటుంది అన్నాడు సెంట్రీ అతని గొంతు బాధతో పూడుకొని పోయి ఉంది మాటలు తడబడుతున్నాయి

అక్కడ నిలబడలేనట్లు వెళ్ళిపోయాడు సెంట్రీ

నిముషాలు లెక్క బెడుతూ పడుకొన్నాడు విజయ్

జైల్లో గడియారం 3 గంటలు కొట్టింది

ఉలిక్కిపడ్డాడు విజయ్

ఇంకొక గంటా పందొమ్మిది నిముషాలు ఉంది అనుకొన్నాడు విజయ్

అంతలో -

రంగారావు, డాక్టర్, మెజిస్ట్రేటు సెల్ తలుపు తెరుచుకుని లోపలికి వచ్చారు

విజయ్‌ని మెడికల్ టెస్ట్ చేశాడు డాక్టరు

ఓ కె ఆల్ రైట్ అన్నాడు డాక్టర్

ఖైదీ అనారోగ్యంగా ఉంటే ఉరిశిక్ష అమలు పరచరు

మిస్టర్ విజయ్! నీ ఆఖరికోరికేమిటో చెప్పండి తరుస్తాము అడగాడు మెజిస్ట్రేట్

తిరిగి అతడే ఆఖరి కోరిక అంటే మీ వాళ్ళ కేదైనా వార్త చెప్పాలంటే అటువంటివి అన్నాడు మెజిస్ట్రేట్

చిరునవ్వు నవ్వాడు విజయ్

తర్వలేరని మీకూ తెల్సు అయినా అడగడం మీ వృత్తి ధర్మం అన్నాడు విజయ్

'చివరి కోరికంటూ నాకేమీ లేదు మీ పని కానివ్వండి అన్నాడు విజయ్

తర్వాత విజయ్‌ని ప్రతి రోజూలాగా కాకుండా వేడినీళ్ళ స్నానం చేయించారు జైలు దుస్తులు క్రొత్తవి, తెల్లవి ఉరికి ముందు తొడగబడేవి ధరించాడు విజయ్

తర్వాత సెల్‌లోనికి వచ్చి కొద్ది సేపు దైవ ప్రార్థన చేశాడు

ఇదంతా అయ్యేటప్పటికి 4 గంటలు కావస్తోంది

ఇంకా 19 నిముషాలే ఉంది

మరో 19 నిముషాల లోపల ఒక జీవుడు బలవంతంగా, చట్టబద్ధంగా పరలోక ప్రయాణం కట్టబోతున్నాడు

**అంతలో**

పోలీసులు వచ్చారు

విజయ్ చేతులు వెనక్కి కట్టారు కళ్ళు మూసు కొన్నాడు విజయ్

చేతులు మాత్రం సెల్ లోనే కడతారు

కాళ్ళు మాత్రం ఉరికంబం ఎక్కేముందు కడతారు

ఇద్దరు గార్డులు అతడిని చెరో వైపూ పట్టుకొని నడిపిస్తున్నారు సెల్ మెట్లు దిగారు

సెల్స్ చుట్టూ పెద్దగోడ ఆ గోడకు చిన్న తలుపు ఆ తలుపు అవతల పెద్ద మైదానం

మైదానం మధ్యలో ఉరికంబం

దాదాపు ఇరవై అడుగుల పొడవూ, పది అడుగుల వెడల్పూ ఉన్న ఎత్తైన గచ్చులాంటి ప్రదేశం దానికి ఇరువైపులా రెండు ఇనుప గొట్టాలు వాటికి కొక్కాలు ఆ గచ్చుమీద చెక్క తలుపులు ఆ తలుపులకి లీవరు

విజయ్‌ను ఉరికంబం వైపుకు నడిపించుకెళ్తున్నారు

సంతోషంగా మంగళస్నానాలు చేయాల్సిన వాడు జైల్లో వేడి నీళ్ళ స్నానాలు చేశాడు

బంధుమిత్ర సపరివారంగా పెళ్ళి మంటపము దగ్గరికి నడవ వలసిన వాడు పోలీసుల సమేతంగా ఉరికంబం వైపుకు నడుస్తున్నాడు

ఒక్కొక్క అడుగు భారంగా ముందుకు వేస్తున్నాడు విజయ్

అప్పటిదాకా ఎంతో ధైర్యంగా ఉన్న అతని మనస్సు ఇప్పుడు కొద్దిగా చలిస్తోంది

మధురమైన ఊహలతో గడపాల్సిన సమయం విషాద భరిత మయింది

పెద్ద గోడను సమీపించారు

తలుపు తెరుచుకొంది

టైం 4 గంటల 15 నిముషాలు అయ్యింది

ఉరికంబం ఇంకా పది అడుగుల దూరంలో ఉంది విజయ్ కాళ్ళు వణుకుతున్నాయి




ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తున్నాడు

ఉరికంబం పైకి ఎక్కించి చదునైన గచ్చుపై నిలబెట్టారు విజయ్‌ని

అంతకు ముందే అతడికి ఎందువల్ల మరణ శిక్ష విధించబడిందో ఏ సెక్షన్ ప్రకారం ఉరి తీస్తున్నారో వారెంట్ చదివి వినిపించారు

ఆ తరువాత అతడి కాళ్ళు త్రాళ్ళతో కట్టివేయ బడ్డాయి ఉరిబిగుసుకునేటప్పుడు కాళ్ళు గిల గిలా కొట్టుకోకుండా అలా కడతారు

కాళ్ళు కట్టడం పూర్తి అయిన తరువాత తలారి విజయ్‌తో ప్రభుత్వం వారి ఆజ్ఞననుసరించి నేనీ పని చేస్తున్నాను నన్ను క్షమించండి అన్నాడు ఆనవాయితీగా

తర్వాత నల్లటి గుడ్డ తీశాడు తలారి

క్రమంగా విజయ్ మొఖానికి ముసుగు తొడుగుతున్నాడు తలారి

క్రమంగా మొహం అంతా కప్పి మెడదగ్గరికి వచ్చే సరికి చేతికి ఏదో తగిలే సరికి ఆగాడు తలారి

ఏమిటా అని మెడవైపు చూశాడు

అక్కడ ఒక ప్లాస్టిక్ పొర కొద్దిగా లేచి ఉంది ఆ పొర క్రింద చర్మము కొద్దిగా చామనఛాయగా కొంచెం వేరుగా ఉంది

అనుమానం వచ్చింది తలారికి

ఆ పొరను కొద్దిగా లాగి చూశాడు

ముఖం పైనుంచి ఆ పొర లేచి వస్తుంది

ఉలిక్కిపడ్డాడు తలారి

రంగారావ్ సాబ్ అంటూ పెద్దగా అరిచాడు తలారి (ఇంకావుంది)

## వ్యక్తిగతం



అమెరికాలో, ఉన్న భారతీయుల విజయాల గురించిన వార్తలు ఇతోధికంగా వస్తూనే ఉన్నాయి. బిజూ పట్నాయక్ అల్లుడు కర్మాకోలా ద్వారా ప్రసిద్ధమైన గీతా మెహతా భర్త అయిన అజయ్ సింగ్ సన్నీ మెహతా ఆల్‌ఫ్రెడ్ ఎ. నోప్ అనే భారీ ప్రచురణ సంస్థకు సంపాదకులుగా నియమించబడ్డారు. ఇప్పటి వరకూ ఈ స్థానంలో ఉండిన రాబర్ట్ గోట్లిలిబ్ న్యూయార్కర్ పత్రికకు సంపాదకులుగా నియమితులవుతున్న సందర్భంగా మెహతాకు ఈ గౌరవం లభించింది. ఆయన గతంలో మొదట లాభసాటిగా నడిచిన పలాడిన్ పుస్తకాలను ప్రచురించారు. తర్వాత పాన్ పుస్తక ప్రచురణ సంస్థకు ఎడిటో రియల్ డైరెక్టర్‌గా విజయవంతమైన పికాడర్ పుస్తకాలను రూపొందించారు... □



ఒకవైపు అది రామజన్మ భూమా, బాబరీ మసీదా అని కల్లోలం చెలరేగుతున్న చోటి నుంచే మరోవైపు ఆ నియోజక వర్గపు పార్లమెంటు సభ్యుడు శ్రీ నిర్మల్ ఖత్రీ సినిమా రంగ ప్రవేశం చెయ్యనున్నారు. 35 సంవత్సరాలు గల శ్రీ ఖత్రీ ఫైజాబాద్ నియోజక వర్గానికి కాంగ్రెస్ (ఐ) తరఫున పార్లమెంటులో ప్రాతినిధ్యం వహిస్తున్నారు. "మంచి రాజకీయవేత్త మంచి నటుడుగా కూడా ఉండాలి, కదూ?" అని ఆయన ప్రశ్నిస్తున్నారు. ఆయన గతంలో ఉత్తరప్రదేశ్ యువజన కాంగ్రెస్ అధ్యక్షుడుగానూ, 1980-82లో వి.పి. సింగ్ మంత్రివర్గంలో ఆ రాష్ట్ర విద్యామంత్రిగానూ పని చేశారు. ఇంతకు ముందు నటనానుభవమేమీ లేని శ్రీ ఖత్రీ ప్రస్తుతం ప్రదీప్‌కుమార్ నిర్మిస్తున్న 'వక్త్ కీ ఆవాజ్' చిత్రంలో ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తున్నారు. ఈ చిత్ర కథ స్వాతంత్ర్యోద్యమంపై ఆధారపడింది. దర్శకుడు ప్రదీప్‌కుమార్ మరో చిత్రం షూటింగ్ సందర్భంగా ఫైజాబాద్ వచ్చినప్పుడు ఆయన ఖత్రీ గొంతు వినడంతో ఖత్రీకి ఈ అవకాశం లభించింది.... □

# వారఫలం

13-3-1987 శుక్రవారం మొదలు
19-3-1987 గురువారం వరకు

★ **మేషం** · వ్యాపార రీత్యా మేలున్నది. మాటకు విలువ చేకూరుతుంది. సభా గౌరవమున్నది. పత్రికా గౌరవానికి ఆస్కారమున్నది రాజకీయ యత్నాలకు దిగవచ్చు. మేలే జరుగుతుంది స్త్రీలకు ఉద్యోగ రీత్యా పెంపు, బంధు ప్రీతి, ఆదాయమందు వృద్ధి

★ **వృషభం** · ఆదాయమున్నది నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది దూరాబారాల నుండి మిత్రులు రావచ్చు స్తోత్ర పాఠకులను యింటికి రానియకండి అధిక వ్యయం చేయవలసిన వారం రాజకీయంగా మీకు మేలున్నది అలాంటి ప్రయత్నాలకు దిగండి స్త్రీలకు సర్వ విధాలా మేలు

★ **మిథునం** ఈ వారంలో ఏ ప్రయత్నం చేసినా మీకు అనుకూలమే. మాటకు మర్యాద అతిశయిస్తుంది సభా పూజ్యత కొందరకు. పత్రికా గౌరవం కొందరకు చేకూరుట గమనింపదగిన అంశం స్త్రీలకు ప్రయాణావకాశాలు. తద్వారా ఏదో మేలు జరుగనున్నది

★ **కర్కాటకం** . వృత్తియందు పెంపునకు ఆస్కారం ఉద్యోగరీత్యా కొందరకు పెంపు చెప్పదగిన సమయం రాజకీయాలలో జోక్యంగల వారికిగాని, పోటీలకు దిగినవారికిగాని శ్రేయస్కరమైన వారం స్త్రీలకు సంఘ మర్యాద, సభా మర్యాదలకు ఆస్కారమైన వారం గ్రహించండి

★ **సింహం** . ఉద్యోగ వృత్తులందు మీకు పెంపు కనిపిస్తుంది స్థిర చరాస్తులందు యిటీవల ప్రజ్వలించిన రభ రభలు క్రమంగా శాంతిస్తాయి మనశ్శాంతి ఏర్పడుతుంది స్త్రీలకు ఉద్యోగమందు కొంత మేలు చేకూరుతుంది కొందరకు జీతంలో పెంపు చేకూరవచ్చు గ్రహించాలి

★ **కన్య** · రాజకీయవాదులకు, పదవులు ఆశించు వారికి, పోటీలందు పాల్గొనువారికి ఈ వారం అనుకూలం సభా పత్రికా గౌరవాదులు, కొందరకు లభ్యం కాగలవు ధనాదాయమున్నది శుభ కార్యాలోచనలు ఫలించుటకు అవకాశం గల వారం స్త్రీలకు : కళా సాహితీ రంగాలందు అనుకూలతగల వారం, గమనించాలి.

★ **తుల** రాజకీయంగా అంత సుకరం కాదని, వృథా శ్రమయని గ్రహించగలుగుతారు. కొందరకు నూతనోద్యోగానికి అవకాశం, ఉద్యోగమందు ఉన్న వారికి మేలుంటుంది స్త్రీలకు నూతన వస్త్రాలు కొనుటకు, నగలు తయారించుకొనుటకు ఆస్కారం

★ **వృశ్చికం** · క్రమ క్రమంగా మీ రాశి శుభగ్రహానుకూల్యత పుంజుకొనుచున్నది గురు గ్రహానుకూల్యత గలదు అంటే శుభ ప్రయోజనాలు జరుగుతాయి ఒక వేళ శుభ కార్య ప్రస్తావనలు కూడా ఉండగలవు అధిక వ్యయ సమయం. అయినా ఆదాయానికి లోటు రాదు స్త్రీలకు వృత్తియందు మేలు, గ్రంథ రచనాసక్తి చేకూరుతుంది

★ **ధనుస్సు** వ్యవహార రీత్యా మేలైన దినాలు ఎంతో కాలంగా పరిష్కారానికి నోచుకొనని వ్యవహారం సానుకూలంకాగలవారం రాజకీయాలలో జోక్యం గలవారి యత్నాలు సాగిరాగలవు స్త్రీలకు కళా రంగాన, సాహితీ రంగాన మెలకువగల వారికి మేలే జరుగుతుంది

★ **మకరం** · రాజకీయంగా మీకు ప్రగతి కనిపిస్తుంది రాజకీయ వాదుల స్నేహం లాభదాయకమవుతుంది కొందరకు వ్యాపార సంబంధంగా ప్రయాణాలు చెయ్యవలసిన అగత్యం ఏర్పడుతుంది స్థిరాస్తులందు కొంత అభివృద్ధి చేకూరుతుంది స్త్రీలకు ఉద్యోగ వృత్తులందు చెప్పదగిన ప్రగతి ఏర్పడుతుంది కళా రంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది

★ **కుంభం** అయిన వారితోగాని, పరిచయులతోగాని, చుట్టు ప్రక్కల వారితోగాని తగాదాలు రావచ్చు ధన ధాన్య సంపత్తికి లోటు లేనివారం, శుక్ర శని వారాలందు యత్న కార్య సిద్ధి స్త్రీలకు ఉద్యోగమందు పెంపు చేకూరుతుంది, ఆశయ సిద్ధికి అనుకూలం

★ **మీనం** : అనుకూల వాతావరణం అన్ని రంగాలలోగల వారం సుఖ శాంతులకు ఆలవాలం వ్యవహారం అనుకూలం రాజకీయంగా ప్రయత్నాలకు దిగవచ్చు, ఫలిస్తాయి కృషి లోపం ఏ మాత్రం ఉండరాదు స్త్రీలకు వృత్తి యందు సుగుణం, ఉద్యోగరీత్యా మేలు, గ్రహించండి

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

గోద్రెజ్

క్రొత్త

# మేగా

నీలి డిటర్జెంట్ బిళ్ల

ఏఓఎస్* కల్గినది




భారతదేశపు ప్రముఖ అధికార-రక్షకురాలు రజని ఇప్పుడు ఉపయోగించేది కేవలం మేగా.

*ఏఓఎస్ – మరింత నురుగు, మరింత శుభ్రపరిచే శక్తి ఇచ్చే ఒక అద్భుత దినుసు.

Mudra: B:GS 4223 TEL

# పరివర్తన

## భమిడిపాటి భాస్కరరామశాస్త్రి

'ప్రియమైన అన్నయ్యకు నమస్కరించి వ్రాయునది

నేను చాలా చిన్నవాడిగా ఉన్నప్పుడే మన అమ్మ గతించింది ఆ నాటి నుండి నాన్నగారే స్వయంగా అన్నీ అయి నిన్నూ నన్నూ పెంచారు నీకు పెద్దమామయ్య కూతురుతో పెండ్లయింది కొంత కాలానికి. ఆ నాటి నుండి వదిన నన్ను కన్న తల్లిలా కడుపులో పెట్టుకుని సాకింది ఆవిడ ప్రోద్బలంతో నే నేను చదువులో ఫస్టుగా రాగలిగే వాణ్ణి ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు

అలా చదువులు కొనసాగించి నేను మెడిసిన్ ప్యాసయ్యాను నువ్వూ, వదినా స్నాతకం పీటల మీద కూచుని, అమ్మ చివరి కోరికగా చిన్న మామయ్య కూతురుతో నన్నో ఇంటి వాణ్ణి చేశారు

అన్నయ్యా! నాకు మొదటి నుండీ విదేశాలకు వెళ్ళి విద్యలో ఉన్నత శిఖరాలను అందుకోవాలనే ప్రగాఢమైన కాంక్ష ఉండేది

తల్లి లాంటి వదిన, తండ్రిని మించిన ప్రేమానురాగాలు కల నీ అండదండలతో ఆ కోరికా నెరవేరింది సుగుణా నేనూ కలిసి ఈ విదేశీ గడ్డ మీద కాలు మోపి యిప్పటి కప్పుడే పది సంవత్సరాలయింది ఈ మధ్య కాలంలో నేను ఒక్కసారి కూడా మనయింటికి రాలేక పోయాను

నా కొడుకులు ప్రభు, విభులు కూడా మన ఊరు రావాలనీ వాళ్ళ తాతయ్యనూ, దొడ్డమ్మనూ, పెదనాన్ననూ, వాళ్ళ పిల్లలనూ చూడాలని చాలా ఉబలాట పడుతూండేవారు అయినా నా పని ఒత్తిడి కారణంగా ఎప్పటి కప్పుడే వాయిదాలు వేసూ వస్తున్నాను ఇన్నాళ్ళూ

మన ఊరు ఎలా ఉంటుంది నాన్నా? అని పదే పదే అడుగుతూంటారు వాళ్ళు వాళ్ళు పుట్టినదీ పెరిగినదీ అమెరికాయే అయినా వాళ్ళు తెలుగు చక్కగా మాట్లాడగలరు చక్కగా వ్రాయగలరు ఈ విషయంలో నీ మరదలిని మెచ్చుకు తీరాలి

వాళ్ళు అలా అడిగినప్పుడు నీ మరదలు వాళ్ళకేం చెబుతుందో తెలుసా?

చూడండి పిల్లలూ, ఒక దేశానికి మరో దేశపు రాష్ట్రపతివంటి ప్రముఖుడు వచ్చినపుడు విమానాశ్రయంలో తుపాకులు భుజాన ధరించిన సైనికులు బాటకు యిరు వైపులా స్వాగత పూర్వకంగా నిలబడి ఉంటారే, అలా మన ఊరికి వెళ్ళే తోవ పొడవునా రోడ్డుకు యిరువైపులా గర్వంగా తలెత్తి బంగారం పండించే కొబ్బరిచెట్లు చల్లగాలికి తలలు అల్లల్లాడిసూ నిలబడి ఉంటాయి అంటుంది

అది విన్న పిల్లలు తమ మనో పలకం మీద ఆ దృశ్యానికి రూపకల్పన చేసుకుందుకు ప్రయత్నిసూ, ఇంకా ఏమేం ఉంటాయో చెప్పమ్మా!" అంటారు కుతూహలం నిండిన గొంతులతో

వాళ్ళ ప్రశ్నకు సుగుణ నవ్వుతుంది ఒరేయ్! అక్కడి ప్రకృతి సౌందర్యం కళ్ళతో చూడవలసిందే వర్ణనలకు అందదర్రా, అంటుంది

పిల్లలు మారాం చేసారు

ఎటు చూచినా కనుచూపు ఆనినంత మేర పరుచుకుని ఉండే పచ్చని చేలూ, కొబ్బరి తోటల గురించీ చెబుతుంది ప్రయాణాలకు వాడే ఎడ్ల బళ్ళూ, గేదెల నడ్డి మీద కూచుని లల్లాయి పదాలు పాడుకుంటూ మేతకు తోలుకు పోయే పాలి కాపు కుర్రాళ్ళ గురించి కూడా చెబుతుంది వర్షాకాలం గురించి, వరినాట్ల గురించి వర్ణిస్తుంది సంక్రాంతి సంబరాలు తనివి దీరా వర్ణిస్తుంది ఉగాది పచ్చడి రుచిని నోరూరేలా వర్ణిస్తుంది దీపావళి బాణసంచాల సందడి కళ్ళకు కట్టినట్టుగా చెబుతుంది వాటిని వర్ణించే టప్పుడు సుగుణ ముఖంలో ఓ దివ్య తేజస్సు ప్రకాశిసూ ఉంటుంది

అన్నయ్యా! బహుశః 'జననీ జన్మభూమిశ్చ అని మన వాళ్ళు అందుకే అన్నారేమో నని పిస్తుంటుంది నాకు ఆ దృశ్యాన్ని చూస్తుంటే

ప్రతీ వారాంతంలోనూ మా యింట్లో యిదే చర్చ పునరావృతం అవుతూంటుంది దానితో పిల్లల తహతహ మరీ పెరుగుతూంటుంది

నువ్వు నాన్నగారు దివంగతులయినపుడు కేబుల్ పంపించావు కాని నేను అప్పుడు సెలవు తీసుకుందుకు వీలు చిక్కలేదు నాన్న గారి చివరి చూపుకు నోచుకో లేక పోయానే అన్న చింత అనుక్షణం నామనస్సును శల్యంలా బాధిసూనే ఉంటుంది కాని ఏం చెయ్యను? మరో మాసంతో సంవత్సరీకాలు ఎలాగూ ఉన్నాయి కదా? అప్పటకి నేనూ, మీ మరదలూ పిల్లలూ అక్కడ ఉంటాం

ఈ లోగా ప్రభు విభులకు వీసాలు పాస్ పోర్టులు తీసుకోవాలి

అన్నయ్యా! ఇంతకూ ఈ పదేళ్ళలో మన తెలుగు దేశం ఏమన్నా మారిందా" అన్నట్టు యిప్పుడు మన దేశాన్ని తెలుగు దేశం అనకూడదు కాబోలు అర్థ విపర్యయం రాకుండా ఉండాలంటే ఆంధ్ర దేశమనే అనాలనుకుంటాను

అన్నట్టు చెప్పడం మరిచాను అన్నయ్యా! మరో శుభవార్త నువ్వూ, వదినా కూడా బ్రహ్మానంద పడే శుభవార్త

సారీ అన్నయ్యా! ఆ శుభవార్త మేం అక్కడకు వచ్చాక స్వయంగా మీ చెవిని వేస్తాం

ఇట్లు

నీ తమ్ముడు

ప్రసాద్

ఉత్తరం లోంచి తల పైకెత్తాడు నారాయణ. ఎదురుగా భార్య పూర్ణ నిలబడిఉంది అతడి చేతిలోని ఉత్తరం వంకే చూస్తోంది ఆ ఉత్తరం చూచే టప్పటికే ఎక్కడి నుండి వచ్చిందో అర్థమైందావిడకు

ఏమండీ మరిది ఉత్తరం వ్రాశాడా? ఏమని వ్రాశాడు?' అడిగింది పూర్ణ నారాయణ ఉత్తరం పైకి చదివి వినిపించాడు

ఉత్తరం చివరలో ఏమిటో శుభవార్త అంటూ వ్రాశాడు ఏమిటయి ఉంటుందంటారు? కుతూహలంగా అడిగింది

"ఆఁ! ఏముంది? ప్రభూ, విభూలకు మరో తమ్ముడో చెల్లాయో పుట్టబోతున్నారని అయి ఉంటుంది తేలిగ్గా నవ్వేసూ అన్నాడు

ఊరుకోండూరుకోండి ఎవరయినా వింటే నవ్వి పోతారు ఈ మారుమూల మన పల్లెటూళ్ళలోనే యిద్దరు లేక ముగ్గురని అందరూ ఒట్టు వేసుకుంటూంటే అమెరికా వంటి గొప్పదేశంలో ఉంటూన్న వాళ్ళ మాట వేరే చెప్పాలా? అదిగాక, విభూగాడికే అప్పుడే ఏడేళ్ళు నిండబోతున్నాయి ఇన్నాళ్ళకు మళ్ళీ యిప్పుడు ఎల్లాగా? ఊరుకోండూరుకోండి

పోన్లేవే! ఎలాగూ ఈ నెలాఖరుకు వాళ్ళిక్కడకు రానే వస్తున్నారాయె ఆ శుభవార్త ఏదో వాళ్ళ నోటనే విందాంలే "

ప్రసాద్ బాబు, సుగుణమ్మ, వాళ్ళ పిల్లలు అందరూ కలిసి దేశం వస్తున్నారన్న వార్త విని వాళ్ళ పెదపాలేరు రామయ్య కూడా చాలా సంతోషించాడు

★ ★ ★ ★ ★

సంవత్సరీకాలు అయిపోయాయి వచ్చిన బంధువులు ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు నారాయణా, ప్రసాద్‌లకు చిన్న మేనమామ, ప్రసాద్‌కు మామ అయిన చంద్ర శేఖరం కూడా బయలు దేరాడు భార్యను వెంట పెట్టుకుని. చంద్రశేఖరం మామగారికి మగపిల్లలు లేక పోవడమూ ఒక్కతే కూతురూ కావడంతో అతడికి ఆ ఊళ్ళో ఉన్న ఆస్తిని సొమ్ము చేసుకుని మామగారి ఊరు రామవరంలో స్థిరపడ్డాడు

చంద్రశేఖరం భార్య సరస్వతితో కలిసి బండెక్కబోతూ, ఏరా ప్రసాదూ! ఇంకా ఎన్నా

ళ్ళుంటారు? మాతో కలిసి రారాదూ? అన్నాడు ప్రసాద్ స్వయంగా మేనల్లుడే కావడం చేత అతడిని సంభోధించే టప్పుడు ఏక వచన ప్రయోగమే చేస్తాడు చంద్రశేఖరం

మరో నాలుగు రోజుల్లో వస్తాంలే మామయ్యా

చంద్రశేఖరం దంపతులు సరే నని చెప్పి వెళ్ళిపోయారు

గతవారంగా బంధుజనంతో కళకళలాడు తున్నయిల్లు అనాడు బోసి పోయినట్లుంది

ప్రభు విభూలిద్దరూ పెదనాన్న గారి పిల్లలతో కలిసి తోటలూ దొడ్లూ తిరుగు తున్నారు ఊరిపెద్ద కాల్వలో హుషారుగా ఈతలు కొడుతున్నారు

సాయంత్రం భోజనాల వేళయింది నారాయణా ప్రసాదూ కలిసి భోజనానికి కూచున్నారు వెండి పువ్వు లమర్చిన టేకుపీటలూ, బంగారు పూలు కూర్చిన వెండి కంచాలు పూర్ణ వడ్డన చేస్తోంది సుగుణ సాయం చేస్తోంది

పదేళ్ళుగా విదేశంలోనే ఉన్నా తనకు స్వయంగా పినతండ్రి కూతురు, తోడి కోడలు అయిన సుగుణ ఏమీ మారలేదని ఆనందిస్తోంది పూర్ణ

అవును ఏమయినా సుగుణ కూడా ఒక తెలుగింటి ఆడపడుచు బ్రతుకు తెరువు కోసం ఏదేశంలో స్థిరపడినా తన సంస్కృతిని ఎలా మరచి పోతుంది?

ప్రసాదూ" పిలిచింది పూర్ణ ఆమె మరదిని ఎప్పుడూ పేరు పెట్టే పిలుస్తుంది తాను ఆ యింట కాలు పెట్టే నాటికే ప్రసాదు చిన్నవాడు కావడం ఒక కారణమైతే, స్వయానా మేనత్త కొడుకు కావడం రెండవ కారణం

"ఏం వదినా? కంచం లోంచి తల ఎత్తి అడిగాడు ప్రసాద్

'ఏమిటో శుభవార్త అంటూ వ్రాశావు అదేమిటో చెప్పు

"ఔనురా! మీ వదిన తెగ ఆరాట పడిపోతోంది. తన కెలాగూ ఉన్న వాళ్ళిద్దరూ మగపిల్లలే కదా కనీసం నీ వయినా ఓ ఆడనలుసుకు తండ్రివవుతావేమో నని కనిపించిన ప్రతీ రాయికీ రప్పకూ మొక్కుతోంది అన్నాడు నారాయణ

పెద్ద బావ మాటలకు సిగ్గుపడి కాస్త పక్కకు తప్పుకుంది సుగుణ

'అబ్బే. అలాంటిదేం కాదన్నయ్యా' నవ్వుతూ చెప్పాడు ప్రసాద్

మరేమిటయ్యా అదీ' అడిగింది పూర్ణ

"ఏం లేదు వదినా ఇక అమెరికా వెళ్ళకుండా యిక్కడే ఉండి పోదామని

ఆ మాటతో పూర్ణ ముఖం పూర్ణ చంద్రబింబ మంత అయింది

తనూ తోడికోడలూ కలిసి ఉండవచ్చుననీ, తన పిల్లలూ మరది పిల్లలూ కలిసి తిరుగుతూంటే ఆ నాలుగిళ్ళ భవంతికి కొత్త కళ వస్తుందనీ సంబర పడింది పైగా మరిది ఆ ఊళ్ళోనే ఉండడం వల్ల చుట్టు పక్కల గ్రామాలకూ, పేద ప్రజలకూ కూడా చక్కని వైద్య సదుపాయం అందుతుందనీ కూడా ఆనందించింది పూర్ణ

పోన్లే, ఇన్నాళ్ళ కయినా నీకు పుట్టిన గడ్డ మీద గాలి మళ్ళింది అంది

ఏరా! ఇంతకూ అమెరికాలో చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా చేసి రాలేదు కదా? అడిగాడు నారాయణ అతడి స్వరంలో కాస్త కరుకు దనం ధ్వనించింది

అన్నగారి ప్రశ్నకు నిర్విణ్ణు డయ్యాడు ప్రసాద్ తన నిర్ణయం విని సంతోషిస్తాడనుకున్న అన్నయ్య ఏమాత్రం అభినందన పూర్వకంగా మాటాడకపోయే సరికి ఎంతో నిరుత్సాహానికి కూడా గురయ్యాడు

కల్లోల తరంగితమైన మనస్సును కాస్త సమాదాన పరుచుకుని, ఇంకా లేదన్నయ్యా అన్నాడు

'పోన్లే రక్షించావ్ ఏకంగా రాజీనామా పారేసి వచ్చావేమో నని హడలి చచ్చాను కంచంలోని ఆఖరి పెరుగు ముద్దలు జుర్రుతూ అన్నాడు నారాయణ

నారాయణ అలా ఎందుకు మాట్లాడుతున్నాడో అర్ధంకాక నిర్ఘాంత పోయి చూస్తున్నారు ఆడవాళ్ళిద్దరూ

ఏం అన్నయ్యా అలా అడిగావు?

అప్పటికి అన్నదమ్ములిద్దరి భోజనం పూర్తయింది కడుక్కున్న చేతులూ కాళ్ళూ తుడుచుకుంటూ మండువాలోకి వచ్చారిద్దరూ







Rao -

నారాయణ తూగుటుయ్యాల బల్ల మీద కూచున్నాడు

ప్రసాద్ అతడి ఎదురుగా ఓ పేము కుర్చీలో కూచున్నాడు నారాయణ సావకాశంగా పొగాకు పాయదీసి చుట్ట చుట్టుకున్నాడు వెలిగించుకుని గుప్పు గుప్పున పొగపీలుస్తూ, ఏం లేదురా! నాన్న ఏదో నిరవాకంగా ఆస్తి పాస్తులు చూచుకుంటూ వస్తున్నాడని మనం అనుకుంటున్నాం కాని, ఏమేం ఖర్చులు చేసే వాడో నాకు తెలియలేదు అయన పోయి కర్మకాండలు పూర్తయే సరికి ఒక్కొక్క సంగతే వెలుగులోకి రావడం మొదలయింది తాను ఊదిన పొగ మేఘాల వైపు చూస్తూ అన్నాడు నారాయణ

'ఏమైంది? ఏమైందన్నయ్యా?" కుర్చీలో కాస్త ముందుకు వాలి అన్నాడు ప్రసాద్ అతడి కంఠంలో ఏదో తెలియనిగాబరా

ఏమౌతుంది? కావలసిందేదో అప్పటికే అయి పోయింది ఋణదాతలు ఒక్కొక్కళ్ళే రావడం మొదలు పెట్టారు ఆ ఋణాల మొత్తం చూచే సరికి నా ముఖం తిరిగి పోయిందనుకో '

మరి నాకెందుక్రాయలేదన్నయ్యా? కాతర స్వరంతో అడిగాడు ప్రసాద్

నువ్వు మాత్రం ఏం చేస్తావురా దేశం కాని దేశంలో ఉంటున్నావాయె' అని,

'సమయానికి పెద్ద మామయ్య దేముడిలా అడ్డు పడ్డాడనుకో

'ఇంతకూ ఏం జరిగిందన్నయ్యా?"

"ఎం చెప్పమంటావు ' అని ఉస్సురని నిట్టూర్చి, "నేనిప్పుడు పెద్ద మామయ్య దగ్గర పొలం కౌలుకు తీసుకుని సంసారం నెట్టుకొస్తున్నాను ఈ ఇల్లు, మన వీధి చివరి నివేశనస్థలం మిగలడం గగనమైంది నీకేం? మహారాజులాగ చదువుకున్నావు కనుక అక్కడ రెండు చేతులా సంపాదించుకుని హాయిగా బ్రతుకుతున్నావు ఒరేయ్ తమ్ముడూ! నేను నిన్ను ఇక్కడ ఉండొద్దని మాత్రం అనను ఇల్లిలాగూ ఉంది ఇందులో మనిద్దరికీ సమాన మైన హక్కుంది కాని నువ్విక్కడ ప్రాక్టీసు పెట్టాలంటే

# పరివర్తన

బోలెడు ఖర్చవు తుందనుకుంటాను?'

ఔనన్నయ్యా

మరిఇన్నాళ్ళుగా అక్కడ ఉన్నావు కదా! అక్కడ ఏమీ సంపాదించలెదూ? మన వీధి చివర దాదాపు మూడు కుంచాల స్థలం ఉంది దానితో నా వాటా విడిచి పెట్టు కుంటాను అందులో హాస్పిటలు కట్టించుకో నీ జీవితం హాయిగా గడుస్తుంది నే నెలాగూ మట్టి పిసుక్కొని బ్రతకాల్సిన వాణ్ణే నాకేం బాద లేదు ఆరిపోయిన చుట్ట వెలిగించు కుంటూ అన్నాడు నారాయణ

★ ★ ★ ★ ★

కాస్త ఉక్కగా ఉండడంతో తొడుక్కున్న లాల్చీ విప్పి, సిగరెట్టు వెలిగించుకొని కిటికీ గుండా చీకట్లోకి చూస్తూ నిలబడ్డాడు ప్రసాద్

సుగుణ మెల్లగా ఆ గదిలోకి వచ్చింది

ప్రభు విభులు పెదనాన్న గారి పిల్లలతో కలిసి మండువా సావిట్లో తివాచీ మీద హాయిగా నిద్ర పోతున్నారు

సుగుణ భర్త వెనుకకు వచ్చి, 'ఏమిటండీ ఈ ఘోరం? ఇది నిజమేనంటారా" అంది

ప్రసాద్ ఉస్సురని నిట్టూర్చాడు

'మీ వరస చూస్తుంటే యిదేమని కూడా అడక్కుండా తిరుగుదారి పట్టేట్టుంది కాస్త కూస్తానా? చచ్చు సంభావనగా లెక్కేసినా మీ వాటా అయిదారు లక్షలు తక్కువుండదు మామయ్య దుబారా చేశాడంటే నేను నమ్మను

నేనూ నమ్మను కాని మనం ఏం చెయ్యగలం?' అతడి గొంతులో నిరాశ

నలుగురు పెద్దల్నీ పిలిచి తగువు పెడితే సరి ' ఆమె గొంతులో ఉక్రోషం

"దానివల్ల మనం నలుగురిలోనూ పలుచ నవడం తప్ప మరేం ప్రయోజనం ఉండదు మనం దేశం కాని దేశంలో ఉంటున్నాం అన్నయ్య స్థానికుడు ఇక్కడి వారు వాడి పక్షానే నిలబడతారు తప్ప మనల్ని వెనకేసుకురారు '

మా పెదనాన్న యిక్కడే కదా ఉంటున్నాడు రేపు అతడితో మాటాడండి '

తన పెద్ద మేనమామ తన అన్నకు పిల్ల నిచ్చిన మామ సుగుణ అమాయకురాలు తన పెదనాన్న ఏదో న్యాయం చేస్తాడని ఆమెనమ్మకం అయినా ఆమె మాట కాదని చిన్న బుచ్చడం ఎందుకని సరే 'నన్నాడు ప్రసాద్

★ ★ ★ ★ ★

ఏమిటండీ ఈ ఘోరకలి? భర్త నడిగింది పూర్ణ

నారాయణ మాట్లాడలేదు నీకెందుకన్నట్టు తిరస్కారంగా చూచాడామె వైపు

మాట్లాడ రేమిటండీ? మామయ్య ఆస్తంతా జులాయిగా పాడు చేశాడా? దాన్ని మీరు సరిదిద్ది ఓ కొలిక్కి తెచ్చారా? చచ్చి స్వర్గాన ఉన్న మామయ్య మీద ఈ అబాండాలేమిటండీ? ఎందుకండీ మాయ మాటలు? ఏం? ప్రసాదు మాత్రం మన బిడ్డవంటి వాడు కాదూ? అతడికి మాత్రం పిల్లలు లేరూ? సరస్వతి కటాక్షం ఉంది అతడికి చదువంటింది అతడి సొమ్ము అన్యాయంగా పడేసుకుందుకు ప్రయత్నించడం మనకు ఎంత మాత్రం శ్రేయస్కరం కాదండీ! సంతత దారగా కన్నీళ్ళు కారుతున్నాయి పూర్ణకు

ఏమిటే? ఏమిటి నీ ఉద్దేశ్యం? అక్కడికి మరిది మీద నీకే పెద్ద అబిమానం ఉన్నట్టు ఏమిటా ఏడుపు? వాడు నాకు తమ్ముడే! ఆ మాట మరచి పోకు" తీక్షణంగా అన్నాడు నారాయణ

"నే చెప్పేదీ అదేనండీ! తమ్ముడిని అన్యాయం చేసిన వాడెవడూ బాగు పడడూ అనేనే చెప్పేది వాత పెట్టినట్టు చెప్పింది పూర్ణ

అంటే? ఏమిటే నీ ఉద్దేశ్యం? నేనబద్ధా లాడుతున్నా ననే కదా! వెళ్ళి మీ నాన్న నడగవే! చిరాగ్గా అన్నాడు నారాయణ

తన తండ్రి నడిగితే ఏం చెబుతాడో పూర్ణకు తెలుసు మామా, అల్లుడూ తోడు దొంగలయి మరిదిని అన్యాయం చేస్తున్నారని తెలుసుకుంది తాను ఏమీ చెయ్య లేని నిస్సహాయురాలననీ ఆమెకు తెలుసు

అయితే ఆమె చింత అల్లా ఒక్కటే సాక్షాత్తూ పిన తండ్రి కూతురే అయిన తోడి కోడలు, కొడుకు కన్నా ఎక్కువయిన మరిది తమగురించి ఎంత నీచంగా అనుకుంటారా అన్నదే ఆమె ఆవేదన

తన భర్తకు ఎంత తోస్తే అంతే ఇక ఎంత చెప్పబోయినా తన పట్టు విడువడు గుడ్ల నీరు కుక్కుకుంటూ మండువాలోకి పచ్చింది

తన పిల్లలు, తోడి కోడలు పిల్లలూ తివాచీ మీద హాయిగా ఆదమరచి నిద్రపోతున్నారు లోకంలోని కుళ్ళు కుతంత్రాలు తెలియని పసివాళ్ళు కళ్ళు పమిట కొంగుతో ఒత్తుకుంటూ తానూ పిల్లల పక్క మేను వాల్చింది పూర్ణ

★ ★ ★ ★ ★

'ఒరేయ్! నేనేమయినా అంటే నీకు కోపం రావచ్చు మీ నాన్న ఏదో శ్రీరామచంద్రుడి తలతన్ని పుట్టిన మహానుభావుడనే భ్రమ కూడా నీకు






ఉండొచ్చు తోడబుట్టిన దాన్ని యిచ్చుకున్న వాడిని కనుక ఎంతగానో చెప్పి చూచాను అబ్బే! వింటాడా? అతడంతటి వాడు అతడూ! చివరకు హరిమనే టప్పటికి పరిస్థితి అంతా కుక్కలు చింపిన విస్తరి చందమైంది

పాపం మీ అన్నయ్య! వాడికి అది పెద్ద దెబ్బే అయింది మతిభ్రమిస్తుందేమోనని కూడా భయపడ్డాను అయినా ఎలాగో ఓలా వాడే నిలదొక్కుకున్నాడు అప్పటి పరిస్థితి నంతా వివరంగా నీకు వ్రాయమని ఆ నాడే చెప్పాను పట్టుదలకు వాడు మాత్రం ఆ తండ్రి కొడుకు కాదూ! తన బాధ ఏదో తానే పడతానన్నాడు కాని దూరదేశంలో ఉంటున్న నీకు కూడా మనశ్శాంతి లేకుండా చేయలేనన్నాడు

నీ వరస చూస్తుంటే దేవుడి లాంటి మీ అన్నయ్యనే శంకిస్తున్నట్టు కనపడుతోంది వాడికి అలాటి శాస్తి కావలసిందేలే! అన్నాడు పెద్ద మేనమామ రాఘవయ్య

ప్రసాద్ ఇంకేమనగలడు? మారు పలకకుండా తిరిగి వచ్చాడు ఏమైందంటూ ఎదురు వచ్చిన సుగుణకు అంతా చెప్పాడు ఆమెకు కోపమూ దుఃఖమూ కలబోసుకుని ఉప్పెన కెరటాల్లా లేచాయి

"కోర్టు కీడుస్తే గాని లాభం లేదు అంది కోపంగా

చ్ఛాల్లే ఊరుకో! ఇక మన బ్రతుక్కి అది ఒక్కటే తరువాయి "

సుగుణ మరేమీ మాట్లాడలేదు

* * * *

ఆ రోజు సుగుణా ప్రసాదూ రామవరం ప్రయాణం పెట్టుకున్నారు కొమ్ములకు కాళ్ళకు చిరుమువ్వలు, మెడలకు గంటలు, నడ్డికి పటకాలతో నందీశ్వరుని తమ్ముల్లా అనిపించే ఎడ్లబండి వాకిట్లో సిద్ధంగా ఉంది బండిలో మెత్తగా గడ్డి పరిచి పైన జంబుఖానా కప్పి సిద్ధం చేశాడు చిన్నపాలేరు

ప్రభు విభూలు ఎడ్లబండి మీద ప్రయాణం అనే సరికి ఉత్సాహంతో ఊగి పోతున్నారు పుట్టినప్పటి నుండి వారు ఎడ్లబండినే చూచి ఎరుగరు అందుకే వారికా ఉత్సాహం

పూర్ణ సుగుణ కాళ్ళకు పసుపు రాసి ముందుగా తన ముఖాన కుంకుమ పెట్టుకుని తరువాత సుగుణకు బొట్టు పెట్టింది కొత్త చీరా జాకెట్టు గుడ్డా అందించబోయింది

'ఇప్పుడెందుకే అక్కా! మేం పుట్టింటి నుండి తిరిగి వచ్చాకనే కదా మా అమెరికా ప్రయాణం? అంది

"అప్పటి మాట అప్పుడు ఇప్పటి నా ముచ్చటయిది కాదనకు' ప్రాధేయ పడింది పూర్ణ ఆమె కంఠంలో మూగ వేదన మరిదినీ తోటి కోడలినీ అన్యాయం చేస్తున్నామనే రంపపు కోత

సుగుణ గదిలో పలకు వెళ్ళి కొత్త చీర కట్టుకుని వచ్చింది పెద్ద బావకు తోటి కోడలుకు పాదాభి వందనం చేసింది

పాలేరు తెచ్చి వేసిన ముక్కాలిపీట ఆధారంగా ఎడ్ల బండెక్కింది సుగుణ ప్రసాద్ బండెక్క బోతున్నాడు

బండి దగ్గరే ఉన్న నారాయణ ఒరేయ్ తమ్ముడూ! అన్నగారు తమ్ముడిని అన్యాయం చేశాడనే అపవాదు నాకు వద్దు మనయిల్లు, వెనుక ఉన్న దొడ్డితో సహా ఎంత హీనంగా లెక్క వేసినా మూడు లక్షలు కిమ్మత్తు చేస్తుంది

అదికాక మన వీధి చివర ఉన్న నివేశనస్థలం వీటిని నీ పేర రిజిష్టర్ చేయిస్తాను నే నెలాగూ మట్టి పిసుక్కుని బ్రతకవలసిన వాణ్ణే ఆనివేశన స్థలంలో నాకో రెండు సెంట్లు భూమి విడిచి పెట్టు అది చాలు అందులో ఏదో పాకో పందిరో వేసుకుని కాలక్షేపం చేస్తాను తెచ్చి పెట్టుకున్న దుఃఖ స్వరంతో అన్నాడు నారాయణ

ఇప్పుడలాటి వేమీ పెట్టుకోకన్నయ్యా, నీ దయవల్ల నేనూ బాగానే ఆర్జిస్తున్నాను నువ్వా, పిల్లలు గలవాడివి అయితే, ఇక్కడి మన ప్రజలకు




సేవ చేద్దామనుకున్న నా ఆశయం నెరవేరబోవడం లేదన్న దొకటే నా చింత మనందరం విధి చేతిలోని కీలు బొమ్మలం మనం అనుకున్నవన్నీ అనుకున్నట్టే జరుగుతే యిక చెప్పేదేం ఉంది? విరక్తిగా అని, అన్నయ్యా! నువ్వలాటి పనులేం చేయకు ' అంటూ బండెక్కాడు ప్రసాద్

* * * * * *

వీధరుగు మీద పడక్కుర్చీలో తీరుబడిగా చుట్టకాల్చుకుంటూ కూచున్నాడు నారాయణ

దండాలండయ్యగోరూ!' నారాయణ అటు చూచాడు ఎదురుగా పెదపాలేరు రామయ్య

ఏరా రామయ్యా! ఇంత తెల్లవారేవచ్చావేమిటీ?

రామయ్య కంఠం విని సావిడిలో ఏదో పని చేసుకుంటున్న పూర్ణ వీధిలోకి వచ్చింది

ఏం లేదండయ్యగోరూ! ఈయాల నే నరిజంటుగా అంబాజీపేట కెల్లాలండి

ఎప్పుడూ ఊరు కదలనివాడివి ఇంత అర్జంటు పనేమిట్రా?

సెప్పాలంటే శానాకతే ఉందండయ్యా

మేం వినకూడదేమిట్రా?

అయ్ బాబు అలాగంటారేటండి? మా బాబు కొబ్బరికాయ బళ్ళు తోలేవోడని తమరికి తెలుసు

ఔను దానికీ నీ ప్రయాణానికి సంబంధం ఏమిటి?

అదే సెపుతున్నా బాబూ ఆడు బళ్ళతోలే రోజుల్లో పేటలో ఓ ఆడమనిసి ఆడికి ఇలాకా పడ్డాదంటండి ఆ యమ్మ కడుపున గూడా ఓ కుర్రాడు పుట్టాడంటండి నాకంటే నాలుగేళ్లు అయిదేళ్లు సిన్నాడంటండి

ఇప్పుడీ గొడవంతా ఎందుకు? అసలిదంతా ఎలా తెలిసింది నీకు?

ఈ మద్దెనే మాయమ్మ కూడా పోయింది కందండీ! పోడానికి ముందు మా యమ్మే సెప్పిందండి ఒరే రాముడూ! మీ అయ్య పేటలో ఓ మనిసిని సేరదీశాడు దాని కడుపున కూడా ఓ కొడుకున్నాడు ఆడూ నా కడుపునే పుట్టాడనుకో అప్పుడాడికి నీతోపాటా ఉంటాదికందా? మరో తల్లి కడుపున పుట్టినా ఆడిలో ఉన్నదీ నీ రగతమే మనకెలాగూ రెండు గదుల కొంప రొండెకరాల కొండ్రా ఉంది ఇదంతా మీ బాబు సంపాదన దానిలో ఆడికి కూడా వాటా ఎట్టడం నాయంరా! అని సెప్పిందండి

ఒరే రాముడూ! ఇదంతా నీకు మీ అమ్మ చెప్పింది కనక తెలిసింది అంతేనా?

మీ అమ్మ చెప్పినట్టు నువ్వు చెయ్యాలనుకో! వాడేమైనా చెయ్యగలడా? ఒక్క నీ మాట తప్ప వాడికి ఋజువులూ సాక్ష్యాలూ ఉన్నాయా? ఒరేయ్ రాముడూ! నే నెందుకు చెబుతున్నానో విని పించుకో – రెండెకరాలు రెండు గదుల కొంప అంటే మాటలుకాదు నువ్వు పిల్లలు గలవాడివి తెలివి తక్కువతనానికి పోకు

అయ్ బాబయ్ బాబు! పెద్దోరు తమరే అలాగంటే ఎలాగండి బాబయ్యా! ఆ రెండెకరాలూ నా దరిద్రాన్ని తీర్చవండి అలాగే అందులో ఓ యకరం ఆడి కివ్వకపోయినా ఆడూ మాడి సావడండి ఇక

ఋజువులంటారా? బాబూ! పైన దేవుడున్నాడండి ఎవరు మెచ్చినా మెచ్చక పోయినా ఆ బగవంతుడు మెచ్చితే సాలండి సచ్చిపోయిన మా అయ్యా మా యమ్మా ఎ లోకంలో ఉండారో. అల్లు సంతోసించాలి బాబయ్యా

సెమించండి తఁవరు ఏచ్చకొఁవందులు తఁవఁకు సెప్పవగ్గ వోణ్ణికాను పెటిల్లో అద్ది పట్టుకుని అడివొటా అడకప్ప సెప్పేదాకా నాకు నిదరట్టదండి మా యింటిది నిలవనీయదండి సెలవిప్పించండి బాబయ్యా అని దండంపెట్టి పై తువాలు తలపాగా చుట్టుకుంటూ వెళ్ళాడు రామయ్య

రామయ్య మాటలకు నిర్ఘాంతపోయాడు నారాయణ తల పైకెత్తి చూచాడు ఎదురుగా పూర్ణ 'వాడే పుట్టుక పుడతేయేం? వాడికున్న గుణం మనకులేదు ' అన్నట్టుందామె చూపు

నారాయణ తనవైపు చూచేసరికి విస విసా నడుచుకుంటూ లోపలకు వెళ్ళిపోయింది పూర్ణ

చెక్కిన శిల్పంలా కూర్చుండి పోయాడు నారాయణ

అతడిలో అంతర్మదనం ప్రారంభమయింది

* * * * * *

తన బావగారి మీద పెద్ద మేనల్లుడు నారాయణ. తన అన్న రామవయ్య కలిసి వేసిన అబాండాలు అల్లుడు ప్రసాద్ ద్వారా విన్నాడు చంద్రశేఖరం అతడికి విపరీతమైన కోపం వచ్చింది

ఒరేయ్ ప్రసాదూ! ఆ రామవయ్య ఈ నాటి నుండీ ఇక నా అన్నకాదు అలాగే నీ అన్నయ్య మేనల్లుడూకాదు బూ సంస్కరణల చట్టం రోజుల్లో నీవు వ్రాసి పంపిన పవరునామాను యింత, తెలివిగా వాడుకున్నాడన్నమాట మీ అన్నయ్య

ఇప్పుడు నువ్వు నా పేరుతో పవరునామా వ్రాసిచ్చి నీ దారిని నువ్వు వెళ్ళు వాళ్ళ భరతం నేను పడతాను అని దేవుడి లాంటి మీ నాన్న మీదే అబాండాలు వేశాడు మీ అన్న ఇక వాడు అన్నేమిట్రా? నా మాట విను '

# పరివర్తన

వద్దులే మామయ్యా! నాకుమాత్రం ఏం తక్కువ? ఇంతవరకూ అక్కడ సంపాదించినది నిలవ చెయ్యాలన్న ధ్యేయం లేక యిక్కడి ఆస్తికి ఆశించాను మరొక్క అయిదేళ్ళు కష్టపడితే మన ఊళ్ళో హాస్పిటలు కట్టడానికి కావలసిన సొమ్ము సంపాదించలేకపోను ' అన్నాడు ప్రసాద్

ఎవరెంతగా చెప్పినా వినలేదు ప్రసాద్

చంద్రశేఖరమే గాక అతడి యింటివద్ద చేరిన మిగిలిన మోతుబరులు కూడా ప్రసాద్ ఉదార స్వభావానికి మురిసిపోయారు

* * * * * *

బండి గ్రామంలో ప్రవేశించింది దారిలో తమ నివేశన స్థలంలో కొందరు పనివాళ్ళు నేలను చదును చేస్తూ కనిపించారు ప్రసాద్‌కు

అన్నగారు తాను అనుకున్నట్టే చెయదానికి నిశ్చయించుకున్నాడనుకున్నాడు మనసులో

ఇంటికి చేరాక అన్నగారికి మరో మారు గట్టిగా చెప్పాలనుకున్నాడు వినకపోతే కాళ్ళమీద పడి బతిమాలి అయినా అన్నగారిని మెప్పించాలనుకున్నాడు

ఆలోచనలలో ఉండగానే బండి యింటికి చేరింది

వీదరుగుమీదే ఉన్నాడు నారాయణ అతడితో పాటు రాఘవయ్య మరి కొందరు గ్రామ పెద్దలూ కూడా ఉన్నారు

నారాయణ ఆనందంగా బండి దగ్గరకు వచ్చి తమ్ముడికి చేయందించి బండి దిగడంలో సాయపడ్డాడు సుగుణ ముక్కాలి పీటమిదుగా బండిదిగి పమిట నిండుగా కప్పుకుంటూ తలవంచుకుని యింట్లోకి వెళ్ళింది ప్రభూ, విభూలు చక్రాల మిదుగా బండి దిగడం నేర్చుకున్నారు అప్పటికే

తమ్ముడి చేతిని అలా పట్టుకునే అరుగుమీదకు తీసుకువచ్చాడు నారాయణ

అన్నయ్యా! వచ్చే ఆదివారమే మేం బయలుదేరి వెడతాం చెప్పాడు ప్రసాద్

# ప్రొద్దుటే...

పర్వతాలని పేర్చి
సూర్యున్ని రాజేసి,
ఆకాశం చేటలో
నూకల్ని చెరుగుతోంది
ఉదయ సంధ్యా సుందరి!

సముద్రం బిందెని
చంకనేసుకుని
ఒయ్యారం ఒలకబోస్తూ
నడుస్తోంది భూదేవి!

రాత్రంతా రాలిన
ఆకుల్నీ, పిందెల్నీ
చిమ్ముతోంది గాలి!

చెట్లన్నీ తమ పూల కిరీటాల్ని
మంచు బిందువుల్లో
కడుక్కుంటున్నాయి!

పద్మాసనం వేసుక్కూచున్న తుమ్మెద
ప్రణవాన్ని జపిస్తోంది!

— గన్ను కృష్ణమూర్తి

అలాగే కాని, ఓ షరతు

'ఏమిటన్నయ్యా ఆ షరతు?

వచ్చే ఆదివారం నువ్వొక్కడివే బయలు దేరుతావు నీకు అక్కడ ఉన్న లావాదేవీలన్నీ చక్కబెట్టుకుని తిరిగివస్తావు

'అన్నయ్యా!'

'ముందు నేను చెప్పేది విను అంత వరకూ సుగుణా పిల్లలూ ఇక్కడే ఉంటారు గంబీరంగా చెప్పాడు నారాయణ

అన్నయ్యా!' ఆశ్చర్యంగా అన్నాడు ప్రసాద్

ఔ న్నా తమ్ముడూ! ఇంతకు మునుపు నేనెంత నీచంగా ప్రవర్తించానో నాకిప్పుడు పూర్తిగా తెలిసొచ్చింది తమ్ముడూ! నాన్న మన ఆస్తిని ఏమీ పాడు చెయ్యలేదు పైగా ఎంతో పెంచాడు అంతా నా దురాశా ప్రభావం అదో పీడకలగా భావించి మరచిపో అని

నీవు తిరిగి రాగానే నీకు నచ్చిన పద్ధతిలో యిక్కడ హాస్పిటలు కట్టించు అందులో అన్ని సదుపాయాలూ సమకూర్చు సరియైన వైద్య సదుపాయం లేని ఈ పల్లెటూరి ప్రజలకు జీవనదానం చెయ్యి. మన పెద్దలతో సహా అందరం తరిస్తాం ' అన్నాడు నారాయణ

నారాయణ నిర్ణయానికి అక్కడ ఆ అరుగుమీద కూచుని ఉన్న యావన్మందీ హర్షించారు

ఒక్క రాఘవయ్య మాత్రమే ముఖం ముడుచుకుంటూ లేచి పైమీదితువ్వాలు ఒక్క దులుపు దులిపి విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు □



# పశ్చిమ దేశాల నిషా తలకెక్కిన తూర్పు దేశాలు!

మాదక ద్రవ్యాల నిషానించి పశ్చిమ దేశాలు ఇంకా తేరుకోకముందే తూర్పుదేశాలు కూడా ఆ మత్తులో పడి తూలిపోవడం ఎంతో దురదృష్టకరమైన అంశం. ఈ మత్తు మందుల ప్రభావంలో పడి కొట్టుకుపోతున్న వారిలో యువకులే ఎక్కువగా ఉన్నారు. యువశక్తి నీరసించిపోతే ఏ వ్యవస్థా ఆరోగ్యకరంగా ఉండలేదు. జాతిశక్తి నిస్తేజమైతే ఏ సమాజమూ మనుగడ సాధించలేదు. పశ్చిమ దేశాలకు పట్టిన ఈ దుర్గతికి విశ్వమానవ సంక్షేమాన్ని కోరేవారు ఎంతగానో విలపిస్తుండగా అంతట్లోనే ఈ జాడ్యం తూర్పు దేశాలకు కూడా పోవడం ఎవరికైనా మానసిక పరితాపాన్నీ హృదయా వేగాన్నీ కలిగిస్తుంది. ఈ విషయం పట్ల తాత్సారం చూపే కొద్దీ జాతి భవిష్యత్తు నాశనమైపోతూ ఉంటుంది. పదికాలాలపాటు మానవాళి క్షేమంగా ఉండాలని ఆశించే పక్షమైతే ఈ నిషా పిశాచిని సమూలంగా పారదోలే ప్రయత్నాన్ని త్రికరణ శుద్ధిగా చేయక తప్పదు.

హంగేరీలో నాటురకపు మార్ఫిన్, హషిష్‌ల అమ్మకాలు బాగా ఎక్కువైనట్లు వార్తలు తెలుపుతున్నాయి. నాలుగురోడ్లు కలిసే కూడలుల లోనే కాకుండా రహస్య స్థలాల్లోనూ అందరికీ తెలిసే, అక్రమంగానే ఈ నార్కోటిక్స్ వ్యాపారం కొనసాగడం శోచనీయం. మత్తు బానిసల సహకారం, ప్రోత్సహం ఈ దురవస్థకు కారణమని చెప్పక తప్పదు. పోలండ్‌లో అయితే వార్సా నగరపు సరిహద్దుల్లోనే గంజాయి మొక్కల సేద్యం చట్ట విరుద్ధంగా కొనసాగడం కనిపిస్తోందట! మాదకద్రవ్యం కాలనాగు వంటిదని, దాన్ని సేవించడం కాటు వేయించుకోవడం లాంటిదేనని హెచ్చరికలు చేస్తూ ఎన్నో రకాల కరపత్రాలను కూడా పోలిస్ అధికారులు ప్రజలకు విరివిగా పంచిపెడుతున్నారు. (ఒక రకం కరపత్రాన్ని ఇక్కడ ఉన్న బొమ్మలో చూడవచ్చు.)

సోవియెట్ యూనియన్‌లో కూడా ఈ హెరాయిన్ బెడద తీవ్రంగా పరిణమిస్తోంది. ఈ అంశం పట్ల సోవియెట్ నేత మిఖాయిల్ గొర్బచేవ్ గట్టి చర్యలు తీసుకుంటున్నప్పటికీ పాప్పీ ప్రియుల సంఖ్య దినదిన ప్రవర్ధమానమవుతూనే ఉంది. కమ్యూనిస్ట్ పార్టీ వార్తాపత్రిక ప్రావ్దాలో దేశ వ్యవహారాల మంత్రి అలెక్జాండర్ వ్లాసొవ్ మాదకద్రవ్య పీడితులు 46 వేలమందికి పయిగా ఉన్నట్లు అధికారికంగానే వెల్లడించారు. రెండు సంవత్సరాల క్రితం కేవలం 2,500 మంది మాత్రమే హెరాయిన్ స్వీకరించేవారు. దరిమిలా సోవియెట్ ప్రభుత్వం జరిపిన పాప్పీ 86 ఆపరేషన్‌వల్ల 4000 మంది హషిష్ డీలర్లు పట్టుబడ్డారు. సుమారుగా 250 వేల ఎకరాలలో పండుతున్న కన్నాబిస్ మొక్కలు కాల్చివేయబడ్డాయి. ఎంత కట్టుదిట్టంగా చర్యలు తీసుకొంటున్నప్పటికీ గంజాయి దగ్గు తెరలు తెరలుగా గ్రామీణ వాతావరణమని, పట్నణ వాతావరణమని కాని భేదం లేకుండా అన్ని చోట్లా అల్లుకుపోతోంది.

రష్యా దేశంలో విరివిగా వాడబడే కోక్‌నార్ అనబడే ఓపియమ్ గంజాయి విత్తనాలనుండి తయారు చేయబడేది. గంజాయి సేద్యం మందులకోసం చట్టం చేత అనుమతించబడినప్పటికీ చట్టం కన్నుగప్పి ఎంతో పంట అక్రమంగా పండించబడుతోందని విమర్శలు వస్తూనే ఉన్నాయి. ఇలాంటి విమర్శలు మన దేశంలోనూ ఇటీవల బాగానే వినిపిస్తున్నాయి: సోవియెట్ పత్రిక "మ్యాన్ అండ్ ది లా" మాదకద్రవ్య సేవనంవల్ల కలిగే దుష్ఫలితాలను ప్రజలకు తెలిసేటట్లు ప్రభుత్వం పూనుకోవాలని గట్టిగా హెచ్చరిక కూడా చేసింది.

మధ్య ఆసియాకు చెందిన రిపబ్లిక్ ఆఫ్ టర్క్‌మనీస్థాన్‌లో గత రెండు సంవత్సరాల కాలంలో ఏడులక్షల గంజాయి మొక్కలను ప్రభుత్వం ధ్వంసం చేయగలిగింది. మాదక ద్రవ్యాలను సేవించి అనారోగ్యం పాలైనవారికి చికిత్సచేయడానికి మాత్రం



మాదకద్రవ్యోన్మాదం ప్రాణాంతకం

ఒకేఒక ఆరోగ్య కేంద్రం ఈ దేశంలో ఉండడం విచారకరం.

సోవియెట్ రష్యాలో మాదకద్రవ్యాలు సేవించే వారిలో కేవలం 25 శాతం మాత్రమే బయట పడినట్లూ, వారికే వైద్య సదుపాయాలు అందుతున్నట్లూ ఆదేశం వారే ఎంతో మంది స్పష్టం చేస్తున్నారు. తూర్పు ఐరోపా దేశాలు కూడా ఈ హెరాయిన్ ఉధృతంలో కొట్టుకుపోతున్నట్లు తెలుస్తూనే ఉంది. 1980 నుంచే పోలండ్‌లో హెరాయిన్ నిషేధం పట్ల బహిరంగంగానే చర్చలు ప్రారంభమైనాయి. ఇంత వరకూ పెదవులు విప్పకుండా ఉన్న బల్గేరియా, రుమానియా, తూర్పు జర్మనీలు కూడా ఈ అంశం పట్ల ఎంతో ఆందోళనను వెలిబుచ్చుతున్నాయి. మాదక ద్రవ్యాల రవాణాకు తూర్పు ఐరోపా ప్రధాన కేంద్రంగా ఉన్నట్లు తోస్తుంది. సోవియెట్ బ్లాక్‌కు చెందని కమ్యూనిస్ట్ యుగోస్లేవియాలో నార్కోటిక్స్‌ను స్మగుల్ చేసేవారిలో 40 శాతం మంది విదేశీయులు ఉండడం ఈ అంశాన్ని బలపరుస్తుంది. జెకోస్లోవేకియాలో ఉన్న పశాన 90 రకాల మత్తుమందులు దొరుకుతాయని వింటుంటే ఒళ్లు జలదరిస్తుంది. పోలెండ్ పరిస్థితి మరీ దారుణం 375 లక్షలమంది (అందరూ పాతికేళ్లలోపువారే) మాదక ద్రవ్యాలకు బానిసలు కావడం కంటతడిని పెట్టిస్తుంది.

మాదక ద్రవ్యాలు పశ్చిమ దేశాలలో ఇప్పటికే ఎంతో బీభత్సాన్ని సృష్టించాయి. ఎయిడ్స్‌వంటి రాకాసి వ్యాధులు ప్రబలడానికి సెక్స్ కార్యకలాపాల కన్నా ఈ నిషా ద్రవ్యాల సేవనమే ముఖ్యకారణమని విశ్వవ్యాప్తంగా అందరూ ఒప్పుకొంటున్నారు. తెలిసి తెలిసీ మృత్యువాత పడడం ఎంత విచారకరం. పాతిక వసంతాలు గడవక ముందే జాతిశక్తి దీపాలనదగ్గ యువతీ యువకులు కాటికి కాళ్లు చాచుకోవడం ఎంత దురదృష్టకరం. జాతి భవిష్యత్తు మంటగలుస్తున్నా ఈ వ్యాపారం మాటున కుబేరులవుదామని అనుకొనేవారి వికృత మనస్తత్వం ఎంతయినా నిరసించదగ్గది. ఇప్పటికైనా కళ్లు తెరచి అన్ని దేశాలవారూ ఈ విషయంలో ఒక నిర్ణయానికి వచ్చి తగిన విధంగా వెంటనే స్పందించకపోతే చూస్తుండగనే మానవజాతి మట్టిపాలయి పోతుంది. ఎంతో ప్రగతిని సాధిస్తున్నామని అనుకొని మురిసిపోయే మనం వెనకలే పొంచి ఉన్న ప్రమాదాన్ని గుర్తించలేకపోవడం, గుర్తించినా నిర్లక్ష్యంగా ప్రవర్తించడం మానవ జన్మకే అవమానకరం!

మానవ మనుగడ చిరకాలం వర్ధిల్లాలి!

–డా. గుమ్మనూరు రమేష్‌బాబు.

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

మంజీర తనను ఎలివస్తుందేమోనని చాలా ఎదురు చూసింది హైమ

అలాంటిదేం లేకపోయేసరికి అది మొండితనం మామయ్య మొండితనమంతా దానికి సంక్రమించింది అనుకుందామె

తనే వెళ్ళాలన్నా ఎక్కడో ఎదో అడ్డు పడుతున్నట్లుంది

ప్రణీత్‌కు పైదిపల్లి నుంచి ట్రాన్స్ఫరైంది

ప్రజలలో మునుపటంత ఊపు అతని పట్ల లేక పోవటంతో బాబూరావు ప్రయత్నం ఈ సారి తేలికగా నెరవేరింది

మంజీరను కలవాలని ప్రణీత్ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు బాబూరావు చాలా జాగ్రత్తలు తీసుకున్నాడీ విషయంలో

మంజీర నిర్లక్ష్యం ప్రణీత్ మనసును గాయపరుస్తోంది ఆమె తన దగ్గరకు వచ్చెయ్యాలనుకుంటే బాబూరావు అడ్డు పెట్ట లేడని అతనికి తెలుసు

ఇన్నాళ్ళ ఎడబాటు ఆమెలో కొంచమయినా మార్పును తేలేక పోవటం తనకి వేదనను కలిగిస్తోంది

ఇక తామిద్దరూ శాశ్వతంగా విడిపోవాల్సిందేనా?

ఆమె తన దగ్గరకు రాదా?

ఆమెలేని జీవితం తన కెందుకు? ఎందుకీ నిస్సారమైన బ్రతుకు?

నో! మంజూ లేకుండా తను గడపలేడు! ఆమె తన ప్రాణం, జీవితం సర్వస్వం!

ఒక్కసారామెను ఒంటరిగా కలుసుకోవాలి తను ఆమెకు చెప్పుకోగలడు ఆమె అనుమానాలను తొలగించగలడు తన మంజూ అంత కఠినురాలు కాదు

చివరి ఆశగా ఒక్కసారి తోట దగ్గరకు రమ్మని రహస్యంగా హైమతో మంజీరకు కబురంపాడు ప్రణీత్

అతనికోసం తన పట్టుదలను పక్కకు నెట్టి మంజీర దగ్గర కెళ్ళింది హైమ

ఇంకెప్పుడూ ఇలాంటి పిచ్చి పిచ్చి రాయబారాలు తీసుకు రాకు ఆయనను దొంగతనంగా కలుసుకోవాల్సిన అవసరం నాకు లేదు నేనురాను అన్నది మంజీర

హైమ చెప్పింది విని భారంగా నిట్టూర్చాడు ప్రణీత్

తనను చేసుకున్నందుకు మంజూ ఇప్పుడు పశ్చాత్తాప పడుతోందా?

పిచ్చెక్కుతున్నట్లుగా ఉండటానికి ఆ ఊరు వదిలేసే రోజు దగ్గర కొచ్చింది

మంజీర రాదని తెలిసినా ఎక్కడో రెప రెపలాడుతున్న ఆశను అణచుకోలేక తోట దగ్గర కెళ్ళాడు ప్రణీత్

చెరువు గట్టు మీద కూర్చున్నాడు

ఆనాటి మధుర స్మృతులు విషాదంగా అతన్ని చుట్టు ముట్టాయి ఆఖరుకు చెరువులో ఉన్న నీటి మీద కూడా విషాద మర్మరధ్వనులే!

మంజూ ఎందు కిలా చేశావు? నా మీద నీ కెందు కనుమానం వచ్చింది? నువ్వు ఇక్కడికి కూడా రావటం మానేశావా!

కానీ నేను ఆశ పడుతున్నాను మంజూ ఇక్కడి కొస్తే నీ మనసు మారుతుందని

ఈ చెరువు గట్టున ఉన్న కదిమి చెట్టుకు తెలుసు మనం చెప్పుకున్న రహస్యాలు తోటలో అప్పుడు నువ్వు పూజించిన తులసి కోటకు తెలుసు మన దగ్గరతనం మామిడి తోపుకు తెలుసు మనం చేసుకున్న వాగ్దానాలు చెరువు వెనక ఉన్న ఎర్ర గన్నేరు చెట్టుకు తెలుసు మన ప్రేమలో గల నిజాయితీ

ఇవన్నీ నీ మనసును మందలించి నాకనుకూలంగా చేస్తాయని ఆశపడుతున్నాను మంజూ! తమ ముందు ఇలా కన్నీటి గీతికలా నిలచి ఉన్న నన్ను చూసి ఇవన్నీ జాలిపడుతున్నాయి

తోటలోని పూ మొక్కలు ప్రసవ బందాలు సడలేలా బాష్పాలు రాలుస్తున్నాయి

అంతరాంతర దగ్ధమైన బూడిదను నేను

నా ప్రేమలోని నిజాయితీని నువ్వెందు కర్థం చేసుకోలేక పోయావు చెలీ!

ఇది మన శాశ్వత ఎడబాటా!?'

ప్రచండ వాతూల హత నీపశాఖవలె గజ గజా వణికాడతనీ ఊహరాగానే.

అతని ఆర్తి ఏ శాంతరాగాలకు పయనించ గలదు?

వరి చేల మీద గాలి పాడుతున్న ఈల పాట విషాదంగా వినిపిస్తోంది..

**జరిగిన కథ-18 :** ప్రణీత్ మీద బాబూరావు, పాపారావు కసి తీర్చుకోవడం మొదలు పెడతారు సూర్యకళ ఇంటికి రప్పించి, మత్తెక్కించి, ఆమెతో పడక మీద ఉండగా మంజీర కంటపడేట్టు చేస్తారు సూర్యకళ హత్య చేయబడి ఆ నేరం ప్రణీత్ మీదికి వస్తుంది మంజీర ఈ ప్రచారాలకు లొంగిపోతుంది ప్రణీత్ మీద క్రింది కోర్టులలోనూ, హైకోర్టులోనూ నేరం రుజువై శిక్ష పడుతుంది సుప్రీం కోర్టులో కేసు కొట్టేయబడి నిర్దోషిగా విడుదలవుతాడు మంజీర హైమను కూడా అనుమానించి అవమానిస్తుంది

అతని కనురెప్పలు తడిసి బరువెక్కుతున్నాయి

అక్కడి వాతావరణమంతా ఆ దగా పడిన ప్రేమికుడి పట్ల సానుభూతితో చలించి పోతోంది

రోజు వారీ చిల్లర కష్టాలను తేలికగా తీసుకోగల నిగ్రహం నాకుంది కానీ నీ వియోగాన్ని భరించగలశక్తి మాత్రం నాకు లేదు మంజూ అని ఆక్రోశిస్తున్నాడతను

ఏడు చుట్లతో ముడిపడ్డ మన వివాహబంధం ఇంకెన్ని చుట్లు వెనక్కి వేసినా తెగిపోదు

నీ వివాహ సమయాన నీకు మనసు వికసించకుండా లేదు

చిన్న పిల్లకు పండు ఇస్తే ఆలోచించకుండా చప్పున నోట్లో వేసుకున్నట్లు, మనసు వికసించని వయసులో మీ వాళ్ళు నిర్ణయించిన రీతుల్లో నన్ను నువ్వు భర్తగా స్వీకరించ లేదు

అప్పుడు నీకు మనసుంది మమతుంది నా మీద ఇష్టముంది అదంతా నా మీద గుమ్మరించి మనస్ఫూర్తిగా నన్ను పెళ్ళి చేసుకున్నావు

మరి ఇప్పటి నీ ప్రవర్తనకర్థ మేమిటి మంజూ?

ఒక బాధకు చలిస్తే ఆ కన్నీళ్ళకు లింగ భేదం లేదు! నన్నింతగా ఉక్కిరి బిక్కిరి చేస్తున్న ఈ కన్నీటిని తుడవగల శక్తి నీ కొక్క దానికే ఉంది

ఎందుకలా చేతిని వెనక్కి వెనక్కి తీసుకుంటున్నావు?"

ప్రణీత్‌లో ఆ శోకం నిర్విరామంగా అలా ప్రవహించి ప్రవహించి ఎప్పటికో ఆగిపోయింది

బరువుగా లేచి నిలబడి, వాటన్నిటి వద్దా ఆఖరు సారి వీడ్కోలు తీసుకుని, తల వంచుకుని నెమ్మదిగా కదిలాడతను

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

సామానంతా లారీ మీద వెళ్ళి పోయింది ప్రణీత్ వాళ్ళకి ఆ రోజు రాజకుమార్ విందు ఏర్పాటు చేశాడు ఒక రోజు ఆఫీస్ స్టాఫ్ ఓ రోజు హైమ

ఎంత కాదనుకున్నా ఈ ఫార్మాలిటీస్ తప్పలేదతనికి

ప్రణీత్ ఆ ఊరొదిలి వెళ్ళి పోతున్నాడని తెలిసిన దగ్గర్నుంచీ మంజీర మనసులో మంటలు రేగుతున్నాయి

అతన్ని ఆపాలనుంది అతనితో వెళ్ళి పోవాలనుంది అతన్ని నిలదీసి అన్నీ అడిగెయ్యాలనుంది

కానీ ఏ ఒక్కటీ చెయ్య లేక పోతోంది

బాబూరావు శాయశక్తులా ప్రయత్నించి ఎప్పటి కప్పుడు ఆమె మనసులో వెదజల్లుతున్న విషం ఆమెలో సున్నితత్వాన్ని విరిచేసి ఒకరకమైన మొండితనాన్ని కలిగిస్తోంది

అందుకే ఆమె ప్రణీత్‌ను కలుసుకోలేక పోతోంది

అతను తన నొదిలి శాశ్వతంగా వెళ్ళి పోతున్నాడనుకుంటే మాత్రం వెరి దుఃఖ మొస్తోందామెకు

అయినా శర్వాణీ, తాతగార్ల హిత బోధల కన్నా బాబూరావు చెప్తుడు మాటలే ఆమె మనసు మీద ఎక్కువగా తమ ప్రభావాన్ని చూపిస్తున్నాయి

హైమకు చెప్పలేనంత అసహనంగా ఉంది ప్రణీత్ అలా ఒంటరిగా వెళ్ళి పోతుంటే భరించలేక పోతోంది

రాజకుమార్‌కి ఈ విషయంలో తను ఎలా కల్పించుకోవాలో అర్థం కావటం లేదు

మంజీర అంత మొండిగా ప్రవర్తిస్తుంటే ఎవరేం చెయ్య గలరు? ఆ నాడామె ఒప్పుకుని ఉవ్విళ్ళూరింది గనుక, తామంతా ఏకమయి వాళ్ళిద్దర్నీ కలప గలిగారు కానీ ఇప్పుడు ఆమె ఎదురు తిరుగుతోంది

ప్రణీత్ వెళ్ళిపోతుంటే బాబూరావుకి నిశ్చింతగా ఉంది

అతనెళ్ళిపోతే ఒక్క క్షణంలో ఊరి రాజకీయాలు తన కనుకూలంగా మారిపోతాయి. రాజకుమార్‌ని తను తేలికగా జయించగలడు

తన అధికారం పదిలపరుచు కోటానికి తను ఏదైనా చేస్తాడు. ఫైనాన్స్ మినిస్టర్, తనూ ఏకమయితే నెమ్మదిగా ముఖ్యమంత్రికి ఎసరు పెట్టొచ్చు.



# రచయిత్రి జవాబులు

**కె. రాజ్యలక్ష్మి, ఒంగోలు**

ప్ర సావిత్రి గారూ! మీకు కె రామలక్ష్మి గారంటే ఇష్టమేనా?

జ చాలా ఇష్టం!

**యమ్. సారంగపాణి, కాజీపేట**

ప్ర సావిత్రిగారూ! పత్రికల వాళ్ళు తెలిసినవాళ్ళ కథలు మాత్రమే ప్రచురిస్తారని, తెలియని వాళ్ళవి చూడరని నా అభిప్రాయం మీరేమంటారు?

జ మీ అభిప్రాయం సరైనది కాదు మొట్ట మొదట అందరూ తెలియనివాళ్ళేగదా! రచన బావుంటే వాళ్ళకు పాతా కొత్తా అనే భేదాలుండవు

**మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం**

ప్ర ఏదైనా ఒక రచన పాప్యులర్ కావాలంటే ఏమేం ఉండాలండీ?

జ తీసుకున్న 'థీమ్' బావుండాలి రీడబులిటీ ఉండాలి ముఖ్యంగా పాఠకుల అభిమానాన్ని పొందేలా ఉండాలి

**కె. కుమారస్వామి, వరంగల్**

ప్ర ఈ సీరియల్ ద్వారా పాఠకులకు ఏం చెప్పాలనుకుంటున్నారు?

జ పురుషుల దౌర్జన్యానికి నిష్కారణంగా బలైపోతున్న హారిణి లాంటి స్త్రీల ఆర్తనాదాలు నీతి- నిజాయితీలను గొంతునొక్కి చంపెయ్యటానికి బాబూరావు లాంటి రాజకీయ నాయకులు చేసే కుటిల ప్రయత్నాలు తమ వేళ్ళతో తమ కళ్ళే పొడుస్తున్నా తెలుసుకోలేక ఇంకా గుడ్డిగా వాళ్ళనే నమ్మి నాశన మవుతున్న గూడెం ప్రజల అమాయకత్వం.... వీటి గురించి మళ్ళీ మళ్ళీ చెప్పి పాఠకుల్ని జాగ్రత్తులుగా చెయ్యాలనే చిన్న ప్రయత్నమిది.



**నాగండ్ల వెంకటేశ్వర్రావు, అమ్మాపాలెం**

ప్ర : రచయిత్రిగా మీ ఆశయం ఏమిటి?

జ : నేలవిడిచి సాము చెయ్యకుండా సామాజిక స్పృహ గల రచనల్నే చేస్తూ పాఠకుల మనసుల్లో నాకంటూ ఏర్పరుచుకున్న ప్రత్యేక స్థానాన్ని అలాగే పది కాలాలపాటు నిలబెట్టుకోవాలన్నదే నా ఆశయం

**శ్రీమతి తిరుమల, కరీంనగర్**

ప్ర నన్నేం చెయ్య మంటారో చెప్పండి నా మీద నవల రాయండి

జ : మీ సుదీర్ఘమైన ఉత్తరం చదివాను. ఒక నవల రాసేసి నంత మాత్రాన మీ సమస్య తీరిపోదు. ఆడవాళ్ళు తమ కాళ్ళ మీద తాము నిలబడకుండా పేరసైట్‌లా మగవాడి మీద పడి బ్రతుకు తున్నన్నాళ్ళూ ఇవి ఇలాగే కొనసాగుతుంటాయి "ఆడదానికి చదువెందుకూ? ఉద్యోగాలు చెయ్యాలా ఊళ్ళేలాలా?" అనుకునే దశ నుండి ఎదగలేని మూర్ఖులున్నంత వరకూ ఇంతే ముందు మీరు 'టింత్' కుకట్టండి పట్టుదలగా చదివి గ్రాడ్యుయేషన్ పూర్తి చేసుకుని ఉద్యోగంలో చేరండి కొన్ని సమస్యలు పరిష్కారమవుతాయి ఇంత కన్నా రాయటం వీలవదు

**షెహనాజ్ బతుల్, హైదరాబాదు**

ప్ర సినిమాలు చూసి, నవలలు చదివి, ఫలానా పాత్ర బావుంది అనుకుంటారు కానీ నిజ జీవితంలో అలాంటి పరిస్థితు లేర్పడితే ఆ పాత్ర చేసినట్లు చెయ్యరు ఎందుకంటారు?

జ అనుకోటానికి, ఆచరించటానికీ మధ్యగల తేడా ఇదే

**ఎ. ఉషారాణి, గోరంట్ల**

ప్ర నేటి నవలా సాహిత్యం పాఠకులకు హితబోధ చేస్తుందా?

జ పాఠకులు హితబోధలు కావాలనుకుంటున్నారా?

**సాయినిరాజా, నేలకొండపల్లి**

ప్ర రచనలు చేసేది కీర్తి కోసమా లేక ?

జ ఈ ప్రశ్నకు ఇంత క్రితం జవాబిచ్చాను చూడండి

**యు. రత్న, శ్రీకాళహస్తి**

ప్ర : కత్తికి రెండు పక్కలా పదునున్నట్లే మీ కలానికి కూడా రెండు పక్కలా పదునుంది. ఔనా?

జ : ఔనని మీరంత ఖచ్చితంగా చెపుతుంటే..... కాదని ఎందుకంటాను!

## ఒడిలో చేరి మోహన రాగం

ఫైనాన్స్ మినిస్టర్‌కి తనంటే అభిమానముంది. ఆయన చేతిలో కొందరు శాసన సభ్యులున్నారు.

ఆయనతో సంబంధ బాంధవ్యాలు ఇంకా మెరుగు పరుచుకోవాలి...

ఆయన చాలా ఆదర్శ వంతుడని విన్నాడు తను మంజీరా, ప్రణీత్‌ల పెళ్ళి రద్దు చేసి దాన్ని ఆయన కోడలుగా చేస్తే ఇహ తామిద్దర్ని ఎవరూ విడదియ్యలేరు ఇలా సాగుతున్నాయి బాబూరావు ఆలోచనలు

అందరిదగ్గరా వీడ్కోలు తీసుకున్నాడు ప్రణీత్

ప్రణీత్ ఎక్కిన బస్సు ఊరుదాటి చెరువు దాటి పోతుంటే రెల్లు పొదల దుబ్బుల్లో ఉన్న గూళ్ళలో పిల్లలకు చల్లులు పెడుతున్న పక్షి తల్లులు గుడ్లు పొదిగే బాలింతలు ప్రియుని కోసం ఎదురు చూసే ప్రేమికులు ఒక్కసారి పైకి లేచాయి

బరువైన గుండెలతో ఆర్తనాదాలతో అతనికి వీడ్కోలు చెప్పాయి

కిటికీలో నుంచి బయటకు చూస్తున్న ప్రణీత్ పచ్చని ముఖం కన్నీటితో కడసారిగా చూస్తోంది తనకెంతో ప్రియమైన ఆ పరిసరాల్ని

మామిడి చెట్టుకు వేలాడుతున్న గూట్లో నుంచి పైకి వచ్చిన బంగారు పిచుక ముక్కుతో కొండాన్ని పొడుస్తున్న వడ్రంగిపిట్ట జామ పండు తింటున్న పచ్చని చిలుక తల లెత్తి చూస్తూ అరో నువ్వెళ్ళి పోతున్నావా నేస్తం!? ఇహరావూ?!" అని జాలిగా ప్రశ్నిస్తున్నాయి.....

ఆ తోటలో ఉన్న పక్షి రాజ్యం మొత్తం అతన్ని సాగనంపు తున్నట్లు బస్సు వెనుక పడి కొంత దూరం వెళ్ళాయి....

బస్సు ఊరి పొలిమేర దాటి, కంకర రోడ్డు వదిలి తారు రోడ్డు ఎక్కింది.....

అతని మూసిన కనురెప్పల మాటు నుంచి ఒక వేడి కన్నీటి చుక్క జారి పడింది.....

* * * * * * * * * *

ఎస్ ఐ గా ప్రణీత్ మాచర్లలో అడుగు పెట్టాడు

ఇప్పుడతను గతంలో మాదిరి అందరితోనూ కలిసి పోయి, సరదాగా జోక్స్ వెయ్యడు పసిపాపలా తల వెనక్కి వంచి హాయిగా నవ్వడు

నిశ్శబ్దంగా తన డ్యూటీ చేసుకు పోతుంటాడు అనవసర మైన వ్యవహారాల్లో తల దూర్చడు

నవ్వితే అతనెలా ఉంటాడో అక్కడెవరికీ తెలీదు

'కొత్త ఎస్ ఐ మంచివాడే కానీ ఎవరితోనూ కలవడు మరీ రిజర్వుడు టైపు అనుకున్నారంతా

అతనొచ్చాక దొంగతనాలు రౌడీల చెలాయింపులు తగ్గిపోయి నిశ్చింతగా గుండెల మీద చెయ్యేసుకున్నారు స్థానికులు

ఎవరితో నయినా ఒకలాగే ఉంటాడు తెల్ల బట్టలు, ఖద్దరు బట్టలోళ్ళను ఆడంబరంగానూ నేలబారు మనుషుల్ని విసుక్కుంటూను ప్రవర్తించడు.

"సెకండ్ షో వదిలాక ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు కలిసి మగతోడు లేకుండా ఇళ్ళకు వెళ్ళ గలుగుతున్నాం ఈయనొచ్చాక ఇది వరకు ఫస్ట్ షోకి వెళ్ళి రావటానికే భయమేసేది...."

మాచర్లలో తన గురించి వినవచ్చే ఇలాంటి ప్రశంసలేవీ ప్రణీత్‌ని సంతోష

**ఎమ్. చిత్రకుమారి, పెనుగొండ**

ప్ర · మీ ఫొటో పంపాలిమరి మీ పర్సనల్ అడ్రస్ చెప్పరూ?'

జ నేను ఆడపిల్లనే' అంటూ మీరు చేసిన ప్రామిస్ చూస్తే నవ్వొచ్చింది మీ ఉత్తరం సరదాగా ఉంది నా ఫొటోలు పర్సనల్‌గా ఎవరికీ పంపటం లేదు ఇందులో ఆడ- మగా అంటూ తేడా ఏం లేదు పంపాలనుకుంటే ఎవరికైనా పంపిస్తాను' నా అడ్రస్ మీరు రాసింది కరెక్టే పత్రిక వాళ్ళు నాకు రీ డైరెక్టు చేస్తారు

**పోలోజు వెంకటాచారి, హైదరాబాదు**

ప్ర సావిత్రిగారూ' మీరు నా అభిమాన రచయిత్రి 'ఒడిలో చెలి మోహనరాగం" నాకెంతో నచ్చింది

స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళయినా ఆడది జైలు పక్షి గానే ఉంటోంది మార్పు ఎటు నుంచి రావాలి?

జ మీ వేపు నుంచి ఎక్కువగారావాలి మీ అభిమానానికి ధన్యవాదాలు

**కె. మధుమతి, చిక్‌మగుళూరు**

ప్ర · సావిత్రిగారూ' కొంపతీసి మంజీర మారిపోదుగదా? భయమేస్తోంది నాకు'

జ నాకూ అంతే'

**ఎల్. మంజుల, మంగళగిరి**

ప్ర ı సావిత్రిగారూ' మంజీర ప్రణీత్‌తో వెళ్ళిపోయాక, ఇహ ఆమెతో సంబంధాలు పెట్టుకోవద్దని బాబూరావు శాసించాక శార్వాణి హృదయావేదనను అత్యద్భుతంగా చిత్రించారు మీరు మీ సన్నివేశాల రూపకల్పనా శక్తికి నాజోహార్లు సావిత్రి గారూ'

జ థాంక్స్ మంజులగారూ ' ఇంత డీప్‌గా చదువుతున్నందుకు నిజంగా చాలా సంతోషంగా ఉంది

**ఉత్తమ ప్రశ్న**

**ఐ. సురేష్‌కుమార్, హైదరాబాదు**

ప్ర కళకు భాషా భేదం లేదంటారుగదా' రచన కూడా ఒక కళేగదా' అలాంటప్పుడు విదేశీ కళలు మనదేశంలో చోటు చేసుకున్నప్పుడు విదేశీ సాహిత్యం (కాపీ) మాత్రం ఎందుకు దిగుమతి చేసుకోగూడదూ?

జ గ్రీకు శిల్పకళలోని లాలిత్యాన్ని గుర్తించి మీరన్నట్లు దిగుమతి చేసుకున్నాం ఇలాగే మరికొన్ని అయితే వాటి ఒరిజనాలిటీ గురించి మనం చెప్పుకుంటున్నాం అలాగే పరభాషలో మంచిరచనలుంటే వాటిని తెలుగులోకి (మన బాషలోకి) అనువదించు కోవచ్చు కానీ అది అనువాదం కాదు నా స్వంతం అన్నప్పుడే వస్తుంది చిక్కు అప్పుడది కాపీ అనిపించుకుని విమర్శలకు గురవుతూ ఉంటుంది చాలా మంచి ప్రశ్న వేశారు అభినందనలు'

**ఎల్. జ్ఞానాంబ, నరసాపురం**

ప్ర హరిణి చనిపోయిందంటే నమ్మశక్యం కావటం లేదు సావిత్రిగారూ' ఎందుకలా చేశారు ఏడుపొచ్చింది నాకు

జ కొన్ని కొన్ని నిజాలు అలాగే నమ్మశక్యం కానట్లుంటాయి మనకు ఏడు పొస్తుందనే జాలితో అలాంటి సంఘటనలు ఆగిపోవు

**కె. మధుసూదనరావు, విజయవాడ**

ప్ర మీ పడమట సంధ్యారాగం తరవాత, పత్రికలో ఇన్నాళ్ళకి మళ్ళీ ఓ మంచి సీరియల్ చదువుతున్నాం "ఆడవాళ్ళు వంటింటి రచనలు అవాస్తవిక మైన రచనలు మాత్రమే చెయ్యగలరు ' అనుకునే నా లాంటి వాళ్ళ అభిప్రాయాల్ని కొట్టిపారేస్తూ ఒడిలో చెలిమోహనరాగం' లాంటి రాజకీయ సెటైర్ రాస్తున్నారు మీరు అందులో ప్రతి సంఘటనా వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది మీకు నా అభినందనలు

జ థాంక్సండీ'

**బందిగి బాలరాజు, నారాయణపేట**

ప్ర అక్కయ్యా ' మా అబిమాన నటుడు శ్రీ ఎన్ టి రామారావుపై మీ అభిప్రాయమేమిటి?

జ చా లా గొప్ప నటుడు

**పి. ప్రభావతి, విశాఖపట్నం**

ప్ర సావిత్రిగారూ? సామాజిక స్పృహ గల రచనలే జీవితాలకు దగ్గరగా ఉంటాయని వర్ణనలతో కూడి వాస్తవానికి దూరంగా ఉండే రచనల కంత ప్రాముఖ్యం లేదని అంటారు ఇది ఎంత వరకూ నిజం?

జ ఎంత వరకూ కాదు పూర్తి నిజం' మీ ప్రశ్నలో నే జవాబు కూడా ఇమిడి ఉంది

**పి భాస్కర్, మండమఱ్ఱి**

ప్ర మీరు ఎంత సమయాన్ని కథకు ఉపయోగిస్తారు?

జ ఆ సమయానికి ఒక కొలతంటూ లేదు ఎంత వరకు 'మూడ్' నిలబడితే అంత వరకూ రాస్తాను

**గొడవర్తి హరిప్రసాదరాజు, బోధన్**

ప్ర రచయిత (త్రు)లు కాలక్షేపం రచనలు చెయ్యకుండా సామాజిక స్పృహ గల రచనలే చేస్తే ప్రయోజనముంటుంది గదా?

జ ఔను గదా' □

పెట్టేవి కావు వినీ విననట్లు ముభావంగా ఉండేవాడు

"ఒక్కసారి కూడా నవ్వడేం? పెళ్ళయిందా? ఇంకా కాలేదా ' ఇలాంటి విషయాలు అతని దగ్గర ఎత్తే చనువు ఎవరికీ ఇవ్వలేదతను

అర్ధరాత్రి తన గదిలో పక్క మీద ఒంటరిగా పడుకున్నప్పుడు పగలంతా బండబారి ఉన్న అతని గుండె కరిగి కరిగి నీరై ప్రవహిస్తుంది.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రాష్ట్రంలో రాజకీయాలు ఒక్క సారిగా మారిపోయాయి

అతని కెంతో సన్నిహితుడుగా ఉండే ఫైనాన్స్ మినిస్టరే బాబూరావును వెన్నుపోటు పొడిచాడు

"నువ్వు ముందు నడు మేమంతా నీ వెనకే ఉంటాం ' అని బాబూరావును నమ్మించి, అతను ముఖ్యమంత్రి కెదురు తిరిగి బయట కొచ్చేలా చేశాడు ఫైనాన్స్ మినిస్టర్ ఈసారి ముఖ్యమంత్రివి నువ్వే' అని ఆశపెట్టాడు

ఇదంతా నమ్మి బాబూరావు బయట పడగానే హఠాత్తుగా ఫైనాన్స్ మినిస్టర్ తన సహచరులతో ముఖ్యమంత్రి వేపే ఉండి ఆయన ఆదేశాల ప్రకారం బుద్ధిమంతుడిలా వెళ్ళి కర్నాటకలో దాక్కున్నాడు

ఆపద్ధర్మ ప్రభుత్వపు ముఖ్యమంత్రి అయిన బాబూరావు ఆ థ్రిల్ ఇంకా తీరకుండానే బలవంతాన దించెయ్య బడ్డాడు

ముఖ్యమంత్రి రాఘవరావు తిరిగి ఎలక్షన్స్ ద్వారా తన బలం నిరూపించుకోవాల్సి వచ్చింది.

ఈసారి ఎన్నికల్లో రాజకుమార్ చేతుల్లో చిత్తుగా ఓడి పోయిన బాబూరావు డిపాజిట్ కూడా కోల్పోయాడు ,

బాబూరావు మనసు చెదిరి పోయింది కౌన్సిలర్ పదవి ఊడినప్పుడు కూడా ఆయనింత బాద పడలేదు

రాజకీయాలు ఎంత విశ్వాస రహితమైనవో అనిశ్చిత మైనవో ఇప్పుడు బాగా అర్ధమయిందాయనకు

రాజకీయాల్లో పెద్ద పాము చిన్న పాముల్ని నిర్దాక్షిణ్యంగా మింగటం ద్వారానే పైకి ఎగబాకు తుందనే సత్యం ఆయనకు ఒంట బట్టిందిప్పుడు

ఊళ్ళో ఆయనకు గతంలో ఉన్నంత పలుకు బడిలేదు అసమ్మతి వర్గం ముసుగు తొలగించుకుని మొహం పైకెత్తి ఆయన వేపు దీర్ఘంగా చూసింది

ఆఖరుకు పాపారావు కూడా రాజకుమార్ వేపుకు తిరిగి పోవటంతో ఒకరకమైన విరక్తి పిరికితనం ఆవరించాయాయన్ని

ఆయనలో పగ ప్రతీకారం నీచత్వం అన్నీ ఈ సంఘటనతో కొట్టుకు పోయాయి

కూతుర్ని చూస్తుంటే బాబూరావు గుండె జాలితో ద్రవించింది

ఆమెలో మునుపటి చలాకీతనంలేదు అల్లరిలేదు

వయసుడిగి పోయిన దానిలా ఎక్కడో పడుంటూ నిశ్శబ్దంగా, దీనంగా ఉన్న కూతుర్ని చూస్తూ పశ్చాత్తాపంతో దహించుకుపోయాడాయన

ఒకరోజు మంజీరను పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుని జరిగిన సంగతులన్నీ చెప్పసాగాడు

ఒక్కొక్క విషయం ఆయన వివరించి చెపుతుంటే ఊపిరి పీల్చుకోటం కూడా మర్చిపోయి విన్నది మంజీర

ఆమె గుండెల్లో ఘనీభవించి ఉన్న వ్యధ కన్నీరుగా మారి ప్రవహించింది




ఎస్. వి. – నెల్లూరు

నేను రాయవేలూరు నందు ఓపెన్ హార్టు సర్జరీ చేయించుకున్నాను ఆపరేషన్ అయిన 3 నెలల తర్వాత రోజుకి ఆరు సిగరెట్లు త్రాగుతున్నాను దీనివల్ల ఆరోగ్యానికి హానికరమా? అవాంతరాలు ఏమైనా వస్తాయా?

★ సిగరెట్ మామూలు వారికి గూడా హానికరమే కదా! అటువంటప్పుడు హార్టు ఆపరేషన్ అయిన వారికి ఇంకా ఎక్కువ హానికరం అవుతుంది. రక్తనాళాలు ముకుళించుకొని పోవటం. శ్వాస మండలంలో వాపులు, కఫం, కేన్సర్ మొదలైన రోగాలు వచ్చే అవకాశం ఉంటుంది.

ఎమ్. ఎస్. – వెంకటాపురం

ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకున్నాక ఎన్ని నెలలకు దాంపత్య జీవితము గడప వచ్చును? ఆపరేషన్ చేయించుకున్న వారు తీసుకోవలసిన జాగ్రత్తలు, తీసుకో వలసిన ఆహారము తెలుప ప్రార్థన. బరువులు ఎన్ని రోజుల వరకూ ఎత్తకూడదు?

★ ఆపరేషన్ చేయించుకున్న 45 రోజుల తర్వాత దాంపత్య జీవితం మామూలుగా గడప వచ్చును. ఇంకా ముందుగానే దాంపత్య జీవితం గడపవచ్చని కొందరి అంచనా.

ప్రస్తుతం చేయబడుతున్న లేపరోస్కోపిక్ స్టెరిలైజేషన్ తర్వాత కొన్ని గంటల వ్యవధిలో మామూలు కార్యక్రమాలు కొనసాగించ వచ్చును. మామూలుగా బరువులు ఒక నెల దాకా ఎత్తడం మంచిది కాదు. తీసుకోవలసిన ఆహారంలో ఏ మార్పులూ అవసరం లేదు.

కె. వి. ఎస్. – మంగళగిరి

మా అబ్బాయి వయస్సు 6 సంవత్సరములు. ఈ మధ్య ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లలో వున్నాము. వేసవిలో ముక్కులో నుండి రక్తం కారటం ప్రారంభమయింది తడిగుడ్డ ముక్కు మీద, ఐసు నుదుటి మీద పెట్టాము కొంచము సేపటికి రక్తం కారటం తగ్గినది. మరల ఒక గంట తర్వాత ప్రారంభమయినది. ఇలా జరుగుతుంటే భయపడి అక్కడి నుండి ఆంధ్రప్రదేశ్‌కి తీసుకొని వచ్చాము. ఇప్పుడు పూర్తిగా తగ్గినది. దీనికి కారణం ఏమిటి? మరలా ఇలా వస్తే ఏమి చెయ్యాలి?

★ స్థల మార్పిడి వల్ల ముక్కులో నుండి రక్తం కారటం తగ్గి ఉండదు. ఇ. ఎన్. టి వైద్యుల చేత ముక్కులోపలి భాగం పరీక్ష చేయించి, రక్త నాళాలు గుబురుగా ఉన్నట్లయితే కాటరైజ్ చేయించండి. ముక్కు భాగంలో ఏ రోగమూ లేనప్పుడు రక్త పరీక్ష (బ్లీడింగ్ టైమ్, క్లాటింగ్ టైమ్) చేయాలి. కొందరికి ఏకారణమూ లేకుండానే ఇలా రక్తం కారే అవకాశం వుంటుంది. ఇటువంటి వారికి ఏ చికిత్సా లేకుండానే తగ్గిపోతుంది. రక్తం అధికంగా కారే సమయంలో ఐస్‌తో పాటు ముక్కులోపల అడ్రినలిన్‌తో తడిపిన దూదిని ఉంచటం మంచిది. □

## ఒడిలో చెలి మోహన రాగం

ప్రణీత్! తన ప్రణీత్ వంచకుడు కాదు! అతనికి తనంటే ఎంత ప్రేమ!అనురాగం! వీటిలో మలినం లేదు!

తనలాంటి అదృష్టం ఎంత మంది ఆడపిల్లల కుంటుంది? ప్రణీత్ తన కోసం ఎన్ని యుగాలైనా అలాగే ఎదురు చూస్తుంటాడు. తన రాకకు ఆహ్వానం పలుకుతాడు...

తను తప్ప.. ఏ ఆడపిల్లా అతని మనసు నాక్రమించలేదు. అలా ఆక్రమించగలిగితే అతను ప్రణీతే కాదు!

మంజీర మనసు పురివిప్పిన నెమలిలా నాట్యం చేసింది

'నేను మా చర్ల వెడతాను అన్నది మంజీర

నేనూ వస్తానమ్మా!' అన్నాడు బాబూరావు

ఇప్పుడు మీరెవరూ ఒద్దు నేనూ, హైమా వెడతాం '

'నీ ఇష్టం తల్లీ

'అదేమిటీ? ఇంత హఠాత్తుగా ఎలా? చీరేసారే ఏం లేకుండా " అన్నది శార్వాణి

నేనూ, ప్రణీత్ కలిసి మళ్ళీ వస్తాం అప్పుడు నీ ఇష్టమొచ్చినంత సారె పెట్టి పంపిద్దు గాని " అంటూ గలగలా నవ్వింది మంజీర

చాలా రోజుల తరవాత సంతోషంగా ఇల్లంతా కలియతిరిగింది తమ్ముడి మొహాన్ని ముద్దులతో నింపింది కూతురి ఆనందాన్ని విప్పారిన కళ్ళతో ఆప్యాయంగా చూశాడు బాబూరావు

మంజీర మొహం వెన్నెల్లో మంచి ముత్యమంత స్నిగ్ధంగా ఉంది

హైమ, మంజీర మాచర్ల బయల్దేరారు.

★ ★ ★ ★

ఇంటి కొచ్చిన ప్రణీత్ హాల్లో ఉన్న హైమను చూసి–

బాగున్నావామ్మా? రాజారావేడీ? అన్నాడు ఆప్యాయంగా

'తను రాలేదు నువ్వేమిటన్నయ్యా, అలా చిక్కి నల్లబడి పోయావు." అన్నది హైమ

ఆమె మాటల కతను విరక్తిగా నవ్వి మాట మార్చాడు . హైమ అతనికేం చెప్పలెదు

తన గదిలో అడుగు పెట్టిన ప్రణీత్ మంచం మీద ఎవరో పడుకుని ఉండటంతో సంకోచంగా ఆగిపోయాడు

అది పందిరి మంచం తల వేపు చెక్క ఉండటంతో ఆ మనిషి ఎవరో తెలీటల్లేదు

వెనుతిరగబోయిన ప్రణీత్ కళ్ళు చురుగ్గా మారాయి. కొద్దిగా పక్కకు జారిన ఆ యువతి పాదాల దగ్గర అతని చూపులు మంత్రించినట్లుగా నిలిచిపోయాయి ఆ తెల్లని పాదాలకున్న మువ్వల పట్టాలు తనకు గుర్తే!

అవి మంజీరవి!

ఒక్క ఉదుటున మంచం దగ్గర కెళ్ళాడు ప్రణీత్ నాగస్వరం వింటున్న నాగినిలా అతని అడుగుల శబ్దం వింటోందామె

మంజూ " అంటూ చెయ్యి చాపాడతను

అతని మెడ చుట్టూ చేతులు వేసి లేచి కూర్చుని, అతని ఒడిలో మొహం దాచుకుందామె అతని చేతులు ఆర్తిగా ఆమెను స్పృశిస్తున్నాయి

క్షమాపణ కోరబోతున్న ఆమె పెదవుల్ని అతని పెదవులు కప్పేశాయి

క్షమాపణ లొద్దు' మనం కలుసుకున్నాం' నా ఒడిలో నువ్వు'

నా ఒంటి నిండా నీ నవ్వులు వెదజల్లే పూలు' ఇవి చాలు నాకు ' అన్నాడు తను

అతని ఒడిలో పడుకుని ఏమేమో చెపుతోందామె ఆమె మాటలతనికి మోహనరాగం వినిపిస్తున్నట్లు హాయిగా ఉన్నాయి

అతని కళ్ళూ పెదవులు చిరునవ్వుతో నిండి ఉన్నాయి

మనిద్దరం కలిసి మాపూరెడదాం చీరే సారే పెట్టించుకు రావాలి నేను ఆ మాటల కతని చిరునవ్వు మరింత పెద్దదై ఆ గదంతా వ్యాపించింది

(అయిపోయింది)

ఆంధ్రపత్రిక ప్రచురణ

# బాలరంజని

చిన్నపిల్లల మాసపత్రిక

(పెద్దవారు కూడా చదవవచ్చు!)





"ముద్దాయి"లో కృష్ణ, అరుణ, రాధ



"కేడి"లో అంబిక, కమలహాసన్, రాధ

# సినిమా

## ఎ ఎన్ ఆర్ నాగార్జున నటించే 'కలెక్టర్ గారి అబ్బాయి" ఉగాదికి

తండ్రి ప్రతిదీ న్యాయంగా ధర్మంగా చేయాలనుకునే కలెక్టరు ఆవేశపరుడు కొడుకు వీరిద్దరి మధ్య నలిగిపోయే పాత్ర తల్లి కొడుకు స్నేహితుడ్ని ఓ రాజకీయ వేత్త హతమారుస్తాడు దాంతో కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది జనవరి 13 నుండి 22 వరకు కొడైక్కెనాల్ కేరళలోని మూనార్‌లో ఔట్‌డోర్ షూటింగ్ జరిపాం హైద్రాబాద్‌లో ఫిబ్రవరి 8 న షూటింగ్ పూర్తవుతుంది ఉగాది రిలీజ్ అన్నారు బి గోపాల్ దర్శకత్వంలో పై చిత్రాన్ని నిర్మించిన ఎస్ ఎస్ మూవీ క్రియేషన్స్ అధినేత యార్లగడ్డ సురేంద్ర తల్లి దండ్రులుగా ఎ ఎన్ ఆర్ శారద కొడుకుగ నాగార్జున ఇతర పాత్రలలో రజని నూతన్ ప్రసాద్ కోట శ్రీనివాసరావు సుదాకర్ శుభలేఖ సుధాకర్ పి ఎల్ నారాయణ వేలు నర్రా సూర్య రమాప్రభ శ్రీలక్ష్మి వరలక్ష్మి పాల్గొన్నారు కొమ్మనాపల్లి గణపతిరావు ఎ పుష్పానంద్ ఎస్ రామ్మోహనరావు కథను సమకూర్చారు స్క్రీన్‌ప్లేను

(22 వ పేజి తరువాయి)




ఈ సినిమాలో వర్షం ఎన్నో వున్నాయంట!
వర్షం చూసి చాలా కాలమయింది, పోదామా?

అంజనేయపుష్పానంద్ తయారు చేశారు గణేష్ పాత్రో మాటలు వేటూరి పాటలు చక్రవర్తి సంగీతం ఎస్ గోపాల్ రెడ్డి ఛాయ భాస్కరరాజు శిల్పం విజయ్ సాహసాలు కె ఎస్ రఘు నృత్యాలు మార్తాండ్ కూర్పుతో అక్కినేని వెంకటరత్నం ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

## ఎం ఎస్. కోటారెడ్డి దర్శకత్వంలో రాజేంద్ర ప్రసాద్ ద్విపాత్రాభినయం

హాస్య ప్రధాన చిత్రం హీరోగా రౌడీగా రాజేంద్రప్రసాద్ రెండు వ్యత్యాసాలున్న పాత్రలు ధరిస్తారు ఉగాది రోజున హైదరాబాద్‌లో షూటింగ్ మొదలెడుతున్నాం చివరి షెడ్యూల్ మేలో అన్నారు ఎం ఎస్ కోటారెడ్డి ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో జ్యోతి ఎం ఎ ఎ సత్యనారాయణ నిర్మించే వెంకటేశ్వరా క్రియేషన్స్ తొలి చిత్రానికి తనికెళ్ళ భరణి మాటలు సత్యం స్వరకల్పనలో గోపి గీతాలు రాశారు కృష్ణమూర్తి శిల్పం శాంతిబాబు ప్రొడక్షన్ రమేష్ రెడ్డి కూర్పుతో బి స్వప్న సహ నిర్మాత.

"కథ అడ్డం తిరిగింది"లో చంద్రమోహన్, ప్రభ



"రాసలీల"లో సుమలత, రఘు





"మరణ శాసనం"లో శోభన, కృష్ణంరాజు



"గౌతమి"లో షావుకారు జానకి, ప్రి విజయ

## తమిళ చిత్ర విశేషాలు

★ నటి పల్లవి బి ఎస్ సి పట్ట ధారిణి బొంబాయిలో ఈమె తండ్రి రాశి వైన్స్ రాశి హోటల్స్ అధినేత పల్లవి అసలుపేరు రాశి

★ జయలలితకు మన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీతో చుట్టరికం ఉందా? ఉందంటున్నారు కొందరు జయ-లలిత తల్లి సంధ్య మేనమామ మాజీ రిజర్వ్ బాంక్ గవర్నర్ శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ ఈయన పుత్రుడు విదేశీ వ్యవహారా లలో నిపుణుడైన శ్రీ పార్థ సారథి ఈయన ఫెరోజ్‌గాంధి చెల్లెలు – అంటే మన ప్రధాని మేనత్తను ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు

★ దీపావళి నాడు తమిళనాడులో 11 తమిళ చిత్రాలు విడుదలయ్యాయి ఇందులో నాలుగు చిత్రాలలో బ్లడ్ కాన్సర్ తో ఏదో ఒక పాత్ర చనిపోతుంది' ఆ చిత్రాలు – లక్ష్మి వందాచ్చు పుదియ పూవిదు తుమవాద కైగళ్ కణ్ణుక్కు మై ఎళుదు

★ సంసారం ఒక చదరంగం చిత్ర కథకుడు విసు రూపొందించే ప్రతి చిత్రంలోనూ నాయిక పేరు ఉమ గా ఉంటుంది ఈయన తొలి నాటకాన్ని చూసిన వెంటనే మొట్ట మొదట అభినందించింది ఉమ అనే యువతి అట'

★ జయచిత్ర తన భర్త గణేశ్ హీరోగా స్వీయ దర్శకత్వంలో ఒక చిత్రాన్ని నిర్మించాలనుకుంటూంది

★ శ్రీదేవి సొంతంగా ఒక ప్రివ్యూ థియేటరును మద్రాసులో నిర్మిస్తోంది దానికి తన పేరును పెట్టుకోలేదు ఎంచేతంటే మద్రాసు లోనే దేవి-శ్రీదేవి పేరుతో ఒక ప్రివ్యూ థియేటర్ ఉంది గనుక

★ ఇటీవల చిత్ర రంగంలో ప్రవేశించిన మధుర గాయని చిత్ర ఫిబ్రవరిలో విజయశంకర్ అనే ఇంజనీర్‌ను వివాహమాడబోతోంది

★ కమలహాసన్ సారికను వివాహ మాడాక పుత్రికేయుడే కాక పాత్రి కేయుడు కూడా కాబోతున్నాడు మైయం అనే జనవరి 28న వెలువడే ఒక తమిళ పత్రికకు సంపాదకత్వం వహించబోతున్నాడు

★ ము కరుణానిధి నిర్మించే ఒక చిత్రాన్ని కె బాలచందర్ డైరెక్ట్ చేయనున్నారు

★ ఎనిమిదేళ్ళ తర్వాత నటి సుజాత త్వరలో మళ్ళీ తల్లి కాబోతోంది ఈమె మొదటి సంతానం అబ్బాయి ఈ మారు అమ్మాయి పుట్టాలని ఆమె కోరిక



'తాయారమ్మ – తాండవ కృష్ణ లో రజని, బేబీ సీత



శ్రుతిలయలు లో నరేష్, నేపథ్యగాయని ఎస్ జానకి పుత్రుడు మురళీకృష్ణ, సుమలత



శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, యష్ చోప్రా సంయుక్తంగా నిర్మిస్తున్న భారీ హిందీ చిత్రం విజయ్ ప్రారంభోత్సవం నాడు శ్రీ టి సుబ్బరామిరెడ్డి, హేమమాలిని యష్ చోప్రా మీనాక్షి శేషాద్రి

# సినిమా

## "ప్రతిస్పందన"

గుడ్ మార్నింగ్ కాళిదాసు గురుగారూ! ఈ రోజు కూడా ఏదైనా కథ చెప్పండి ఆఁ అజ్ఞాన వ్యాకుంతలం చెప్పండి గురుగారూ! అన్నాడు అప్పిగాడు (రాంబాబు) వచ్చి కూర్చుంటూ

కాళిదాసు (రాజేంద్రప్రసాద్ ) నవ్వాడు! తెలిసన్నా తెలీకన్నా గొప్ప నిజం చెప్పావురా అప్పిగా అభిజ్ఞాన శాకుంతలం కాదు అజ్ఞాన వ్యాకుంతలమే చెబుతా విను కల్లు మానండోయ్ కళ్ళు తెరవండోయ్ అన్నారు ఆనాటి పెద్దలు సారా తాగండోయ్ బ్రాందీ కొట్టండోయ్!మీ బతుకులు ఏమైనా మా ఖజానాలు నింపండోయ్ అంటున్నాయి నేటి ప్రభుత్వాలు వీధికొక మందుల షాపు లేకపోయినా– వీధి వీధికీ మందుకొట్టుకు లైసెన్స్‌లు మంజూరు వీళ్ళు పాలకులా– యమలోక ద్వారపాలకులా? ఇంకా విను లాకప్ అంటే ఏమిటో తెలుసా? లాకప్– అంటే లా ఈస్ ఇన్ ది కప్ కప్పులో న్యాయం – అని న్యాయం పోలీసులు తాగే టీ కప్‌తో కల్సి పోయింది టీ కప్పులో ఈగపడినా – లాకప్ లో మనిషి పడినా తన్నుకు చచ్చే రోజులు వచ్చేశాయి తస్మాత్ జాగ్రత్త!

అప్పిగాడు చెవులు రిక్కించి. గుర్రుపెట్టించి



ధర్మపత్ని లో భానుప్రియ



ప్రతిస్పందన లో డిస్కో శాంతి, గొల్లపూడి, కోట శ్రీనివాసరావు

పెంటూరింది పోయాడు

జి. పార్థసారథి నిర్మిస్తున్న చంద్రోదయా మూవీ క్రియేషన్స్ ప్రతి స్పందన చిత్రానికి అనిల్ కుమార్ దర్శకుడు □

**●●ఇదుగో వచ్చింది! కొత్త వీల్ ఆకుపచ్చ బిళ్ల–శక్తిగల డిటర్జంట్●●**

Wheel




# వీల్

ఇక మీదట, ఎవరిక్కావాలి సబ్బు? కొత్త వీల్ డిటర్జంట్ వచ్చిందిగా, వీల్! ఎక్కువ బట్టల్ని ఉతుకుతుంది. సబ్బు కన్నా ఎక్కువ శక్తివంతంగా ఉతుకుతుంది. అయినా, వీల్ ధర సబ్బు కంటె తక్కువ!

**శుభ్రపరిచే శక్తి ఎక్కువ...**
**కాని ధర ఎక్కువ కాదు.**

LINTAS WL 16 2317 TL

కేవలం రూ. 1·75

స్థానిక పన్నులు అదనం.

ఎన్నిక చేసిన కొన్ని పట్టణాల్లోనే దొరుకుతుంది. హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

ఎవరో లేపినట్టుగా ఒక్కసారిగా మెలుకువ వచ్చింది టైమ్ చూస్తే అయిదు గంటలు. మెల్లగా మెదడులోకి ఆలోచనలు మనసంతా వికలం. అది ఏదో కష్టం వచ్చిన బాధ కాదు రేపెలాగో అన్న భయమూ కాదు మనిషిని చైతన్య రహితుడ్ని చేసే ఆలోచనల ముసురు 'అసలెందుకిలా జరిగింది' ఆలోచనల మధ్యలో ఈ ప్రశ్న

'ఏమిటీ మెలుకువ వచ్చి కూడా లేవలేదు?'

. . . . .

'మిమ్మల్నేనండీ ఈ రోజు డ్యూటీకి వెళ్ళరా?'

. .

'ఇంకా అదే విషయం ఆలోచిస్తూ మనసెందుకు పాడు చేసుకుంటారు చెప్పండి అయిందేదో అయిపోయింది అసలు మీరు సత్యకాలపు మనుషులు అంతా మీలాగే ఉంటారనుకుంటారు'

.

'లేచి ముఖం కడుక్కోండి కాఫీ పెట్టాను'

మనసుతో సంబంధించిన విషయం కాదు కాబట్టి కాలకృత్యాలన్నీ యాంత్రికంగా జరిగి పోతున్నాయి

'డాడీ గోపాల్ అంకుల్ సుధీర్ అంకుల్ వచ్చారు'.

'రమ్మను మీ అమ్మని మూడు కాఫీలు తెమ్మను'

'ఏమిటి గురూ ఏమిటీ విచిత్రం. మూడు రోజుల్నుంచీ డ్యూటీకి రావడం లేదు. ప్రతి ఏడూ క్యాజువల్ లీవ్ కూడా సగానికి పైగా వాడుకోకుండా వదిలేసే వాడివి మూడు రోజులు వరసగా సెలవు పెట్టడమా

'ఏం లేదురా గోపాల్ ఒంట్లో కొంచెం నలతగా ఉంది అంతే'

'మాకు తెలుసులే చెప్పకు బాగాలేనిది నీ ఒంట్లోకాదు'

'రెండ్రోజుల్నుంచీ డివిజన్లో మనవాళ్ళందరి మధ్యా ఇదే డిస్కషన్ ఎట్లా అయినా సరే ఆ సుందర్రావు గాడి పని పట్టాలని నిర్ణయించు కున్నాం నిన్న వాడి స్కూటర్ పంక్చర్ చేసాం. ఈ రోజు వాడికి ముర్దాబాద్‌లు కొట్టాలనుకుంటున్నాం వాడు చెప్పిన పని డివిజన్లో ఏ వర్కరూ చేయడం లేదు'.

'తప్పు సుధీర్ అది సరయిన పద్ధతికాదు'

'చాల్లే ఊరుకో అసలు నిన్ననాలి అంత కష్టపడి తయారు చేసిన ప్రొడక్షన్ స్కీము తీసుకెళ్ళి వాడి చేతుల్లో పెడ్తావా?'

'ఏదో పై ఆఫీసరు కదా ఇంజనీరింగ్ చదివాడు ఏదైనా తప్పుల్ని సరిదిద్దుతాడు– ఇంకా స్కీమ్‌ని ఇంప్రూవ్ చేస్తాడేమో అని ఇచ్చాను'

'దాన్ని కాస్తా వాడు తన పేరు పెట్టుకుని మేనేజ్‌మెంట్‌కి ఇచ్చాడు వెంటనే ప్రమోషన్, పదివేల రూపాయిల అవార్డు మెరిట్ సర్టిఫికెట్ కొట్టేశాడు నువ్వేమో వెర్రి వెంగళప్పలా బాధ పడ్తూ సెలవెట్టుకుని ఇంట్లో కూర్చున్నావు'.

'అతనిలా ద్రోహం చేస్తాడని నేను ఊహించ లేదురా'

'నువ్వు ఊహించవు గానీ మేం మాత్రం ఊరుకోదలుచుకోలేదు. ఈ విషయాన్ని మన యూనియన్ దాకా తీసుకెళ్ళదలుచుకున్నాం'

'వద్దు సుధీర్ అనవసరంగా ఈ విషయాన్ని అంతదాకా తీసుకు వెళ్ళొద్దు'

'ఎందుకు తీసుకెళ్ళ కూడదు. ఇదేమయినా చిన్న విషయమా? శ్రామికుల మేధస్సు మీదా నిజాయితీ మీదా గొడ్డలి దెబ్బ'.

'ఆ స్కీమ్ నేనే తయారు చేసానని ఏమిటి ఋజువు'

'పిచ్చిగా మాట్లాడకు ఫైనల్ షేప్‌కి రాబోయే ముందు కొంత రఫ్ వర్క్ చేసుంటావుకదా ఆ కాగితాలన్నీ ఇలా ఇవ్వు వాడి భరతం పడ్తాం'

'నేనివ్వను నాకా పద్ధతి ఇష్టం లేదు'.

'వీదిలాగే అంటాడు గానీ అవన్నీ కలెక్ట్ చేసి నువ్వియ్యమ్మా యూనియన్‌లో పెడ్తాం'

'ఆయనకిష్టం లేకుండా నేనెలా ఇవ్వగలను అన్నయ్యగారూ ఈ విషయం ఇక వదిలెయ్యడం మంచిది'

'సరే. నువ్వూ వాడికి తగ్గదానివే దొరికావు ఇంతకీ తమరు డ్యూటీకి ఎప్పుడొస్తున్నారు మహాను భావా'

'వస్తానులే మెల్లగా వీలు చూసుకుని'

'పోనీ ఎక్కడికయినా రెండు మూడు రోజులు వెళ్ళిరండమ్మా స్థలం మార్పిడికి - ఏ నాగార్జున సాగర్‌కో అనంతగిరి హిల్స్‌కో

'పిల్లలతో ప్రయాణం అంటె అంత తేలికా అన్నయ్యగారూ ఎన్ని విషయాలు చూసుకోవాలి అసలు ఆయనకి రిలీఫ్ కావాలంటే బయటికే వెళ్ళనక్కర్లేదు మా పిన్ని కొడుకొకడు సినిమాల్లో అసిస్టెంటు డైరెక్టరుగా పని చేస్తున్నాడు. మొన్ననే వచ్చి వెళ్ళాడు ఈ ఊళ్ళోనే ఓ వారం రోజులు షూటింగ్ ఉందట. పిల్లల్ని తీసుకుని చూడటానికి రమ్మని మరీ మరీ చెప్పెళ్ళాడు పిల్లలేమో బాగా మనసు పడుతున్నారు నిన్నట్నుంచీ ఈయన్ని ప్రాధేయ పడుతున్నాను ఒప్పుకుంటేగా .'

'వాడెందుకు ఒప్పుకుంటాడమ్మా వాడికి మిషన్లూ, టూల్సూ, నట్సూ తప్ప ఇంకేం పట్టవుగదా ఒరేయ్ ఫూల్. వెళ్ళిరాదురా సరదాగా నీకూ కొంచెం మనసు తేలిక పడుతుంది'

'తమరు రికమెండ్ చేసారుగా ఇక వెళ్తానులే'

'ఇదీ వెటకారం దీనికి మాత్రం తక్కువలేదు. సరే మేం వెళ్తాం సెకండ్ షిఫ్టుకి డ్యూటీ కెళ్ళాలి నువ్వు మాత్రం మనసు పాడు చేసుకోకు సాధ్యమైనంత త్వరలో డ్యూటీకిరా'

'నేను కూడా ఇంక బయలుదేరుతా గురూ. ఒకవేళ నువ్వు మనసు మార్చుకుంటే 'ఊ' అను విషయాన్ని యూనియన్‌లో పెట్టి సుందర్రావుగాడి టాపు లేపేద్దాం'

స్నేహితుల నిష్క్రమణతో మళ్ళీ ఆలోచనలు ప్రవేశం

ఆ ప్రొడక్షన్ స్కీమ్ వలన ఫాక్టరీకి ఏటా పది కోట్ల రూపాయిల లాభం పోనీలే పేరు ఎవరికొస్తేయేం లాభించేది ఫాక్టరీయేకదా. కానీ అలా సరిపెట్టుకోబుద్ధి కావడం లేదు ఉండుండీ మనసులో కలుక్కు మంటోంది. ఎంతైనా మానవ హృదయం కదా

ఇక ప్రయోజనం లేదు ఎలాగైనా మనసుని బలవంతంగా నైనా ఇంకో వైపుకి తిప్పాలి పోనీ ఆ షూటింగ్‌కి వెళ్తే కొంత వరకూ అది సాధ్యమేమో భార్యా పిల్లలయినా ఆనందిస్తారు

'ఇదిగో సుశీ. పిల్లల్ని తయారు చేసి నువ్వు తయారవు నువ్వు గొడవ పెడుతున్న ఆ సినిమా షూటింగ్‌కి వెళ్దాం'

'అమ్మయ్య ఇప్పటికి ఒప్పుకున్నారా ఒరేయ్ రవీ స్నానం త్వరగా పూర్తిచెయ్యి మీ డాడీ షూటింగ్‌కి తీసుకెళ్తార్ట'

పిచ్చి కాకపోతే మనసులో ఇంత బరువు పెట్టుకుని ఇష్టం లేని ఈ షూటింగ్‌కి కదలడం సాధ్యమా అయినా కమిట్ అయిన తర్వాత తప్పదు పిల్లలు నిరుత్సాహ పడ్తారు

'రండి బావగారూ రండి మీరసలు నిన్ననే వస్తారను కున్నాను నిన్న ఓ డ్యూయెట్ సాంగ్‌లో చివరి బిట్ షూట్ చేసాం'

'ఈరోజేమిటి?'

'ఫైటింగ్ సీన్'

'హాయ్ ఫైటింగా హీరో ఎవరు మామయ్యా?'

'విష్ణు'

'హాయ్ విష్ణు నా ఫేవరేట్ హీరో'.

'నీ ఫేవరేట్ హీరో అయితే షూటింగ్ అయిన తర్వాత మాట్లాడుదువుగానిలే . ఆఁ! మీరిక్కడ కూర్చోండి బావగారూ నే వెళ్ళి టిఫిన్, డ్రింక్స్ పంపిస్తాను'

'ఎందుకయ్యా ఇంట్లో చేసే వచ్చాం'

'చేస్తే చేసారు. చాలా సేపయుంటుంది కదా నే వస్తా అక్కా మళ్ళీ లంచ్ బ్రేక్‌లో కలుద్దాం అంతా కలసి హీరో విష్ణుగారితో భోంచేద్దాం'

పిల్లల సంబరం పట్టలేకుండా ఉంది మొదటి

సారిగా షూటింగ్ చూస్తున్న శ్రీమతి నోరు తెరుచుకుని అంతా పరికిస్తోంది డైరెక్టరు కాబోలు అందరికీ సూచనలు ఇస్తున్నాడు కెమేరామెన్ కెమేరాలోంచి యాంగిల్స్ చూసుకుంటున్నాడు సెట్ అంతా చాలా హడావుడిగా ఉంది

'సార్'

'నువ్వుటోయ్ సురేష్. ఏమిటి ఇలా వచ్చావ్'

'కెమేరామన్ మా దూరపు బంధువు సార్'

'ఫామిలీతో వచ్చావా?'

'అవును సార్ అక్కడ కూర్చుని టిఫిన్ చేస్తున్నారు ఏమిటి సార్ రెండు మూడు రోజుల్నుంచీ డ్యూటీకి రావడం లేదు'.

'ఏదో కొద్దిగా పనులున్నాయిలే'

'ఇది నిజమేనా సార్'

'ఏది?'

'సూపరింటెండెంట్ ఇంజనీర్ సుందర్రావు అవార్డు కొట్టేసిన స్కీమ్ మీరే తయారు చేసారటగా

'నీకెవరు చెప్పారు?'

'డివిజన్‌లో అంతా అనుకుంటున్నారు

'అవును నిజమే'

'ఇది చాలా అన్యాయం సార్'.

'పోనీ ఏం చేస్తాం'.

'అలా ఊరుకోరాదు సార్'

'ఇప్పుడెందుకులే ఆ విషయాలన్నీ.

'ఇంతకీ ఆ స్కీమ్‌ని బట్టి ఇంతవరకూ బయటి కంపెనీలకి ఆర్డరిచ్చి కొనుక్కునే ఒక కాంపొనెంట్ మన ఫాక్టరీయే తయారు చేయవచ్చుటగదా'

'అవును'.

'దీనికి వేరే మిషనరీ ఏదైనా కొనాలా?'.

'అనవసరం ఇప్పుడు మన దగ్గరున్న మిషనరీ ద్వారానే చెయొచ్చు లేబర్ని మాత్రం అదనంగా అప్పాయింట్ చేసుకోవాలి'

'మరి ఇంతటి చక్కటి స్కీమ్ తయారు చేసిన మీకు ఇలా జరగటం అన్యాయం సార్'

'ఆ విషయాలన్నీ ఇప్పుడొద్దన్నాను కదయ్యా'

సారీ సార్ షూటింగ్ చూడండి ఏదో ఒక రోజు తీరిగ్గా ఇంటికొస్తాను వెళ్తాను సార్ మరి నమస్తే'

ఏదో సామెత చెప్పినట్లు ఇక్కడి కొచ్చినా ఆ విషయం మరచి పోవడానికి వీలు కావడం లేదు పైగా పుండు కెలికినట్లయింది 'సైలెన్స్' అన్న డైరెక్టరు కేక మనసుకి అన్వయించుకోవాలి తప్పదు

'స్టార్ట్ లైట్స్ ఆన్ కెమేరా - డైరెక్టరు రంకెలేస్తున్నాడు ఇంతలో ఒక వ్యక్తి పరిగెత్తుకుంటూ వచ్చి అద్దాల తలుపుల్లోంచి దూకాడు ఆ తర్వాత కొంత సేపటికి ఒక తాడు పుచ్చుకుని ఊగుతూ మేడ మీదకి దూకాడు ఆ తర్వాత సందుల్లో పరిగెత్తాడు అక్కడున్న ఒక మోటార్ సైకిలెక్కి సెట్ అంతా దానిమీద తిరుగుతూ రకరకాలయిన ఫీట్స్ ఒళ్ళు గగుర్పాటు పుట్టేట్లుగా వేస్తున్నాడు బహుశా డూప్ కాబోలు ఇవన్నీ బిట్స్ బిట్స్‌గా పిక్చరైజ్ చేస్తున్నారు అలా మోటార్ సైకిల్ మీద ఫీట్స్ చేస్తుండగా ఒక స్తంభం తగిలి అతను కింద పడ్డాడు 'నీకు బుద్ధుందా లేదా తాగొచ్చావా రాస్కెల్ చూసుకుని చెయ్యొద్దూ'- బండ బూతుల్తో డైరెక్టరు అరచిన అరుపులో కాస్త వినదగ్గవిగా ఉన్నవి ఇవే అతను లేచి కాస్త బాధ పడుతూనే (దెబ్బకో తిట్లకో) మోటారు సైకిలెక్కి ఆ ఫీట్ పూర్తి చేసాడు అంతటితో ఆ తతంగం పూర్తయింది

ఇంతలో హీరోగారు కాబోలు అచ్చు డూప్ వేసుకున్న బట్టలే వేసుకుని మేకప్‌తో మెల్లగా సెట్‌లోకి అడుగెట్టాడు విష్ణుగారు విష్ణుగారు అని కొందరు అభిమానంతో అరిచారు కొందరు ఆటోగ్రాఫ్‌ల కోసం చుట్టూ చేరారు డైరెక్టర్‌తో సహా యూనిట్ అంతా లేచి నిలబడ్డారు ఆటోగ్రాఫ్‌ల తతంగం ముగించి తనకై కేటాయించిన సీట్లో



కూర్చున్నాడు డైరెక్టరు తన కుర్చీని హీరోగారి కుర్చీకి దగ్గరగా లాక్కున్నాడు

'నిన్న డ్యూయెట్‌లో వర్షం సీనులో తడిసానుకదా జలుబు పట్టుకుంది'– హీరో

'అరెరె డాక్టరు వచ్చాడా?' – డైరెక్టరు

'ఆఁ! వచ్చాడులెండి ఇంతకీ ఇవ్వాళ్ళ ఫైటింగ్ సీనేగా. నేను రెడీయే. మొదలెట్టండి. నాకు మళ్ళీ వేరే షూటింగ్ ఉంది "

షూటింగ్ మళ్ళీ మొదలయ్యింది హీరో విలన్ని కొట్టే సీన్ని బిట్స్ బిట్స్‌గా తీసారు డైరెక్టరు టైమ్ చూసుకుని 'లంచ్ బ్రేక్' అన్నాడు

'మా తమ్ముడొస్తున్నాడండీ హీరో విష్ణుగారితో కలసి అంతా భోంచేద్దాం అంటున్నాడు '

'భోజనం కేరియర్ తెచ్చుకున్నాంగా మనం'

'ఏదో ముందు జాగ్రత్తకోసం తెచ్చుకున్నాం గానీ ఇప్పుడు అది తింటే బావుంటుందా మా తమ్ముడు బాధ పడడూ'

'ఓ పని చేద్దాం ఎలాగో పిల్లలు కూడా హీరోతో మాట్లాడాలని ఉబలాట పడుతున్నారు కాబట్టి నువ్వూ , పిల్లలూ మీ తమ్ముడూ కలసి హీరోతో తినండి నాకు ఆ టిఫిన్ కేరియర్ ఇవ్వు'

'ఛీ' అదేం మాటండీ మీరు వేరుగా నేను వేరుగానా? పోనీ మీ కిష్టం లేకపోతే పిల్లల్ని మాత్రం పంపుతాలెండి'

'అదేమిటి రోజూ మధ్యాహ్నం నేను మా ఫ్యాక్టరీలోనూ నువ్వు ఇంట్లోనూ భోం చెయ్యడంలా ఇదీ అలాగే అనుకో నేను కోపంగా అంటున్నాననుకోకు. నాకు కొంచెం పనుంది కూడా ఇంకేం మాట్లాడకు నువ్వెళ్ళు మీ తమ్ముడొస్తున్నాడు'

పిల్లలు సంతోషంతో గంతులేసుకుంటూ వాళ్ళ మామయ్యతో అమ్మతో కలసి వెళ్ళారు కళ్ళు అతనికోసం వెతికాయి కాళ్ళు అతని దగ్గరకి దారి తీసాయి.

'నీ పేరు'

'పరశురామ్ సార్. మీరెవరు?'

'నాపేరు జానకిరామ్ మన పేర్లు కూడా చాలా దగ్గరగా ఉన్నాయి కదా'

'మీరు షూటింగ్ చూడడానికొచ్చారా?'

'అవును అసిస్టెంట్ డైరెక్టర్ నిరంజన్ మా బావమరిది'

'అలాగా సార్ నమస్తే'

లేవక్కర్లేదు కూర్చో. ఎంతకాలంగా నువ్వు డూప్‌గా పని చేస్తున్నావు?'

'పది సంవత్సరాలుగా సార్'

'ఆదాయం ఎలా ఉంటుంది?'

'ఏముంటుంది సార్. ఏదో బ్రతుకు వెళ్ళదీయ గలిగినంత'

'నువ్వు చదువుకున్నావా'.

'లేదు సార్ ఐదో క్లాసుతో నే ఆపేసాను'

'ఈ ఫీట్స్ చేయడానికి ప్రాక్టీస్ చేయాలేమో కదా'

'నేనయితే కనీసం అయిదు సంవత్సరాలు ప్రాక్టీస్ చేసుంటాను సార్'

'డేంజరస్ ప్రొఫెషన్ కాదూ?'

'ఏం చెయ్యమంటారు సార్ ఎంత బాగా బతకాలంటే అంత ఎక్కువ రిస్క్ తీసుకోవాలి'

'ఈ డైరెక్టరేనా అంతా ఇలాగే తిడ్తారా?'

'చాలా కొందరు మాత్రమే మమ్మల్ని మనుషులుగా గుర్తిస్తారు సార్'.

'మీకేదయినా యూనియన్ ఉందా?'

'చెప్పుకోదగ్గట్టుగా ఏం లేదు సార్'.

'సరే భోంచేసావా?'

'లేదు సార్. బాక్స్ తెచ్చుకున్నాను చేయాలి'.

'నేను కూడా కారియర్ తెచ్చుకున్నాను పద అక్కడ కూర్చుని ఇద్దరం తిందాం'.

'అదేమిటి సార్. మీరు అసిస్టెంట్ డైరెక్టరు గారితో కూర్చుని తినరా?'

'నా భార్య పిల్లలూ ఆయనతో తింటున్నారులే పద మనం తిందాం'.

'వద్దుసార్. ఏమనుకోకండి. ఆయన చూస్తే నన్ను తిడ్తారు'.

'ఆయనెందుకు నిన్ను తిట్టడం. నా యిష్టం నాది నేనేకదా నీతో కలసి తింటానన్నది. బాక్స్ తెరు నాది కొంచెం నువ్వు నీది కొంచెం నేనూ షేర్ చేసుకుందాం'

'సార్. మీరు పెద్ద కులం వాళ్ళు నేను చిన్నకులం వాడ్ని'.

'అలాంటిదేమీ లేదు పరుశురామ్ నిజానికి నీదీ నాదీ ఒకే కులం– శ్రామికులం రోజూ ఫాక్టరీలో నా తోటి శ్రామికులతో కలసి భోంచేసే వాడిని. ఈ రోజు ఇక్కడ నాతోటి వాడివి నువ్వే కన్పించావు అర్థం లేని ఆలోచనలు పెట్టుకోకు– బాక్స్ తెరు'.

'మీ అంత సహృదయం గల మనిషిని నేనింత వరకూ చూడలేదు సార్'.

★ ★ ★ ★ ★

రాత్రి భోజనాలు అయిన తర్వాత వంటిల్లు సర్దుకుని కడిగి వచ్చిన సుశీలకి భర్త ఆదమరచి నిద్ర పోతూండటం చూసి ఆశ్చర్యం వేసింది. మూడు రోజులుగా సరిగ్గా నిద్రపోక అసహనంగా ఉన్న మనిషి భోజనం చేసిన అరగంటకే నిద్రపోవడమా?... అలారం పీస్ చూస్తే అయిదు గంటలకి అలారం పెట్టుంది అంటే రేప్రొద్దున డ్యూటీకి వెళుతున్నారన్న మాట ఆయన ఎంత కాదన్నా షూటింగ్ చూసిన తర్వాతే ఆయన మనసు కొంచెం తేలిక పడింది ఎవర్నయినా మత్తులో పడేసే మహిమ మరి ఆ షూటింగ్‌లో ఉంది. గుండెలమీద పడున్న డైరీ తీసింది డైరీ వ్రాస్తూనే నిద్రపోయినట్టున్నారు ఏం వ్రాసారో చదువుతే.. .. సభ్యత కాదు అయినా క్యూరియాసిటీ ఆగడం లేదు. గుండ్రంగా నిబ్బరంగా ఉన్నాయి. అక్షరాలు

'మన దేశంలో ఎన్నో రంగాల్లో ఉన్న శ్రామికుల జీవితాలతో పోలిస్తే ప్రభుత్వరంగ ఫాక్టరీలో పని చేసే నా జీవితం ఎంతో నయం సినిమాల్లో డూప్‌గా పని చేసే పర శురామ్‌ని చూస్తే నా గుండె తరుక్కుపోయింది. దినదిన గండంగా పని చేసే అతనికి మిగిలిందేమిటి? ఛీత్కారాలూ చీదరింపులూ మరో బాధాకర విషయం అంత కష్టపడి అతను చేసే ఫీట్లకి ప్రేక్షకులిచ్చే చప్పట్లు ఎవరికి? వర్షం చినుకుల్లో తడిస్తే జలుబు చేసే హీరో గారికి. ఎవరు నిజమైన హీరో? ఎవరు డూప్?

నేను కష్టపడి రూపొందించిన స్కీమ్‌ని సుందర్రావు కొట్టేసి లాభం పొందాడని నాలుగు రోజులుగా బాధపడుతున్నాను కానీ నాకు ఆ ఫాక్టరీలో కొందరిలో అయినా గుర్తింపు ఉంది ఆ స్కీమ్‌ని నేనే చేసానని చాలా మందికి తెలిసింది. నాకో గౌరవం ఉంది తోటి శ్రామికుల అండదండలున్నాయి మాకో యూనియన్ ఉంది సంఘటిత శక్తి ఉంది కానీ పాపం ఆ డూప్ పరుశురామ్‌కి?

ఆరు నెలల నా కష్ట ఫలాన్ని సుందర్రావు తన్నుకు పోయాడని నేను బాధ పడుతున్నానే ఐదు సంవత్సరాలు అతను శారీరక శ్రమ తపస్సు చేసి నేర్చుకుని పది సంవత్సరాలుగా చేస్తున్న ప్రమాదకర ఫీట్లని, ప్రేక్షకులు హీరోకి ఆపాదించి హీరోకి జేజేలు కొడుతుంటే ఆ శ్రామికుడు పడే బాధ వర్ణనాతీతం అతని ముందు నా బాధ ఎంత?

అనవసరమైన వెర్రి మొర్రి ఆలోచనలతో నాలుగు రోజులు ఫాక్టరీకి సెలవు పెట్టి ఆ మేరకి ఉత్పత్తి తగ్గించిన వాడి నయ్యాను. ఎలాగైనా వారం రోజుల్లోగా ఆ లోటుని పూడ్చాలి

డైరీ చదివిన సుశీల సిగ్గుతో తృప్తిగా భర్త ముఖం వైపు చూసింది హాయిగా నిర్వికారంగా నిశ్చలంగా బుద్ధుడిలా నిద్రపోతున్నాడతను □





# దూరదర్శనం

లత

శుక్రవారం (20–2–87) నాటి కార్యక్రమాలు స్వరమాధురితో ప్రారంభమయినయ్ – సితారు వాదనం బాగుంది వ్యవసాయదారుల కార్యక్రమంలో పశు సంవర్ధక శాఖ గురించి చెప్పారు అమెరికాలో గేదెపాలు తాగరుట గొర్రెపిల్లల పెంపకం కూడా చెప్పారు – కోళ్ళు కోడిగుడ్లు పెట్టడం చూపించారు భగవంతుడు ఎన్ని రకాల జీవాల్ని ఎన్నిరకాల జీవకణాలతో సృష్టించాడో గదా? ఆ కోడిగుడ్డు పెట్టడం చూశాక దేముడిని నమ్మక చస్తామా? ఎలక్ట్రికల్ సంగీతం – థామస్‌ట చిన్నవాడు బాగా సాధనచేశాడు రూపము చూసి వలచీ – అన్యాయంగా పదేళ్ల ఆడపిల్ల ఆవిధంగా అభినయిస్తుంటే ఏమిటోగా ఉంది – ఎబ్బెట్టుగా ఉంది సంగీత నృత్యాలు తప్పనిసరిగా నేర్చుకుంటున్నారు – మంచిదేగాని ఏమిటో మరి . కొన్ని వయసుల్లో కొన్ని బాగుండవు

## ఇంద్రధనుసు

ఎదురిల్లు – రచన – ఎర్రంశెట్టిశాయి కామేశ్వరి బాగా నటించింది డైలాగులు బాగున్నాయి కాని మిగతా నటులు రాదా" అని పిలిచారుగాని దాకి వత్తు ఇవ్వలేదు రాధా అనలేదు సంభాషణే ప్రాణమయిన మా రేడియోవారు ఒత్తులు లేకపోతే రిహార్సలు చేయించి ఒత్తులు పలికించేవారు ఇది గతమా? అయితే వర్తమానంలో రాదా అనాలా? తెలియదు మరి కథ – ఆడదాని వెచ్చికలలూ! పిచ్చికళలూ!

## ఏక్ కహానీ

శుభ చింతక్ – కచ్చి కథ ఈ రచయిత పేరు సరిగా చూపలేదు – అందుకని ఇంగ్లీషులో కూడా చదవడం కష్టం అయింది కాని ఆయనకి చాలా అవార్డులు వచ్చాయి శుభచింతక్ అంటే మన ఆకాశరామన్నలాటివాడనుకుంటాను కపిల అనే ఆవు దూడను ప్రసవించడానికి సిద్ధంగా ఉన్నట్టుంది – ఈ శుభ చింతకులు ఏదో అపార్థం చేసుకొని ఇంటాయనకి ఫోను చేయడం – చివరకి ఆవు ఈనినప్పుడు ఇంటిఇల్లాలు కేకపెడితే ఆమెని ఖూనీచేశారని శుభచింతకులు భ్రమపడి అప్పుడే వచ్చిన ఇంటాయనకి చెప్పడం – చివరకి ఏమీ లేకపోవడం ఇందలి కథ ఈ కథకి అన్ని అవార్డులు వచ్చాయి రచయితకి త్రోట్ కాన్సరులా ఉంది. కచ్ ప్రాంతాల్లో మాట్లాడే యాస భాష వాడారు. కనక మనకి అయోమయంగా ఉంది ఇన్ని అవార్డులొచ్చిన ఆ కచ్చీ కహానీకన్నా ఎర్రంశెట్టి శాయి వ్రాసిన 'ఎదురిల్లు' బాగుందని ఒప్పుకు తీరాలి

## మికీ అండ్ డోనాల్డ్

వాల్ట్‌డిస్నీ కార్టూన్ చిత్రం పిల్లలకోసమే అయినా అందరూ ఆనందించే కార్యక్రమం

## రామాయణం

ఈవారం గంగావతరణం అహల్యా శాప విమోచనం, మిథిలా నగర ప్రవేశం, జనకుని కుటుంబ పరిచయం చూపించారు గంగావతరణం చిత్రీకరణ బాగుంది అహల్య గాలిలోకి ఎగరటం రామాయణంలో లేదు ఇక సీత దీపిక అనే "విక్రమ్ భేతాళ్ లో వేసిన ఒకనటి సీతా సౌందర్యం దీపికకి రాలేదు ఏమైనా ఇది రామకథ భారతీయుల దమనుల్లో ప్రవహిస్తున్న జీవితపుకథ – మధుర మధుర మహనీయ కథాసుధ ఉత్తర రామాయణం తెలుగు వారికి ఇస్తే బాగుండునని ఇన్నిరెపను కలుగుతున్నది ఈ సుధా స్రవంతిని ఇంకా ఉన్నతంగా తీయగలమనే నమ్మకం నాకున్నది రామానంద సాగర్‌జీ క్షమింతురుగాక

'రామాయణం'లో దశరథుడిగా రాజ్‌బబ్బర్



## సాగర సంగమం

శనివారం (21–2–87) సాయంత్రం – సాగర సంగమం చాలా చక్కని చిత్రం. దాన్ని గురించి నేను చెప్పనవసరంలేదు కాని ఇంతమంచి చిత్రం చూస్తున్న ఆనందం ప్రేక్షకులకు లేకుండా రెండు తడవల ఫిలిం తెగి మొదలెట్టిన మంచి పాట 'వాగర్థా' పోయింది అది ఇంజనీర్లూ ప్రొడ్యూసర్లూ ఎనౌన్సర్లూ ప్రజలు కట్టిన పన్నులు జీతంగా తీసుకుంటూ ప్రజలకి చేసిన ద్రోహం. అలాగే సినిమా ఆపేసి 24 ప్రకటనలు చదవటం ఘోరాతిఘోరం ప్రకటనలు సినిమా అయింతరువాత చదవటానికి టైము ఉంది అటైము మరో పదిమంది తప్పిపోయిన వాళ్ల గొడవ చదివారు కనీసం శనివారాలు కామన్‌సెన్స్‌తో ప్రవర్తిస్తే ప్రజలు టి వి వార్ని ఆశీర్వదిస్తారు

టైము కావాలనుకుంటే 5 గంటలకె మొదలెట్టవచ్చును కోట్లమీద ఆదాయం వస్తుంది టి వి కి – వారం అంతా చెత్త చూసిన ప్రజలు శనివారం మంచి సినిమా చూద్దామని ఆశిస్తారు ప్రజల్ని మూర్ఖుల్నిచేసి టి వి. వారూ టి వి ల్ని అమ్మేవారూ ఆట్టేకాలం మనలేరు అదీకాక ఫిలింప్రింట్ చూసి తీసుకురావటంలేదు ఫిలిం సిమెంటు దగ్గర పెట్టుకుని జాగ్రత్తగా ఉండే ఆపెరేటరు హైదరాబాద్ టి వి కి లేనట్టున్నాడు శనివారాన్ని పెద్ద శనిగా మార్చవద్దని టి వి వారికీ, ఎలక్ట్రిసిటీ వారికీ, టి వి ఉద్యోగస్తులకూ ఆంధ్ర ప్రజల తరఫున మనవి చేయటం, విన్నవించటం అయిపోయింది హెచ్చరించటమే మిగిలింది మధ్యలో ఫిలిం తెగి మూడు నిముషాలూ – సినిమా మొదటా చివరా – మధ్యా ప్రకటనల తప్పిపోయిన వాళ్లకోసం కొంతటైమూ వృధా పరచకపోతే అదీ సినిమాకి కేటాయించవచ్చు. ఎవరు స్పాన్సరు చేశారో వారు సినిమా మీదే చూపిస్తారు శనివారం ప్రకటనల్ని తప్పిపోయినవాళ్లనీ – తప్పించినంత మాత్రంచేత టి వి ఆర్థిక పరిస్థితిలో లోటురాదు గాని, ప్రజల హార్దిక అభినందనల్లో మార్పు వచ్చి మొదటికే మోసం వస్తుంది ఢిల్లీని చూసి ప్రకటనలు ఎలా? ఎప్పుడు? ఎంతసేపు వేయాలో నేర్చుకోవాలి హైదరాబాద్ వివిధ భారతి కూడా ఇదే కారణంతో ప్రజల ఆదరం మొదట్లోలాగా ఇప్పుడు పొందలేకపోతోంది.

ఆదివారం (22–2–87) దూరదర్శని వాళ్ల ఎంబ్లమ్‌మీద సత్యం - శివం - సుందరం అన్న వాక్యాలు ఉంటాయి ఆకాశవాణి బహుజనహితాయ అని ఉంటుంది – సుందర్యం – శివం కనపడుతున్నా సత్యం అప్పుడప్పుడు లోపిస్తున్నది ప్రభాతితో ఉదయ ప్రసారం ప్రారంభమయింది తాళగతులూ మాత్రలూ వివరంగా చెప్పారు ఇది ఆకాశవాణిలో ఓలేటిగారి సంగీత శిక్షణలాటిది ప్రొద్దున్నే సిక్కుల ప్రార్థన తీశారు కాని రామనామం కూడా పోయింది – అయినా శ్రీరామనామం మతం కిందికిరాదు ఒక మహాపురుషుడిని తల్చుకుని ధన్యత చెందడం అయినా మతపరమైన సిక్కు ప్రార్థనతో పాటు ఇదీ పోయింది □




సీరియల్

# ఆరోహణ

## శైలకుమార్



(గత సంచిక తరువాయి)

చక్రవర్తిని తన ఇంటికి తీసుకు పోయింది మానస. నిరాశగా, బొమ్మలా ఆమె వెంట నడుచుకుంటూ వచ్చాడు చక్రవర్తి ఆమె సామీప్యంలో అతనికేదో ఓదార్పు.

చిన్న ఇల్లయినా ఎంతో శుభ్రంగా వుంది మానస ఇల్లు ఇల్లు అలంకరించిన పద్ధతిలోనే మానస సంస్కారం కనిపిస్తూ వుంది ముఖ్యమైన అన్ని వసతులూ వున్నాయి ఇంట్లో

లైటు వేసి లోపల కూర్చో పెట్టింది చక్రవర్తిని అతడెంత బాధపడు తున్నాడో అతని ముఖాన్ని బట్టి గ్రహించ గలుగుతోంది ఆమె. అతన్ని ఓదార్చాలని, అతని ఒంటరితనాన్ని పోగొట్టాలని అనిపిస్తోంది ఆమెకు.

'రచన గురించి ఏం తెలుసని అలా అంది కీర్తన" ఎటో చూస్తూ అన్నాడు చక్రవర్తి

"సంతకం చెయ్యటమే సరిగ్గా రాదు ఇక సాహిత్యం గురించి ఆమెకేం తెలుస్తుంది. అయినా ఆమె మాటలకు విలువిచ్చి ఎందుకు అంత బాధపడు తున్నారు' లాలనగా అంది మానస.

ఇంత అవమానం ఎలా భరించమంటావు మానసా?"

అర్హత లేని వ్యక్తి అవమానించటం ఏమిటి అయినా అదంతా ఆమె ఉక్రోషం, జగదీష్‌ను రైటర్‌గా తీసుకోలేదని"

'ఈ సినిమా కూడా పోయినట్లే "

'పోనివ్వండి. ఇది పోతే మరోటి రాదా రాకపోయినా ఫర్వాలేదు పత్రికలకు వ్రాసుకుని బ్రతగ్గలరు మీరు అంటూ ధైర్యం చెబుతూ లోపలికి వెళ్ళి నిండుగా వున్న ఓ విస్కీ సీసాను తీసుకుని వచ్చింది. విస్కీ గ్లాసులో పోసి నీళ్ళు కలిపింది

ఎదురుగా కనిపిస్తున్న ఎరుపు రంగు ద్రవాన్ని ఓ నిముషం తదేకంగా చూశాడు చక్రవర్తి కసిగా గ్లాసెత్తి గటగటా త్రాగేశాడు గొంతంతా మంట, నోరంతా చేదు ఆ ఘాటుకు దగ్గు వచ్చింది

అతను మొదటిసారిగా తాగుతున్నాడన్న విషయం గ్రహించింది మానస జాలిగా చూసింది చక్రవర్తిని

కడుపులో మంట పెడుతూ రక్తంలోకి ప్రాకసాగింది విస్కీ మళ్ళీ గ్లాసులోకి పోసుకున్నాడు చేయి పట్టుకుంది మానస సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ

'వద్దు కవిగారూ ఎక్కువవుతుంది" కళ్ళతోనే వారించింది

"నన్ను ఆపద్దు మానసా! తాగనీ! నన్ను నేను మరచి పోయేంత తాగనీ నా కసి, కోపం, బాధ అన్నీ మరపుకు రానంత తాగనీ!" ఆవేశంగా అన్నాడు

మత్తులో ఎంత కాలం వుంటారు మనసుకు భరించటం నేర్పాలి" జీవిత పాఠాలెన్నో చదివిన తత్త్వవేత్తలా అంది మానస

భరించి భరించి ఈ మనసు అలసి పోయింది మానసా. ఈ నాటితో ఆశలూ పోయాయి" కళ్ళ నీళ్ళు జారుతూ వుండగా, గ్లాసు పూర్తి చేసి మళ్ళీ నింపుకున్నాడు.

కళ్ళ నీళ్ళతో ఓ పసి పాపలా అనిపించాడు మానసకు చక్రవర్తి ఆందోళన పడుతున్న అతన్ని లాలించాలని, బుజ్జగించాలని, ధైర్యం చెప్పాలని లేచింది మానస ప్రేమగా చక్రవర్తి కన్నీళ్ళు తుడిచి తలలోకి వేళ్ళు జొనిపి నిమిరింది.

"ఆలస్యమైనా ప్రతిభ తప్పకుండా గుర్తింపబడుతుంది కవిగారూ" ఎదకు హత్తుకుని లాలనగా అంది

ఆ స్పర్శకు, ఆ ఆత్మీయతకు, ఆ లాలనకు, ఆ కాస్త ప్రేమకు భరించలేక భోరున ఏడ్చేశాడు చక్రవర్తి నర నరానా ప్రాకుతోన్న మత్తు అతన్ని మరింత వివశుడ్ని చేస్తోంది

కరుణ అంతా కళ్ళల్లో నింపుకుని అతని కళ్ళల్లోకి చూస్తూ కన్నీరు పైట కొంగుతో అద్దింది. మరింత దగ్గరకు తీసుకుంది

"నీలూ" అంటూ ఆమెను పెనవేసుకున్నాడు జాకెట్టుకు చీరకు మధ్య ఏ ఆచ్ఛాదనా లేని ఆమె నడుము అతని చేతుల్లో నలిగిపోతోంది చేతుల దారుల గుండా ప్రయాణిస్తున్న మత్తు, ఉద్రేకం

ఆమె పెదవుల మీద గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు మత్తుగా ఎర్రనైన కన్నుల్లో కాంక్ష. ప్రవాహంలో కొట్టుకు పోతున్నవాడు గడ్డిపోచను పట్టుకున్నంత బలంగా ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు. పెదవులు, కళ్ళు, నుదురు, చెంపలు, మెడ, భుజాలు చుంబించాడు ప్రేమగా, ఆత్మీయంగా, లాలనగా

వారించబోయింది మానస ఆమెకు సాధ్యం కాలేదు

మొట్టమొదటి స్త్రీ స్పర్శ. అన్నేళ్ళ బ్రహ్మచర్యాన్నీ అలవోకగా అవలకు నెట్టేసిన స్పర్శ. శరీరంతో పాటు మనసునూ కదిలించి కరిగిస్తున్న మధురమైన శరీరపు ఒత్తిడి, పులకింతల్ని పలకరిస్తున్న కరాంగుళుల కమనీయత, రమ్యంరాగమై లవళించి అలలు అలలుగా అల్లుకుంటున్న ఆనందపుటల్లరీ వల్లరి

"కవిగారూ" అయిష్టంగానే ఆఖరిసారిగా ప్రయత్నించింది వారించటానికి మానస.

ఆమె కదిలిన పెదవులను కదలకుండా బంధించి, మత్తును మరింత పెంచే అధరమధుర సుధ రస ధారలో – అగోచరమైన అంతర్గతపు అగ్నికి వయస్సు హవిస్సుగా– అణువణువూ జీవం పోసుకున్న మాంసపు ముద్దలే కేంద్రీకృత అనంతానంద రసధునులుగా– ఆకారాలు మరచి ప్రపంచాన్ని విడచి స్థితి తప్పిన అస్తిత్వం ఆశగా అంచులు వెతుకుతూ సృజిస్తున్న కంకణ నిక్వణమే సృష్టిమూల ధ్వనులుగా–

**జరిగిన కథ-14 :** నీలిమ ఎడబాటువల్ల కలిగిన నిరాశతో తిరుపతి వదలి మద్రాసు చేరుతాడు చక్రవర్తి కొంత కాలం పాటు చక్రవర్తికి మద్రాసులోనూ నిరాశ, అవమానం, మోసం ఎదురవుతాయి. ఆత్మహత్య చేసుకోవాలన్నంత నిస్పృహలోకి వెళుతున్న చక్రవర్తికి రవి కలుస్తాడు. రవి సాయంతో చక్రవర్తికి సినిమాకు కథ, మాటలు, పాటలు రాసే అవకాశం దొరుకుతుంది సినిమా షూటింగ్ సందర్భంగా చక్రవర్తికి మానస పరిచయమవుతుంది. కొత్త రచయిత ఉంటే తాను నటించనని బెదిరించి వెళ్ళిపోతుంది నటి కీర్తన. నిర్మాత పార్థసారథి కీర్తనను వదులుకోవడానికే సిద్ధపడతాడు. చక్రవర్తికి మానస దగ్గర ఓదార్పు దొరుకుతుంది

జాణ శరీరం వీణలా పలికే వింత సమయం. తాకిన సంతోష తరంగాలకు కనువు మూర్ఛనలు పోయే తరుణం. వాలిపోతున్న కన్నుల ముందు కల నిజమై కరిగి సాకారంలో సంలీన మయ్యే క్షణం.

తుఫాను వెలిసిన ప్రశాంతి అక్కడ. అలసి– ఆదమరచి– ఆకాశానికి ఎగిరిన అల నెమ్మదిగా వెనక్కి వెళ్ళిపోతున్నట్లు ఇద్దరూ నిద్దురలో.

*                    *                    *                    *                    *

తెల్లవారు ఝామున మత్తు వదలి మెలకువ వచ్చింది చక్రవర్తికి. నగ్నంగా తనను పెన వేసుకుని వున్న మానస.

తన ఎదపై వున్న ఆమె చేయి నెమ్మదిగా తీశాడు.

"కవీ" కలవరించినట్లు మత్తుగా పిలిచింది.

ఆమె ముఖాన్ని రెండు చేతులలోకి తీసుకున్నాడు. మత్తుగా వున్న ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

"అయాం సారీ"

"ఎందుకు" చిలిపిగా అడిగింది.

"నీ కిష్టమో లేదో తెలుసుకోకుండా"

"నిజంగా నా కిష్టం లేకపోతే నువ్వు ఏం చెయ్యలేవు" కిలకిలా నవ్వింది.

ఆశ్చర్యంగా చూశాడు ఆమె వంక. లేచి దుస్తులు వేసుకుంది.

"ఇక్కడికి వచ్చాక ఇష్టం లేకపోయినా ఎందరికో ఇవ్వాల్సి వచ్చింది ఈ శరీరం. ఆ మలినమంతా రాత్రి నీ స్పర్శలో పోయిందేమో" చక్రవర్తి ప్రక్కనే కూర్చుని అతన్ని దగ్గరకు తీసుకుంటూ అంది.

"మానసా! అసలు నువ్వెవరు. ఇక్కడి కెలా వచ్చావు. నీ గురించి తెలుసుకోవాలని వుంది."

"బాధాకరమైన వర్తమానాన్ని తప్ప ఆనందాన్నిచ్చిన గతాన్ని మరచిపోయాను కవీ" బరువుగా అంది మానస.

"నా కింత దగ్గరగా వచ్చిన నీ గురించి తెలుసుకోవాలనే తప్ప బాధ పెట్టాలని కాదు మానసా!"

"బాధ ఏముంది. అందరిలాగే పెద్ద తారను కావాలనే ఆశతో ఇక్కడికి వచ్చాను. కాని ఏమీ కాలేక పోయాను. ఈ పరిశ్రమలోని రాజకీయాలు, కుళ్ళు నన్ను వాడుకున్నాయే గాని ఎదగనివ్వలేదు" చక్రవర్తి మొహంలోకి చూసింది మానస.



కాని నేను నీలా నిరాశపడటం లేదుకవీ రేపు బావుంటుందన్న ఆశే నన్ను బ్రతికిస్తోంది "

చక్రవర్తిలోని నిరాశను చాలావరకు తొలగించాయి ఆమె మాటలు హాయిగా నవ్వాడు చక్రవర్తి

నీ నుంచి చాలా నేర్చుకోవాలి' అన్నాడు నిజాయితీగ

ఊఁ అంది చిలిపిగా

వంటింటిలోకి వెళ్ళి పాలపొడితో కాఫీ తయారు చేసి తీసుకు వచ్చింది

నీలూ ఎవరు?' అడిగింది

ఎవరని చెప్పాలి ఏమని సమాధానం చెప్పాలి. మౌనంగా మానస కళ్ళల్లోకి చూస్తూ వుండి పోయాడు

మిమ్మల్ని ప్రేమించిందా'

కాదు నేనే ప్రేమించాను ఆమెను '

తెలతెలవారుతూ వుంది

నీకెలా తెలుసు?" అడిగాడు

రాత్రి రెండు మూడు సార్లు కలవరించారు నవ్వుతూ చెప్పింది

'ఎందుకింత దగ్గరయ్యావు మానసా' ఆమెను దగ్గరకు లాక్కుని ఎదకు హత్తుకుంటూ అడిగాడు

'ఇంకా ఈ సినిమా ప్రపంచపు మాలిన్యం అంటని మిమ్మల్ని చూడగానే ఎందుకో ఆత్మీయులనిపించింది చాలా దగ్గరవ్వాలని దురాశ నిజాయితీగ అంది మానస ఆమె కళ్ళల్లో లీలగా తడి

ఒక్క రోజులోనే నవ్వాడు చక్రవర్తి

'మనసు తెలియటానికి యుగాలు కావాలా?

తెల్లవారి పోవటంతో బయలుదేరాడు చక్రవర్తి రవిని కలవగానే విషయం తెలిసి చాలా ఆనందం కలిగింది చక్రవర్తికి స్నానం చేసి ఇద్దరూ గౌతమ్ ఆర్ట్ క్రియేషన్స్ ఆఫీసుకు బయలు దేరారు

★ ★ ★ ★ ★

అందరూ కూర్చుని కొత్త 'హీరోయిన్ కోసం చర్చలు జరుపుతున్నారు తెల్లవారేసరికే కీర్తనను పార్థసారథి తీసివేశాడని, కొత్త నటి కోసం వెతుకుతున్నాడన్న వార్త దావానలంగా వ్యాపించింది పరిశ్రమ అంతా

ఫోన్ మ్రోగింది కిరీటి అందుకున్నాడు.

"సార్ కీర్తన గారు మీతో మాట్లాడాలట" పార్థసారథిని చూస్తూ చెప్పాడు కిరీటి.

"ఏమిటో అడుగు

"మీతోనే మాట్లాడా లంటోంది సార్

'అవసరం లేదు ఏమిటో అడుగు

ఆమె చెప్పింది విని పార్థసారథి వైపు తిరిగాడు కిరీటి 'నిన్న జరిగిందానికి సారీ చెబుతోంది సార్ నష్టాన్ని భరించి ఆమే నటిస్తుందిట" చెప్పాడు కిరీటి

నిజానికి తాను బెదిరిస్తే జగదీష్‌ను రచయితగా తీసుకుంటా రనుకుంది కీర్తన కాని ఆమెనే తీసేస్తారని ఊహించలేదు మంచి వేషం పోవటమే కాకుండా పరిశ్రమలో చెడ్డపేరు వస్తుంది. పైగా పార్థసారథితో విరోధం అందుకే రాజీకి దిగింది కీర్తన

"అవసరం లేదని చెప్పి ఫోన్ పెట్టెయ్యి" స్థిరంగా అన్నాడు పార్థసారథి.

ఆ మాటకు త్రిమూర్తి కలవరపడ్డాడు

"ఆమే రాజీకి వచ్చి నటిస్తానంటుంటే వద్దనుకోవటం ఎందుకు సారథిగారూ" అన్నాడు

త్రిమూర్తీ! రెండవ రోజే ఇబ్బందిపెట్టింది కాబట్టి కొద్దిపాటి నష్టంతో తేరుకోగలం ఆమె ఈ కోపం మనసులో పెట్టుకుని సగం సినిమా అయ్యాక ఇబ్బందులు పెడితే ఎంత నష్టమో ఆలోచించండి".

ఆయన ఆలోచనను కాదనలేకపోయాడు త్రిమూర్తి

'లాభమో, నష్టమో కొత్తనటిని తీసుకుందాం అనుకున్నాం అలాగే చేద్దాం

కొత్త నటి కోసం వేట మొదలైంది పార్థసారథి కొత్త నటితో సినిమా తియ్యాలనుకుంటున్నాడు అన్న విషయం తెలియగానే ఎందరో అందమైన అమ్మాయిలు ఆఫీసు చుట్టూ తిరగసాగారు

పార్థసారథి, త్రిమూర్తి, రవి, కిరీటి, చక్రవర్తి, కెమెరామన్ పరీక్షిస్తున్నారు వస్తున్న అమ్మాయిలని అభినయం వున్నవారికి అందం వుండటం లేదు అందం వున్నవారు అభినయించలేక పోతున్నారు రెండూ వున్నవాళ్ళు పాత్రకు సరిపోవడంలేదు

ఎలాగైనా 'హీరోయిన్ కావాలన్న ఆశతో తాపత్రయ పడుతున్న అమ్మాయిలను ఆశ్చర్యంతోను, అసహ్యంతోను చూడసాగాడు చక్రవర్తి చాలా అందంగా మేకప్ చేసుకుని వచ్చి వేషం కోసం వాళ్ళు చేస్తున్న వెకిలిచేష్టలు, అవసరం లేకుండానే ఒలకబోస్తున్న ఒయ్యారం, కవ్విస్తున్న జాణతనం, నిస్సిగ్గుగా ప్రవర్తించే వాళ్ళ తీరు చాలా బాధ కలిగించాయి చక్రవర్తికి 'ఇంత దిగజారాలా వేషంకోసం' అనుకున్నాడు

మరొక అమ్మాయి వచ్చింది లోపలికి వాళ్ళ అమ్మతో

తాను తీయించుకున్న ఫోటో ఆల్బం వాళ్ళకు అందించి ఎదురుగా కూర్చుంది

మీ పేరు అడిగాడు త్రిమూర్తి

జీవన" ఒయ్యారంగా దీర్ఘం తీస్తూ అంది

"ఇంతకుముందు ఎందులోనైనా యాక్ట్ చేశారా?

"లేదండీ సౌందర్యా వాళ్ళు ఓ వేషం ఇస్తానన్నారు కాని ఆ క్యారక్టర్ నచ్చక వద్దనుకున్నాం సమాధానం ఇచ్చింది ఆ అమ్మాయి తల్లి

ఆమె అబద్ధం చెబుతోందని అక్కడవున్న అందరికీ ఖచ్చితంగా తెలుసు

"హైటెంత?' త్రిమూర్తి అడిగాడు

చెప్పింది

"ఒకసారి నిలబడతావా?

పైట అనవసరంగా సరిచేసుకుంటూ లేచి నిలబడింది ఆ అమ్మాయి మత్తుగా త్రిమూర్తి కళ్ళల్లోకి చూస్తూ

"అటూ యిటూ నడు

ఆ గదిలో ఆ చివర నుండి ఈ చివర వరకు నడిచింది ఆమె అలా నడుస్తూ వుండగా పైట జారి నేలమీద వున్న తివాచిమీద పడింది పొంగులు కనిపించేలా వంగి సరిచేసుకుంది

పైట జారినప్పుడు ఆమె కడుపుమీద ఏదో వాతలా వుండటం గమనించాడు కెమెరామన్ ఆ విషయం త్రిమూర్తికి చెప్పాడు

"చీర తీసేస్తావా కాఫీ ఇస్తావా అన్నంత తేలిగ్గా అడిగాడు త్రిమూర్తి

తల్లి వంక చూసింది జీవన

"తీసెయ్యమ్మా అంతా మనవాళ్ళే కదా నవ్వుతూ చెప్పింది ఆమెతల్లి

అంతమంది మగవాళ్ళు ఆమె శరీరాన్ని గుచ్చి గుచ్చి చూస్తున్నారన్న సిగ్గు ఏమాత్రం లేకుండా చీర తీసి కుప్పలా తివాచీమీద పడేసి లంగా జాకెట్టుతో నిలబడింది జీవన అడిగితే అవికూడా విప్పేసేలా ఉంది

కెమెరామన్ లేచి ఆ అమ్మాయి దగ్గరగా వెళ్ళాడు చేత్తో పొట్టమీద వాతను రాసి పరికించాడు

'చిన్నప్పుడు పెట్టిన వాత బాబూ ఏవో పల్లెటూరి నమ్మకాలు మేకప్‌లో కనిపించదులెండి మీకు తెలీదా" చెప్పింది అమ్మాయి తల్లి

"ప్యాడింగా" అడిగాడు కెమెరామన్ ఆ అమ్మాయి వక్షోజాల్ని చూస్తూ

"ఒరిజినలే' అంది మత్తుగా నవ్వి

'సాయంత్రం కలవమంటారా" అడిగింది అమ్మాయి తల్లి

"అడ్రసు ఇచ్చి వెళ్ళండి మేమే కబురుపెడతాం'

చక్రవర్తికి చాలా అసహ్యం వేసింది ఆ అమ్మాయి తల్లిమీద.

(ఇంకా ఉంది)

# నాన్నా! నువ్వు వచ్చిపో!!



## రాంరజా

శేఖరం శివాలయంలో కూర్చున్నాడు ఎమ్ ఎ ఫస్టు క్లాసులో పాసైన అతనికి అయిదేళ్ళైనా ఉద్యోగం రాలేదు మరో మూడు నెల్లు ఇలాగేవుంటే ఇక అతనికి ఉద్యోగం రాదు ప్రభుత్వోద్యోగానికి వుండవలసిన వయసు దాటిపోతుంది అతని మనసు చాలా వికలంగా వుంది పిచ్చి ఊహలు మనసును చెదపురుగుల్లా దొలిచేస్తున్నాయి చీకటిలాంటి భవిష్యత్తులో ఆశాకిరణంలా, ఒక్కటేమార్గం అతనికి కనిపిస్తోంది అందుకే, ఆ మార్గాన్ని సుగమం చెయ్యమని శివాలయంలో ఒంటరిగా అతను 'దేవుడూ'-దయ చేసి మానాన్నను త్వరగా నీ దగ్గరకు తీసుకుపో! అసలీ లోకంలో ఎవరికీ షష్ఠిపూర్తి ఉత్సవం జరగనివ్వకు యాభైఏడేళ్ళ సుఖ దుఃఖాల పరిపూర్ణ జీవితాన్ని ఆయన ఎలాగూ అనుభవించేశాడు ఇంకా ఆయన బతికుండి ఎవర్ని ఉద్ధరించాలి కనుక?' అసలు- ఆరోజు- మానాన్న ఆ యాక్సిడెంటు అయిన బస్సులోనే వున్నాడు ఆ ప్రమాదంలో నువ్వు - మానాన్నను కాకుండా, ఆయన ప్రక్కనే కూర్చున్న, ఎంతో జీవితం చూడ వలసిన కుర్ర వెధవను తీసుకుపోయావు మా నాన్నకు వీసమెత్తు దెబ్బ కూడా తగల నివ్వలేదు శివుడి ఆజ్ఞలేందే చీమైనా కుట్టదంటారు ఇలాటి అర్థం పర్థం లేని ఆజ్ఞలేమిటయ్యా నీవి? కానైతే శివుడూ'- నువ్వు నాన్నను చంపకుండా, ఆయనకే దెబ్బైనా తగిలించినా, దీర్ఘరోగిని చేసినా - ఆయన బాధ మాట దేవుడెరుగు, నేను బాధపడేలా చేస్తావు ఆస్పత్రుల చుట్టూ తిరిగి, ఉన్న డబ్బు కాస్తా మంచి నీళ్ళ ప్రవాహమై పోతే, ఇంక నేను బతకడం అనవసరమే' అందుకే చెబుతున్నాను అనాయాస మరణం సునాయాసంగా ఆయన కొచ్చేలా చెయ్యి' ఆరామం గాడు ఏ జన్మలో ఏం పుణ్యం చేసుకున్నాడో మరి' వెధవ' ఆ పదో తరగతి పాసవడానికి అరడజను చాన్సులు తీసుకున్నాడు అది కూడా కంపార్టు మెంటల్‌గా పాసయ్యాడు ఆతర్వాత ఇక లాభం లేదని పై చదువులకో నమస్కారం పెట్టేశాడు అయితేనేం? వాడి అదృష్టం బాగుంది వాళ్ల నాన్న గుండె జబ్బుతో 'హరీ' మన్నాడు ఏ తెలివి తేటలూ లేకపోయినా వాడికి వాళ్ల నాన్న పని చేసిన ఆఫీసులో ఉద్యోగమిచ్చి పుణ్యం కట్టుకున్నారు- గవర్న మెంటు వాళ్ళు ఇప్పుడు వాడు హాయిగా ఉద్యోగం చేస్తూ దర్జాగా బతుకుతున్నాడు అటువంటి అదృష్టం నాకూ కలిగించు దేవుడూ''

శేఖరం మనోనేత్రం ముందు శివుడు ప్రత్యక్షమయ్యాడు అయితే శివుడు ఇతని ఆశలు నెరవేర్చే పద్ధతిలో కనిపించలేదు చిరుదీపం వెలుగులో శివుడు శేఖరం కేసి కోపంగా చూస్తున్నాడు

"ఛీ! దుర్మార్గుడా తండ్రి చావును కోరుతున్నావా? ఎంతపాపం! అన్నారు తండ్రి కూడా దేవుడే! నతండ్రిలో నన్ను చూసుకో! ఇక చాలు! వెళ్ళు! వెళ్ళు'' - అంటున్నట్లుగా అనిపిస్తోంది"

శివుడు కోపానికి శేఖరం జంకలేదు సరికదా మరింత కోపం తెచ్చుకున్నాడు

'మా నాన్నేం నీకు మల్లే శివుడుకాడు ప్రధానమంత్రి పదవి వారసికంగా రావడానికి ఆయనేమీ ఈ దేశపు ప్రధాన మంత్రికాడు కనీసం ముఖ్యమంత్రి కూడా కాదు నువ్వైతే, నువ్వు బతికుండగానే – నీ కొడుకులు గణపతికీ, అయ్యప్పకీ, సుబ్రహ్మణ్యానికీ, ఆధిపత్యాలిచ్చి ప్రజల పూజలందుకునే ఏర్పాటు చేశావు కాని, మానాన్న ఇంక నాకేం చేయగలడు? ఇప్పుడు లోకం దృష్టిలో నేను ఉద్యోగం లేని అసమర్థుడ్ని! అప్రయోజకుడ్ని!!'

'అందుకే అంటున్నాను ఈ లోకంలో నీలాటి అప్రయోజకుడు బతకడం అనవసరం నువ్వే చచ్చిపో! మధ్యనిమీనాన్న నెందుకు చంప మనటం?' – శివుడు అన్నట్లుగా అనిపించింది శేఖరానికి.

'ఏమయ్యోయ్ శివుడూ! మాటలు జాగ్రత్తగా రానియ్యి! నేనింకా ఈ లోకంలో ఏం చవిచూడలేదు. నిండు పంచవర్ష ప్రణాళికలు మరో అయిదైనా చూడవలసిన భవిష్యత్తు నా కళ్ల ముందుంది నేనుగానీ, మా నాన్నగానీ చెట్లమేం కాదు ఎన్నోవేల సంవత్సరాలు బతకడానికి చెట్లైతే, ప్రకృతి వనరులతో ఆహార సముపార్జన చేసుకుంటాయి అవి ఎవరిమీదా ఆధారపడకుండా బతుకుతాయి తాము బతుకుతూ పదుగురికి సాయం చేస్తాయి కాని, మనిషి అలాకాదే! తన మనుగడకు మరో జీవ రాశిని చంపాలి అన్నీ కట్టు కథలు కాపోతే గతంలో మాత్రం అన్ని వేల సంవత్సరాలు బతికిన వాళ్లెవ రున్నారయ్యా? ఆ కాలంలో రోజును ఒక సంవత్సరం అనుకునుంటారు అందుకే, సంవత్సరాదిని 'యుగాది' అన్నారు కనీసం మూడు సంవత్సరాలు బతికినా, వేయి సంవత్సరాల పైబడి బతికినట్లు లెక్కలు కట్టుకున్నారు ఆ లెక్క కొస్తే, ఏవో కొన్ని జంతువులు తప్పించి, మిగిలినవి పట్టుమని పాతిక సంవత్సరాలన్నా బతకవు అదే సూక్ష్మ జీవులైతే కొన్ని గంటలు, మహాఅయితే కొన్ని రోజులు బతుకుతాయి. మరో తరాన్ని త్వరగా సృష్టించి వీలైనంత త్వరలో నిర్యాణం పొందుతాయి ఇక మనిషి శరీరంలోని కణాలైతే, రోజు రోజుకూ ఎన్నో పుట్టి– ఎన్నో గతించి పోతూంటాయి! అసలిదంతా నీ కెందుకంటే చెప్పడం– మనిషికే ఆయుర్దాయాన్ని అనవసరంగా ఎక్కువ పెట్టావని! నీవు చేసిన ఈ పనివల్ల ఎంతటి అనర్థం కలిగిందో తెలుసుకోవా లంటే, ప్రపంచ గతాన్నోసారి గుర్తు చేసుకో! అదేదో దేశంలోని ఆదిమానవులు బలమున్నంత కాలం వేటాడి మాంసభక్షకులుగా జీవించేవారు శీతా కాలంలో ఆ వేట కూడా కరువైన రోజుల్లో, ఏ పనీ చేసి ఆహారాన్ని సంపాదించలేని ముసలివాళ్లను పోషించలేక, మంచు టిడారుల్లో తోడేళ్లకు ఆహారంగా వదలి పోయేవాళ్ళు, ఆకాలంలో నరమాంసం కూడా తినేవాళ్ళు ఏమనిషికైనా చిన్న తల వెంట్రుక నెరిసిందంటే, వాడ్ని కాల్చుకుని, చక్కగా లొట్టలేసుకుంటూ విందారగించేవారు'–

తన మాటలు వినలేక శివుడు చెవులు మూసుకున్నట్లు కనిపించింది శేఖరానికి – 'ఒరే పాపీ! చీకటి దేశాల గతాన్నెందుకు రాతల్చుకుంటావు ఎన్నో వేల ఏళ్ల వెలుగు చరిత గల, నీ దేశాన్ని తల్చుకో! ఈ పుణ్యభూమి నీ పూర్వీకుల ఘర్మజలంతో తడిసింది ఈ నేల, ధర్మం నాలుగు పాదాల నడిచింది!'

తన పూర్వీకుల గూర్చి శివుడు ఘనంగా చెబుతుంటే శేఖరం ఆనందించలేదు మరింత రెచ్చిపోయాడు– 'చాలు, చాల్లేవయ్యా! మహా చెప్పొచ్చావు నాదేశం గూర్చి నా పూర్వీకుల గూర్చి, నాకన్నా నీకే ఎక్కువ తెలుసంటే, నేనొప్పుకోను ఇక్కడ హత్యల్నీ – ఆత్మహత్యల్నీ దేవుడి పేరుతో చట్ట బద్ధంచేసి, అతి తెలివిగా ధర్మ శాస్త్రాలు వల్లించారు నాకు తెలీకడుగుతాను శివుడూ– నీ గుడి గోపురం మీంచి హరోం– హరా' అని దూకి చస్తే శివసాయుజ్యం వస్తుందా? ఈ దేశంలో శైవులూ – వైష్ణవులూ కొట్టుకు చావడం నేనెరగనిదా? మొగుడు పోతే, మొగుడితో పాటు పెళ్లాన్ని కాల్చి పరలోక సౌఖ్యాలున్నాయని నమ్మింప చూస్తే నేనెలా నమ్మేది? ఎన్ని నరబలులు? ఎన్ని ఘోరాలు??– తమ సరదాలకోసం – ఎంతమంది జోగినులను, ఎంతమంది బసివిలను– మరింకెంత మంది దేవదాసీలను ఈ దేశం సృష్టించుకో లేదు? ఒకే దేశాన్ని ముక్క ముక్కలుగా చీల్చి రాజ్యకాంక్షతో ఎంత రక్తతర్పణ జరపలేదు? యుద్ధోన్మాదంతో, కామంతో ఎందరు తమ స్వప్రయోజనాలకోసం సామాన్య ప్రజల బతుకులతో చెలగాటా లాడలేదు? కరువులూ కాటకాలూ, రోగాలూ రొచ్చులూ ఎన్నిమార్లు ఈ దేశాన్ని కుదిపి పారెయ్యలేదు? రాజ దండనలు ఒకపక్కా, దోపిడీ దొంగల దారుణ హత్యలు మరో పక్కా విలయ తాండవం చేసి ఈ దేశాన్ని ఓ నరక కూపం చేయలేదూ! కుల, మత, భాషా భేదాలు ఎన్ని మార్లు తలెత్తి ఎంత జీవహింస జరగలేదు? ఈ విధమైన గొడవల వల్ల ఈ దేశపు జనాభా ఎప్పుడూ తగ్గివుండేది దానికి తగ్గట్టుగానే, నీపేరు చెప్పుకుని కటిక ఉపవాసాలూ, చాంద్రాయణాలూ చేసి తిండి గింజలను ఆమర్నాటికీ – ఆపై రోజుకూ మిగిల్చేవారు

మరో ముఖ్యవిషయం దేవుడూ! నీకు తెలుసుగా ఈ దేశంలో ఆశ్రమధర్మాలని నాలుగుండేవి ఆ నాలుగో ఆశ్రమం ఏమిటనుకున్నావ్? 'వాన ప్రస్థాశ్రమం'– అంటే ఆత్మహత్యాశ్రమం!' పిల్లల పెళ్లిళ్ళు చేసి అన్నీ వదలుకుని అడవులట్టి పోయేవారు ఎందుకు? ఇంకా వుంటే పిల్లలు ముసిలాళ్లని సరిగ్గా చూడరు వాళ్ళకే తిండికి సరిపోక పోతే ఇంక తమకేం పెడతారు? అందుకే తమ గౌరవాన్ని కాపాడుకుంటూ కృష్ణా!– రామా!! అంటూ అడవిదారి పట్టేవారు అక్కడ ఏ అడివి జంతువుకో ఆహారంగా మారిపోయే వారు పోయిన వాళ్ళు పోగా మిగిలిన వాళ్ళు ఏ పాకో వేసుకుని , అరుగుదల లేక ఆకులలములో, మిగల ముగ్గిన పళ్ళో తిని చచ్చే దాకా కాలక్షేపం చేసేవారు పాండవులేం చేశారో చెప్పవయ్యా శివుడూ?! 'స్వర్గం – స్వర్గం !!' అంటూ కొండెక్కారు కొండ కొసన స్వర్గముందా? కొండ మీంచి జారిపడి ప్రాణాలొదిలి స్వర్గం చేరుకున్నారు! రాముడేం చేశాడు? సరయూ నదిలో దిగిపోయి ప్రాయోపవేశం చేశాడు ఇవన్నీ చూస్తే పిచ్చి వాళ్ల స్వర్గాలనాలా? లేక ఆత్మహత్య లనాలా?! నువ్వే చెప్పు నువ్వేం చెప్పలేవు గానీ, అందుకే, నేను చెప్పి నట్లు చెయ్యి! పెద్దవాళ్ళు పక్కకు తప్పుకుని యువకులకు అవకాశ మివ్వడం అనాదిగా వస్తున్న ఆనవాయితీ ప్రభుత్వం యాభై ఎనిమిదేళ్ళు నిండిన వాళ్లని ఉద్యోగ బాధ్యతల్నించి తప్పించి యింటికి పంపిస్తోంది అటువంటప్పుడు మనిషి ఆయుర్దాయాన్ని కుదించడంలో తప్పు లేదు అందుకే, దేవుడూ! నా మాట విని మా నాన్నను తీసుకుపో! నువ్వు నాకు తండ్రివి మా నాన్నకూ తండ్రివే! అలాగే, మా తాతకూ తండ్రివే!! అటువంటి జగజ్జనకుడివి



నువ్వుండగా ఇంక నాకు నాన్నతో పనేమిటి? అందుకే ఆయన్ను తీసుకుపో!!'

'ముసలితనంలో నువ్వు ఆదుకుంటావని, ఎన్నో ఆశలతో నిన్ను పెంచిన నీ తండ్రిని నువ్వు చచ్చిపొమ్మంటం నాకేం బాగాలేదు పైగా నీపై రోత కలుగుతోంది! ఈ రోజు మీ నాన్నని చచ్చి పొమ్మన్న వాడివి రేపు నన్నూ చచ్చిపొమ్మంటావు. నీకు నీవుగా బతకడం నేర్చుకుని నీ తండ్రికి ఆసరాగా నిలబడు!!'– అన్నాడు శివుడు

'ఏదో సామెత చెప్పినట్టుంది ఆయనే వుంటే మంగలాడెందుకన్నట్టు – ఆకనీస ఆసరావుండి బతగ్గలిగితే మా నాన్నని తీసి కెళ్ళమని ఎందు కంటానయ్యా బాబూ? చేతనైతే నువ్వో సారి ఈ దేశంలో పుట్టి, లంచం గానీ రికమెండేషన్ గానీ లేకుండా ఉద్యోగం సంపాదించు అప్పుడు తెలుస్తుంది నీకు నా బాధేమిటో ?! మరో విషయం దేవుడూ! ఇప్పుడు నాకుద్యోగం రాకపోతే, నేను ప్రేమించిన నాకమల నాక్కాకుండా పోతుంది!అప్పుడు, ఆతర్వాత వుద్యోగం వచ్చినా, నాకు నచ్చని పిల్లతో జీవితాంతం సంసార యాత్ర సాగించాలి అందుకే దేవుడూ! ప్లీజ్! నా మొరాలించి మా నాన్నను తీసుకుపో!

పరమ శివుడు కోపంతో ఊగిపోయాడు చేతిలోని త్రిశూలం తిప్పుతూ కరాళనృత్యం చేశాడు – నా మూడో కన్ను తెరిచి నిన్ను భస్మం చేసేస్తా! ప్రేమ మైకంలో పడి, నీ నాన్న రక్తాన్ని నీకమల పాధాల పారాణి చేసుకోవాలనుకున్నావా నీచుడా! నేనంటే ఏమనుకుంటున్నావ్? నా మూడోకంటితో మన్మధుడ్ని బూడిద చేశాను కామదహనం చేసి వైరాగ్యాన్ని బోధించాను ప్రేమలోపడి బ్రహ్మచర్య విలువల్ని మర్చిపోకు!!'

శివుడి కోపాన్ని చూసిన శేఖరానికి నవ్వాగలేదు పగలబడి నవ్వాడు మళ్ళీ మళ్ళీ నవ్వాడు. ఇంకా– ఇంకా నవ్వుతున్నాడు.

శివుడు గర్జించాడు 'ఎందుకలా నవ్వుతావు?!'

శేఖరం అతికష్టం మీద నవ్వునాపుకుంటూ చెప్పాడు–, 'స్వామీ! మాదేశంలోని మహా మంత్రుల్లాగే తమరు కూడా నీతులు యితరులకే బోధిస్తారు గానీ, తాము పాటించరనుకుంటాను లేకపోతే, తమకు ఒక్కరు కాదు ఇద్దరు కావల్సొచ్చారు– పెళ్ళాలు! వారిద్దరే కాకుండా తమరి కింకెన్ని భాగోతాలు? తమరెన్ని భాగోతాలాడినా తమ పిల్లల్ని మాత్రం బ్రహ్మచారి ముండావాళ్ళని చేసి కూచో బెట్టారు వాళ్ళు అమాయకులు కాబట్టి నోరు మూసుక్కూర్చు న్నారు నేను మాత్రం అలా నోరు మూసుకోను నీకున్నన్ని భాగోతాలు నాకొద్దు! నాకమలొక్కర్తే నాకుంటే చాలు అందుకే, మారు మాట్లాడకుండా మానాన్నను తీసుకెళ్ళు తీసికెళ్తావా లేదా?!'– హుంకరించాడు శేఖరం.

"నేనేమైనా నీ బంటునా? నువ్వు చెప్పినట్టల్లా చెయ్యడానికి?' – కసురుకున్నాడు శివుడు

'సరే! నువ్వు చేసేదేమిటి? ఆపని నేనే చేస్తాను చేతనైతే నీవు మా నాన్నను చావునించి కాపాడు నాకు తెలుసు నువ్వు కాపాడలేవు మరో పది రోజుల్లో మా నాన్న రిటయిరవుతాడు అలా ఆయన రిటయిరవడానికి వీల్లేదు ఈ లోపునే ఆయన చావాలి ఆయన్ని ఎలా చంపాలో నాకు తెలుసు మా నాన్న దయాబిటిక్ పేషెంటు ఆయనకు రోజూ ఇన్సులిన్ ఇంజక్షన్ నేనే చేస్తాను డోసు బాగా పెంచి ఇంజక్షను చేస్తే సరి! దయాబిటిక్ కోమాలో కన్ను మూస్తాడు ఎవ్వరికీ అనుమానం రాదు నువ్వే చూస్తావుగా! నేనాయన్ని నీదగ్గరకెలా పంపిస్తానో!!–'

ఆకాలంలో తాను ఇచ్చిన వరానికి తానే భయపడి భస్మాసురుడికి దూరంగా పారి పోయిన శివుడు, ఈ కాలంలో 'ఇన్సులిన్ ఆయుధం చేతిలో వున్న శేఖరానికి భయపడకుండా వుంటాడా? అందుకే, అప్పటి దాకా శేఖరం మనోనేత్రం ముందున్న శివుడు మాయమయ్యాడు




గతంలో రాజ్య కాంక్షతో తండ్రిని చంపిన తనయులున్నారు. ఇప్పుడు తండ్రి సమాధిపై తమ జీవన సౌధాల్ని కట్టుకునే తనయులు చరిత్ర కెక్కుతారు దేవుడిచ్చిన వరంగా భావిస్తూ, అతిగా పిల్లల్ని కని, ఆ పుట్టిన పిల్లల భవిష్యత్తును అంధకార బంధురం చేసే పెద్దలకు కనువిప్పు కలిగేలా, రాబోయే కాలంలో ఊరూరా తలిదండ్రుల సమాదులపై వారి పిల్లల సౌధాలులేస్తాయి!!

శేఖరం శివాలయంలోంచి బైటపడ్డాడు అతని కళ్ళముందు రాబోయే వుద్యోగం ఓ పక్కా, కాబోయే పెళ్ళాం కమల మరోపక్కా చేతులు చాస్తూ ఆహ్వానిస్తున్నట్టుగా వుంది భావిలో పొందే సౌఖ్యం అతని కళ్ళముందు కదలి ఆనందోద్రేకంతో అతను ఊగి పోతున్నాడు ఉన్మత్తతతో, ఉత్తేజంతో యింటి దోవ పట్టాడు

అప్పటికే రాత్రి పదిగంటలు కావస్తోంది! రోడ్డు నిర్మానుష్యంగా వుంది! ఎక్కడో దూరంగా తీతువు పిట్ట కూసింది. ఓయింటి నడి కొప్పున కూర్చున్న గుడ్డి గూబ శేఖరం కేసి మిర్రి మిర్రి చూస్తోంది. గబ్బిల మొకటి వేట కోసం బయల్దేరి శేఖరం తల మీద ముమ్మారు ప్రదక్షిణం చేసి ఎటో వెళ్ళి పోయింది రోడ్డు వారనున్న ఊరకుక్క శేఖరాన్ని చూసి 'భవ్వు' మంది ఆ కుక్క అరుపుకు ఈ లోకంలోకి వచ్చి పడ్డ శేఖరం కోపంగా రోడ్డు పక్క రాయి తీసి కుక్క పైకి విసిరాడు. ఆ కుక్క తన అరుపుతో మరింత విజృంభించి మరిన్ని కుక్కలను తోడు తెచ్చుకుంది అవన్నీ కలసి బృందగానం చేసి, ఆ పైన దీర్ఘ సప్తమరాగం ఆలపించాయి. శేఖరం వాటిని తిట్టుకుంటూ వేగంగా ఎదరకు నడిచాడు ఇంటి దూరం తగ్గుతున్న కొద్దీ శేఖరం నడక వేగం కూడా తగ్గడం మొదలైంది. అడుగు తీసి అడుగు వెయ్యడం ఎంతో కష్టంగా వుంది శరీరంలోని బలమంతా ఏమైందో అర్థం కావటంలే దు ముఖమంతా చెమటపట్టింది సన్నని వణుకుతో కాళ్ళు తడబడుతున్నాయి

శేఖరం సందుమలుపు తిరిగాడు కను చూపు మేరలో ఇల్లు కనిపిస్తోంది ఇంటి ముందు దీపాలు వెలుగుతున్నాయి అక్కడ ఎంతో మంది జనం గుమిగూడి వున్నారు శేఖరానికి గుండెదడ హెచ్చింది! కాళ్ళు పట్టు తప్పుతున్నాయి 'ఏమైంది? తనింట్లో ఏమైంది?' విపరీత మైన ఆందోళన! 'భగవాన్! నాయింట్లో ఏమీ కానివ్వకు నేనీ బాధను తట్టుకోలేను!' ఇప్పుడు శేఖరం మనస్సు క్షణం క్రితం అతనూహించుకున్నట్టుగా లేదు ఎలా నడిచాడో, తన యింటి దాకా ఎల్లా వచ్చాడో అతనికే తెలీదు

ఇంటిముందు అమ్మా – చెల్లెళ్ళ ఏడుపులు, వాళ్ళ ముందు జీవచ్ఛవంలా పడివున్న తండ్రి!!

'నాన్నా' నాన్నా!! ఏమైంది నాన్నా!? అమ్మా! ఏవిటమ్మా ఇది !?'– బావురుమన్నాడు శేఖరం

'ఒరేయ్ నాయనా శేఖరం! రోజూ ఇన్సులిన్

# ఈ వేమన పద్యాలు













మాటల మాటలు వచ్చును
మాటలనే గలుగు చుండు మణిమంత్రంబుల్
మాటల పొందిక దెలసిన
మాటలనే ముక్తి గలుగు మహిలో వేమ.

ఇంజక్షను చేసే నువ్వు యింటి పట్టునలేవు ఏమైందో ఏమోమరి ఆయనకు ఆయనే ఇంజక్షన్ చేసుకున్నారు నేను వంటింట్లో పనులు పూర్తి చేసుకుని. గదిలో కెళ్ళి చూస్తే ఆయనీ పరిస్థితిలో వున్నారు–' వెక్కి వెక్కి ఏడుస్తూ చెప్పింది అమ్మ' ఇక చెల్లెళ్ళ ఏడుపుల గూర్చి చెప్పనే అక్కర్లేదు

"ఊహూ! నాన్న బతకాలి! బతికి తీరాలి" భగవాన్? ఇప్పుడేందారి?' – శేఖరం మదిలో ఓ ఆలోచన తళుక్కుమంది ఇంట్లోకి పరిగెట్టాడు పంచదార గుప్పిటతో తెచ్చి తండ్రి నోట్లో వేసి నీళ్ళు పోశాడు 'భగవాన్! నా తండ్రిని కాపాడు' కాపాడు"

అటువంటి ఆపదసమయాల్లో అప్తులకన్నా బయటి వాళ్ళకి ఎక్కువగా ఆలోచనలు తడతాయి ఆ వీధిలో ఎవరో అంబులెన్సుకు ఫోను చేశారు

## నాన్నా! నువ్వు చచ్చిపో!!

అంబులెన్సు వచ్చి గుమ్మం ముందు ఆగింది అందులోకి తండ్రి శరీరాన్ని జాగ్రత్తగా చేర వేసి, క్షణాల్లో అందరూ ఆస్పత్రికి వెళ్ళారు

ఆస్పత్రి దగ్గర క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి కోమాలో వున్న పరంధామయ్య గారికి డాక్టర్లు గ్లూకోజు ఎక్కిస్తున్నారు

శేఖరానికి ఇప్పుడు , నాన్న చచ్చి పోతే తనకు ఉద్యోగం వస్తుందనే ఆలోచన లేదు అతని మనస్సు ఒక్కటే మాట అంటోంది– 'నాన్న బతకాలి' తనను ఎంతో ప్రేమగా పెంచిన నాన్న, ప్రాణాధికంగా చూసుకున్న నాన్న, తనకోసం అష్ట కష్టాలూ పడ్డ నాన్న బతకాలి! బతికి తీరాలి ఆయన బతికి – తాను చచ్చినా ఫరవాలేదు. ఆయన బతుకుతే శివుడికి రుద్రాభిషేకం చేయించాలి!! ఈ లోకంలో రిక్షాతొక్కి బతకచ్చు. కిళ్ళీ కొట్టు పెట్టి బతకచ్చు. రొడ్డు పక్క జిళ్ళు అమ్ముకుని బతకొచ్చు ప్రభుత్వ ఉద్యోగం ఉన్నా, లేకపోయినా పరవాలేదు నలుగురికి ట్యూషన్లు చెప్పుకుని పొట్ట పోసుకుంటూ ఇంటిల్లపాదినీ పోషించవచ్చు కాని కాని నాన్న పోతే మళ్ళీ తిరిగి రాడు నాకు నాన్నే కావాలి' దేవుడూ – నాకు నాన్నే కావాలి!"

ఆస్పత్రి గోడగడియారం రెండు గంటలు కొట్టింది పరందామయ్య గారు ఇహలోకంలో కొచ్చి పడ్డారు మెల్లగా కళ్ళు తెరిచి నాలుగు పక్కలా చూశారు

డాక్టరు ముఖంలో విజయగర్వం తొణికిస లాడింది ఆనందంగా చెప్పాడు – 'మీ కుటుంబ సభ్యులందరూ చాలా అదృష్టవంతులు సరియైన సమయానికి ఆస్పత్రికి తీసుకొచ్చారు. గండం గడిచి పోయింది ఇంకే ప్రమాదం లేదు పరంధామయ్య గారూ! మీ అబ్బాయి తెలివిగా మీ నోట్లో కొద్దిగా పంచదార వేశాడు ఎనీహౌ ఇకముందు మీ రెప్పుడూ స్వంతంగా ఇంజక్షన్ చేసుకోకండి!" డాక్టరుగారి మాటలకు. పరంధామయ్యగారి కనుకొలకుల్లోంచి రెండు కన్నీటి బొట్లు రాలాయి ఆయన కళ్ళు శేఖరం కేసి ఆప్యాయంగా చూశాయి

శేఖరం తండ్రి దగ్గర కెళ్ళాడు ఆయన చేతిని మెల్లగా స్పృశించి డగ్గుత్తికతో– 'నాన్నా' ఇప్పుడెలావుంది?', అన్నాడు

కొడుకును ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని తడిమాడు పరంధామయ్య! ఆతర్వాత మెల్లగా అన్నాడు, 'నాన్నా' నువ్వు నన్ను బతికించావా? నా మీద నీ కెందుకురా యింత ప్రేమ? నేను నీ భవిష్యత్తుకోసం, నీ చెల్లెళ్ల భవిష్యత్తు కోసం, ఎంతో ఆలోచించి, చివరికీ నిర్ణయానికొచ్చి, కావాలనే ఇన్సులిన్ మోతాదు ఎక్కువ తీసుకున్నానురా! నేను చచ్చి పోయాక వచ్చే డబ్బుతో చెల్లెళ్ల పెళ్లిళ్ళు చేస్తావనీ, మీ అమ్మ ఫామిలీ పెన్షను డబ్బుతో బతికెయ్యగలదనీ, ఇంక నువ్వు నా ఉద్యోగం సంపాదించుకుని, పెళ్ళి చేసుకుని సుఖంగా పది కాలాలపాటు బతుకుతావనే ఈ పని చేశానా! నన్ను క్షమించు నీకు నా మీదున్న ప్రేమ, ఇకముందు , నన్నా పని చెయ్యనివ్వదు

కన్నీళ్ళు జలజలా రాలుతుండగా, తండ్రి చెప్పిన మాటలకు శేఖరం మనసులోని బాధను ఆపుకోలేక పోయాడు తండ్రి చేతుల్లోంచి మెల్లగా తప్పుకున్నాడు!

'నాన్నా' నువ్విచ్చే గౌరవానికి నేను అనర్హుడ్ని నాన్నా" – నువ్వెంత మంచి వాడివి నాన్నా' నా భవిష్యత్తు కోసం నీ ప్రాణాన్నే త్యాగం చేద్దామనుకున్నావా నాన్నా?' అటువంటి అనురాగ మూర్తివైన నిన్ను చంపి, వృద్ధిలోకి రావాలనుకున్న నేనెంతటి మూర్ఖుడ్ని?!', తండ్రి మంచానికి తల బాదుకుంటూ గుండెలవిసేలా శేఖరం మనసులోనే మూగగా రోదించాడు. □

# హైదరాబాద్ నోట్‌బుక్

## ప్రతి బడికీ బాల సరస్వతీ పీఠం

మంచి పుస్తకం మంచి నేస్తమన్నారు పెద్దలు ఒక దీపం సాయంతో వందలాది దీపాలు వెలిగించినట్టు ఒక మంచి పుస్తకం చదివించి వేలాది పిల్లల భవిష్యత్తును సుందరంగా తీర్చిదిద్దవచ్చు మంచి పుస్తకాలు చదివే అలవాటు జ్ఞానేంద్రియాన్ని తెరిపిస్తుంది. కొత్త జీవితానికి మార్గం చూపుతుంది చదివే అలవాటు నేర్చుకుంటే వస్తుంది. సాధనచేస్తే పెరుగుతుంది. పిల్లలకు చదువు ఒంటబట్టడానికి పాఠ్య పుస్తకాలతో పాటు పిల్లల పుస్తకాలు కూడ చదువాలి పిల్లల శరీరారోగ్యానికి ఆటలు ఎంత అవసరమో వారి మానసికారోగ్యం పెంపొందడానికి మంచి పుస్తకాలు చదివే అలవాటూ అంత అవసరం. చదువుపట్ల ఆసక్తి పెంచేవి పిల్లల పుస్తకాలు పాఠ్య పుస్తకాలు మినహా ఇతర పుస్తకాలు చదవరాదని చెప్పడం పిల్లల అభివృద్ధికి భంగకరం మంచి పుస్తకాలు ఎన్నికచేసి పిల్లలతో చదివించే అలవాటు చేయడంలో ఉపాధ్యాయులు, తలిదండ్రులు సహకరించి ప్రోత్సహించాలి ఈ ప్రోత్సాహం ఇంటా బయటా ఉండాలి ఈ దృష్టితో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమి "ప్రతి బడికీ బాల సరస్వతీ పీఠం" అనే నూతన పథకం ప్రారంభించింది ఈ పథకానికి ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు క్రోధన సంవత్సరం ఉగాది సందర్భంగా 1985 మార్చి 22 వ తేదీన లాంఛనంగా ప్రారంభోత్సవం చేసి అయిదుగురు పాఠశాలా ప్రధానోపాధ్యాయులకు బాల సరస్వతీ పేటికలను అందజేశారు ఈ పథకం భారతదేశంలోనే సరికొత్తది అక్షయ ఉగాది నుంచి - 1986 ఏప్రిల్ 10 నుంచి రాష్ట్రమంతటా ఇది అమలులో వుంది ఈ పథకం క్రింద బాలల అకాడెమి ప్రతి పాఠశాలకూ పైన పేర్కొన్న బాల సరస్వతీ పేటికను పంపుతుంది దీనిలో రంగు రంగుల బొమ్మలతో ఉన్న పిల్లల పుస్తకాలు. పాటల క్యాసెట్లు వివిధ వయో వర్గాలకు అనుగుణంగా ఉంటాయి దీని వెల సంవత్సరానికి 86 రూపాయలు మాత్రమే రాష్ట్ర ప్రభుత్వం ఈ పథకాన్ని ఆమోదించి, అమలు పరచమని ఉత్తరువులు జారీ చేయడమేకాక, దానికి అవసరమైన నిధులను కూడ సమకూర్చింది నిజానికి రాష్ట్రంలో ప్రాథమిక, మాధ్యమిక స్థాయి పిల్లలకు చదువుకోడానికి తగిన పుస్తకాలు లేవు ప్రైవేటు పుస్తక ప్రచురణకర్తలు విభిన్న వయో వర్గాల పిల్లలకు తగిన పుస్తకాలు మొదలయిన వాటిని ప్రచురించడానికి ముందుకు రావడంలేదు, వాటిని ప్రచురించడం వ్యయ సాధ్యం గనుక ప్రచురించిన పుస్తకాలను కూడ రాష్ట్రం మారుమూల ప్రాంతాలకు ప్రచురణ వెంటనే పంపడం కూడ మరొక సమస్య అందువల్ల బాలల అకాడెమివంటి ప్రభుత్వ సంస్థ ఈపనికి పూనుకోవలసి వచ్చింది మొదట రాష్ట్రంలోని ప్రతి రెవెన్యూ మండలంలోను నాలుగైదు ప్రాథమిక, అప్పర్ ప్రైమరీ పాఠశాలలలో దీనిని అమలు పరచారు ఈవిధంగా మొదటి దశలో దాదాపు 5000 పాఠశాలలకు ఈ పథకం వర్తించింది ఈ బాల సరస్వతీ పేటికలను జిల్లా విద్యా శాఖాధికారుల ద్వారా అందజేస్తారు ఈ విద్యా సాధనాలవల్ల మన జాతికి అనుగుణంగా తెలుగు సాంస్కృతిక భావన, జాతీయభావన పిల్లలలో ఎంతవరకు కలుగుతాయో తెలుసుకొనడానికి పరిశీలనలు కూడ జరుగుతాయి ఒక ప్రశ్నావళిని పంపి అభివృద్ధి ప్రగతిని తెలుసుకోడం జరుగుతుంది ప్రస్తుతం పూర్వ ప్రాథమిక దశలో (నర్సరీ దశలో) పరభాషలోని గేయాలు నూరిపోయడంవల్ల పిల్లలు మన సంస్కృతికి, సంప్రదాయానికి దూరం కావడం చూస్తూనేవున్నాం. ఈ పేటికలవల్ల చిన్న పిల్లలకు తెలుగు సంస్కృతికి, భారతీయ సంస్కృతికి సంబంధించిన బాల గేయాలు, చిన్నారి కథలు, అభినయ గీతాలు, అంకెలు - అక్షరాల పాటలు, జాతీయ గీతాలు, కోలాటం పాటలు, చిలక పలుకులు, ప్రీ రికార్డెడ్ కేసెట్లతో బాటు బొమ్మల పుస్తకాలతో పాటు అందుతున్నాయి పదకొండేళ్ల వయసుపైబడిన పిల్లల కోసం పాగదరా నీ తల్లి భూమి భారతిని, స్వరాజ్యం నా జన్మ హక్కు. ప్రముఖుల జీవిత చరిత్రలు, సామెతల కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, మర్యాద రామన్న కథలు, కనపడని శత్రువులు వంటి వైజ్ఞానిక రచనలు అందుతాయి వీటివల్ల పిల్లలపైపడిన విదేశీ గేయాల ప్రభావం తగ్గుతుంది స్వజాతి, సంస్కృతి సంప్రదాయాలపై మక్కువ కలుగుతుంది పిల్లలలో మంచి పుస్తకాలు చదివే అలవాటు, అభిరుచి, ఆసక్తి పెరుగుతాయి ఈ అనుషంగిక సాధనాలవల్ల పిల్లల అసలు చదువు రాణింపు కలిగి సార్థక మవుతుంది మరొక విషయం - ఈ గ్రంథాలయానికి గది గాని, భవనంగాని అవసరం లేదు ఈ పేటికను భద్రపరచడానికి ఒక బీరువాగాని, పెట్టె గాని ఉంటే చాలు అవీ లేకపోతే ఏ ఉపాధ్యాయుడైనా తనవద్ద దీనిని జాగ్రత్త చేసుకోవచ్చు ఉపాధ్యాయులు కొంచెం ఓపిక చూపాలి అతనికి సాంస్కృతిక కార్యక్రమాలపట్ల ఆసక్తి, పిల్లలపట్ల ప్రేమ, ఔదార్యం వుండాలి. పిల్లలను ఆట పాటల ద్వారా, కథా కథనం ద్వారా ఆహ్లాద పరచి, వారి అభిమానాన్ని చూరగొని లక్ష్యం నెరవేర్చాలి సంగీతజ్ఞానం గల ఉపాధ్యాయులు రాగయుక్తంగా ఈ గేయాలు పాడి, పిల్లలతో పాడించవచ్చు చిన్న కథలను చదివి వినిపించి వివరిస్తే పిల్లల మనస్సులో బలమైన ముద్ర పడుతుంది పిల్లలు విన్న, చదివిన కథలను గురించి ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టుకుంటే, వారి అవగాహన స్థాయి స్పష్టమౌతుంది ఇంతేకాక రక రకాల పోటీలు కూడ పెట్టవచ్చు ఈ పథకాన్ని పూర్తిగా అమలు జరిపినప్పుడు రాష్ట్రంలోని ప్రతి మారుమూల పాఠశాలకు చిట్టి గ్రంథాలయం ఏర్పడుతుంది పిల్లల మనస్సు వికసిస్తుంది ఇంతవరకు అకాడెమి రంగు రంగుల బొమ్మలతో 70 పుస్తకాలు ప్రచురించింది బాలచంద్రిక అనే పిల్లల మాస పత్రికను నిర్వహిస్తున్నది ఇది దాదాపు 50 వేల ప్రతుల ప్రచారంలో వుంది రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టి విజ్ఞానదాయక గ్రంథ ప్రచురణలో భాగంగా ఆంధ్ర నామ సంగ్రహాన్ని ఈ అకాడెమి ప్రచురించింది పది వేల ప్రతులు అమ్ముడు పోయాయి వివిధ గేయ నాటికా కథలతో 12 కేసెట్లు సిద్ధపరచింది పిల్లల విజ్ఞాన వినోద వికాసాలకోసం రాష్ట్ర బాలల అకాడెమి ప్రారంభించిన ఈ సరికొత్త పథకం మూడు పువ్వులు ఆరవై కాయలుగా విస్తరించాలని కోరుతున్నాను బాలల అకాడెమి కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్‌ను, శ్రీ బి ఏ శ్రీనివాసాచార్యులు, శ్రీ కామేశ్వరరావు మున్నగు అకాడెమి కార్యకర్తలను మనసారా అభినందిస్తున్నాను అనుషంగిక సాధనాలయిన - పుస్తకాలు కేసెట్లు మొదలయినవి కావాలని కోరేవారు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమి కార్యదర్శి (బర్కత్‌పురా, హైదరాబాద్-27) నుంచి తెప్పించుకోవచ్చు

## మలుపుల విస్తరణ :

జంట నగరాలలో రోడ్ల విస్తరణ చురుకుగా సాగుతున్నది ఇది రోడ్ల ప్రమాదాల నివారణకు చాల అవసరం కనుక హర్షించదగింది ఈ విస్తరణ ప్రధానమైన రోడ్లలో జరగాలి ఆబిడ్ రోడ్డులో గ్రామర్ స్కూలు కాంపౌండును కొంత లోపలికి నెట్టి తాజ్‌మహల్ హోటల్ ఎదుటి మలుపును వెడల్పు చేశారు బాగుంది. అలాగే ఆబిడ్‌లో గన్‌ఫౌండరీలోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ నుంచి రాష్ట్ర పురాతత్వశాఖ కార్యాలయావరణ వరకు వెడల్పు చేశారు తర్వాత జూనియర్ కాలేజీ ఆవరణ నుంచి చేశారు ఈ రెండింటిమధ్య మసీదు వుంది ఇది పూర్వపు లేపాక్షి ఎంపోరియం ఎదుట వుంది దీని ఆవరణ గోడ మలుపు ముందుకు చొచ్చుకొని వచ్చింది లోపల మసీదు భవనానికి ఆవరణ గోడకు మధ్య కనీసం 30, 40 అడుగుల స్థలం వుంది అధికారులు ఈ స్థలంలో కొంత న్యాయమైన ప్రతిఫలమిచ్చి తీసుకుని మలుపును వెనక్కి నెడితే రోడ్డు ప్రమాదాలు తగ్గుతాయి ఈ రోడ్డే కొన్ని వేల బస్సుల రహదారి కనుక అంతవరకు విశాలంగా వుండి ఇక్కడ బాటిల్ నెక్కులాగ సన్నగిల్లి ప్రమాదాలు కలిగే అవకాశం వుంది కనుక అధికారులు ఈ విషయంలో చర్య తీసుకొని ప్రజలకు హితం చేయగలరని విశ్వసిస్తున్నాను. మసీదు ప్రాంగణం చాలా విశాలంగా వుంది గనుక పది పదిహేను అడుగులు ప్రజా సౌకర్యం కోసం ఇవ్వడంలో ఎవరికీ ఆక్షేపణ వుండదు. ఉండరాదు ప్రజాస్వామ్యంలో ప్రజా సౌకర్యం ముఖ్యం ఇలాటి మలుపులు చాల ఉన్నాయి

## ఉపశ్రుతి :

భారతీయ కవులు ముగ్గురు తపస్సు చేశారు భగవంతుని గూర్చి భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు ఏమి వాంఛితం?— అనడిగాడు మొదటివారు పంజాబీ కవి నాకు నోబెల్ బహుమతి ఎప్పుడు వస్తుంది?"— అనడిగాడు ఇక వంద ఏళ్ళకు అన్నాడట భగవంతుడు రెండవ అతను తమిళ కవి నాకు ఎప్పుడు వస్తుంది నోబెల్ బహుమతి?" అనడిగాడు ఇక పదేళ్లలో అన్నాడట భగవంతుడు మూడవ కవి స్థానికుడు అదే ప్రశ్న వేశాడట భగవంతుని అతని ప్రశ్న వినగానే భగవంతుడు అదరిపడి పారిపోయాడట.

—తిరుమల రామచంద్ర

### పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## "జ్ఞానోదయం"

"సువర్ణా - సువర్ణా" భర్త పిలుపు విన్న సువర్ణ "వస్తున్నానండీ" అంటూ బయటకొచ్చింది. "ఏమిటి ఇంకా రెడీ కాలేదా నేను ఆఫీసు కెళ్ళేటప్పుడు చెప్పానుగా డాక్టర్ దగ్గరకెళ్దామని" కాస్త చిరాకుతోనే పలికాడు శేఖర్.

"ఓ - ఆ విషయం మర్చేపోయాను ఒక్క నిమిషమాగండి క్షణంలో రెడీ అయి వస్తాను" అంటూ లోనికెళ్ళింది సువర్ణ

ఇంతసేపు స్కూటర్ మీద కూర్చొనే మాట్లాడిన శేఖర్ ఆమె మాటలు విని హాలులోకి వచ్చి కూర్చున్నాడు

కాసేపాగిన తర్వాత "వెళ్దాం పదండి" అన్న పిలుపు విని స్కూటర్ స్టార్ట్ చేశాడు శేఖర్. ఇద్దరూ హాస్పిటల్‌కు వెళ్లారు డాక్టర్ పరీక్షచేసి తాను తండ్రి కాబోతున్నాడని చెప్పాడు అది ఒక ఆడపిల్లకు శేఖర్ ఆనందానికి హద్దులు లేవు. కాని సువర్ణ మాత్రం చాలా నీరసించిపోయింది ఇల్లు చేరగానే అడిగాడు శేఖర్. 'ఏమిటి సువర్ణా అలా ఉన్నావ్" అని

'ఏమండీ మిమ్మల్ని ఒ విషయం అడుగుతాను ఏమీ అనుకోరు కదా?

"ఛా - ఛా ఏమిటో అడుగు" అన్నాడు శేఖర్

"నేను ఎబార్షన్ చేయించుకుంటానండీ ఇపుడే ఒక ఆడపిల్ల మళ్ళీ ఆడపిల్లేనా ఒక మగపిల్లాడయితే బావుంటుందండీ అందుకేఈ నిర్ణయం తీసుకున్నాను అంది సువర్ణ

సువర్ణా! నీవు తీసుకున్న నిర్ణయం ఏం బావోలేదు. చదువుకున్న దానివి నువ్విలాగంటే ఎలా చెప్పు ఈ రోజుల్లో ఆడవాళ్ళు మగాళ్ళకంటే అన్ని రంగాల్లోనూ ముందంజ వేస్తున్నారు అన్నీ తెలిసిన నీవేఇలా చేయడం సమర్థించే విషయం కాదు' అని కాస్త కోపంతోనే వెళ్ళిపోయాడు శేఖర్ ఆ రాత్రి ఇద్దరూ భోంచేయలేదు

ఉదయం సువర్ణకు చెప్పకుండానే ఆఫీసుకెళ్ళిపోయాడు శేఖర్ సువర్ణ చేసేదిలేక కుర్చీలో జారగిలబడి కూర్చుంది

'సువర్ణా' చుట్టూ చూసింది సువర్ణ కాని ఆ ప్రదేశంలో ఎవరూ కనిపించలేదు

సువర్ణా' మళ్ళీ పిలుపు విని తలుపు తెరచి చూసింది కాని ఎవరూ లేరు

"నేనమ్మా! నీ కడుపులోని పాపని. ఏం సువర్ణా అని పిలిచాననే ఆశ్చర్యపోతున్నావా నీ బిడ్డగా కాక ఒకనాటి స్త్రీలా చెబుతున్నాను విను నీకు జన్మనిచ్చింది ఒక స్త్రీ నీవు ఒక స్త్రీకి జన్మనివ్వాలంటే ఎందుకు వెనుకంజ వేస్తున్నావ్?

అది కాదమ్మా ఇంకా ఏదో అనబోయింది సువర్ణ వెంటనే

'ఏది కాదు నువ్వు ఒక స్త్రీకి జన్మనివ్వడం తప్పా అమ్మా నువ్వు నాకు జన్మనివ్వు అంతే చాలు నేను బాగా చదువుకొని నా కాళ్ళమీద నేనే నిలబడగల్గుతాను నీవు నాకు సహాయం చేయవలసిన అవసరం లేదు" అంది కడుపులో వున్న పాప

"పాపా, ఇన్నాళ్ళు స్త్రీ ఈ సమాజంలో జీవించ లేదనుకున్నాను ఇప్పుడు అంతా తెలుసుకున్నానమ్మా తప్పకుండా నీకు తల్లినవుతానమ్మా' అంది సంతోషంగా

"థాంక్స్ అమ్మా ఇక మళ్ళీ 45 రోజులతర్వాత కలుస్తాను అంది పాప'

పాప మాటలు విని తనలో తాను నవ్వుకుంది శేఖర్ రాగానే జరిగిందంతా చెప్పింది

ఇప్పుడు కలిగిందన్న మాట జ్ఞానోదయం" అంటూ సువర్ణకు స్వీట్ తినిపించాడు శేఖర్

- సంతోష్‌సాగర్, సరూర్‌నగర్, హైదరాబాద్



* * *

## స్త్రీ లేనినాడు పురుషుని మనుగడ సాగేదెలా?

భార్యాభర్తల అనురాగ ఫలితముగా స్త్రీ గర్భము ధరిస్తుంది సృష్టికి స్త్రీపురుష లిరువురు అవసరం ఒక్క పురుషుడు లేదా ఒక స్త్రీ వలన సృష్టి కొనసాగదు సంసారమనే బండికి స్త్రీ పురుష లిరువురు రెండు చక్రములు ఏ చక్రము లేకపోయినా సంసారమనే బండి సాఫీగా ప్రయాణించలేదు నేడు లింగ నిర్ణయ పద్ధతుల ద్వారా మగ సంతానమయితే భూమి మీదకు ఆహ్వానించడము, ఆడ పిల్లయితే అబార్షన్ చేయించుకోవడమనేది జరుగుతున్నది ఇది అమానుషము సిగ్గుపడవలసిన విషయము

మానవుడికి రెండు కళ్ళూ సమానమే ఎడమ కన్ను ఎక్కువ, కుడి కన్ను తక్కువకాదు. ఏ ఒక్క కన్నుని పొడుచుకోలేదు. అదే విధంగా తల్లిదండ్రులకు ఆడ, మగ ఎవరయినా ఒక్కటే తల్లి ఏ పిల్లయినా నవమాసాలు మోసి కనవలసిందే ఇద్దరినీ ఒకేవిధంగాపెంచవలసినదే

నేటి సమాజములో స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాల వలన, వరకట్న దురాచారముల వలన, ఆడపిల్ల పుడితే భవిష్యత్తులో ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుందని ముందుగానే ఆడపిల్ల పుట్టకుండా జాగ్రత్త పడటం విచారించదగ్గ విషయం ఈ




విధంగా కొన్నాళ్ళు సాగితే మన దేశంలో స్త్రీలే కరువవుతారేమో? స్త్రీలు కరువు అయిననాడు? 'కార్యేషు దాసి, కరణేషు మంత్రి, భోజ్యేషు మాత, క్షమయా ధరిత్రి, రూపేచ లక్ష్మి, శయనేషు రంభ' అనునట్లు పురుషునికి అన్ని విధముల సహాయపడే స్త్రీ లేనినాడు పురుషుని మనుగడ సక్రమంగా సాగేదెలా?

మానవ జీవితం సుఖదుఃఖాల కలయిక సమస్యల మయము మానవుడు తనకొచ్చిన సమస్యలను ధైర్యంగా ఎదుర్కొనాలి కాని పిరికి వానిలా పారిపోకూడదు ఎప్పుడో కష్టములు వస్తాయని ఇప్పుడే జీవితమును అంతం చేసుకోలేము గదా! ఆడపిల్లల వలన భవిష్యత్‌లో సమస్యలు ఎదురవుతాయని ఆడపిల్లలకి జన్మనివ్వక పోవడం, బాధ్యతల నుండి పారిపోవడము కాదా? అదేనా మనకున్న సంస్కారము?

సమస్యలనేవి ఆడపిల్లలకే పరిమితమా? మగపిల్లలు మాత్రము

తల్లిదండ్రులకు సమస్యగా పరిణమించడము లేదా? మగపిల్లలయితే వృద్ధాప్యంలో, ఏదో ఉద్ధరిస్తారు ఆడపిల్లయితే పెళ్ళి చేసి పంపాలి అనే మనస్తత్వం చాలామంది తల్లిదండ్రులలో ఉంది నేడు ఎందరు మగపిల్లలు ముసలి వయసులో తల్లిదండ్రులను చేరదీస్తున్నారు? ఆడపిల్లలు మాత్రం తమ తల్లిదండ్రులకు చేయూత నివ్వడంలేదా?

ఆడపిల్ల 'అబల'కాదు 'సబల' అనే భావన ప్రతి తల్లిదండ్రులకు కలగాలి తమ పిల్లలకి వచ్చే సమస్యలను వారే ధైర్యంగా ఎదుర్కొనే మానసిక ధైర్యాన్ని, స్థైర్యాన్ని కలిగించాలి. మా అమ్మాయిలకి కట్నం ఇచ్చి పెళ్ళి చేయం మా అబ్బాయికి కట్నం పుచ్చుకోము' అని తల్లిదండ్రులందరు నిర్ణయించుకున్ననాడు ఈ 'వరకట్నం' అనేది పెద్ద సమస్యకానేకాదు

అందుకే

తల్లిదండ్రులూ'మీరూ ఆలోచించండి' ఆడపిల్లయినా, మగపిల్లయినా ఒకటే అందుకే"ఆడపిల్లని' మొగ్గలోనే త్రుంచి వేయక ఆనందంగా భూమి మీదకు ఆహ్వానించండి

- ఎస్. ఎల్. ఎన్. కుమారి,
హీరమండలం, (శ్రీకాకుళం)

★ ★ ★

# మల్లెలు విరిసిన ఉదయం



ఫైలుమీద పెన్ను బరువుగా కదులుతోంది ఆఫీసులోనే ఉన్నా రమేష్ ప్రస్తుతం ఆలోచనావస్థలో ఉన్నాడు మెదడును కందిరీగల్లా ముసురుకున్న ఆలోచనలతో అతను పోరాడుతున్నాడు. "కట్నం డబ్బు తేలేదని కాల్చి చంపాడు, మరో 'కట్నకఠోరం', భర్త కిరాతకం, చంద్రకళది ఆత్మహత్యకాదు భవిష్యత్తులో ఇలాంటి వార్తలలోకి ఎక్కే ఓ ఆడదాన్ని ఈ మాయదారి ప్రపంచంలోకి రాకుండా ఎలా చెయ్యాలా? అని ఆలోచిస్తున్నాడు అలా చేయడానికి మార్గాలాలోచిస్తున్నాడు. ఈ మార్గాన్వేషణలో పడి మరొక్కసారి గతం నెమరువేసుకోసాగాడు.

★ ★ ★

ప్రతీ సాయంత్రంలా ఆ సాయంత్రం కూడా రమేష్ మల్లెపూల పొట్లాంతో ఇల్లు చేరాడు అప్పటికి అతని శ్రీమతి సుగుణ. ·ఆమె అన్నయ్య ఆనంద్ సోఫాలో కూర్చొని ఏదో చర్చలో తల మునకలవుతున్నారు రమేష్ ఆగమనాన్ని గమనించి సుగుణ భర్తనాహ్వానించింది 'మీరు కూర్చొని మాట్లాడుకోండి కాఫీ కలుపుకొస్తానంటూ `వంటగదివైపు దారి తీసింది రమేష్ సోఫాలో ఆనంద్ ప్రక్కన కూలబడ్డాడు, పొట్లాం టీపాయ్ మీద పడేస్తూ పరస్పర క్షేమ సమాచారాలైనాక విషయానికొచ్చాడు ఆనంద్ "ఇటీవల బొంబాయి, ఢిల్లీలతోపాటు మన హైదరాబాద్‌లో 'ఏమ్నియో సెంటిసిస్' పరీక్షలు చేస్తున్నారు. దీనివల్ల గర్భస్థ శిశువుకు గల లోపాలు, రోగాలు తెలుస్తాయిట ఈ పరీక్షలు సాధారణంగా పిండం మూడు, నాల్గునెలల వయస్సులో చేస్తారట మన సుగుణకు నాల్గునెలలు కాబట్టి తీసుకువెళదాం' ఇదీ విషయం విషయం విని తలెత్తేసరికి చేతిలో కాఫీ ట్రేతో సుగుణ ఏమిటన్నట్లు చూసాడు రమేష్ కళ్ళతోనే అంగీకారం తెలిపింది సుగుణ

★ ★ ★

డాక్టర్‌కు ఆనంద్ విషయం వివరించాడు ఇక డాక్టర్ ఓ పెద్ద ఉపన్యాసం చేసేవాడిలా గొంతు సవరించుకొని మొదలుపెట్టాడిలా 'ఈ 'ఏమ్నియో సెంటిసిస్' పరీక్షలు గర్భస్థ శిశువుకు గల లోపాలు, వంశపారం పర్యంగా వచ్చే లోపాలు, రోగాలు తెలియచేస్తాయి. ఇవి చికిత్సకు లొంగేవైతే వైద్యం చేస్తాం లేదు. చికిత్సకు లొంగని తీవ్ర లోపాలుంటే గర్భస్రావం చేయించుకోమని జననీ జనకులకు సలహాలిస్తాం ఈ పరీక్షల ద్వారా ఈ వ్యాధులు తెలుసుకోవాలంటే ముందు గర్భస్థపిండం ఆడో, మగో తెలుసుకోవాలి తెలుస్తుంది కూడా కానీ ఈ పరీక్షలు శిశువు రోగాలు తెలుసుకోటానికి కాక లింగ నిర్ధారణకే వినియోగించి ఆడ శిశువైతే చంపేస్తున్నారు కానీ నేనిందుకు అంగీకరించను మీకు పుట్టబోయేది ఏ లోపంలేని ఆడశిశువని తేలితే అబార్షన్ చేయించుకోమని మాటిస్తే ఈ పరీక్షలు చేస్తాను ముగించాడు ముగ్గురిలో తీవ్ర తర్జన భర్జనల అనంతరం పరీక్షలు జరిగాయి పుట్టబోయేది 'ఏలోపంలేని ఆడపిల్ల'

★ ★ ★

అప్పుడు పరీక్షలు చేయించుకోవటానికి తాత్కాలికంగా ఒప్పుకున్నా తర్వాత ఆ వైద్యుని నిబంధనను పాటించదలచుకోలేదు రమేష్ ఎలాగైనా సుగుణ అబార్షన్ చేయించుకోవాలన్నాడు పెళ్ళయిన ఇన్నాళ్ళకి భర్త మాటకు ఎదురు తిరిగింది సుగుణ ససేమిరా ఒప్పుకోలేదు రమేష్ పట్టుదలా సడలలేదు

★ ★ ★

ఫ్లాష్ బ్యాక్‌లోంచి బైటపడిన రమేష్ ఆలోచనలోంచి బైటపడలేక పోతున్నాడు తన ఫైల్లో ఓ సినిమా అందులో సుగుణ గర్భంలోని ఆడపిల్ల టీచింగ్, మెడికల్‌వంటి వృత్తులకే పరిమితం కాక ఇంజనీరింగ్, ఆర్మీ, నావెల్, ఎయిర్‌ఫోర్స్, పోలీస్, ఫారెస్టరీవంటి క్లిష్టమైన, కీలకమైన శాఖలలో ప్రవేశించి విజయవంతమైన స్త్రీల గురించి, ఇంకా ఎంతో సాధించిన స్త్రీల గురించి, మొన్నటి సరోజినీ-నాయుడు, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ నిన్నటి ఇందిరాగాంధీ నేటి మదర్‌థెరీసా గురించి చెప్పింది కథలుగా చెప్పింది మాకేం తక్కువంది ఇంతలో డాక్టర్ ఆ శిశువు పీకనులిమేస్తున్నాడు క్రమంగా ఆ శిశువులో స్వర్గస్తురాలైన తనతల్లి రూపురేఖలు "ఒరే! రమేష్ బాబూ! నన్ను చంపేస్తున్నార్రా!' అని ఆక్రందన. ఫలితంగా రమేష్‌లో ఆవేదన తీవ్ర అంతరంగ మధనం

★ ★ ★

రమేష్ ఇంటికి చేరేటప్పటికి ఏకాంతంగా పడుకొని ఏదో ఆలోచిస్తోంది సుగుణ రమేష్ నెమ్మదిగా ఆమెకు ఏకాంత భంగం కాకుండా ఆమె ప్రక్కన బెడ్‌పై వ్రాలి చెవులో "సుగుణా! నువ్వు త్వరలో నా 'తల్లి'కి జన్మనీయబోతున్నావు" అనడానికి ఉద్యుక్తుడవుతున్నాడు. ప్రక్కన టేప్ రికార్డర్‌లోంచి వీనుల విందుగా గానం " ఇది మల్లెలు విరిసిన ఉదయం" . అంటూ సాగిపోతుంది

కె. ఆంజనేయకుమార్,
భోగాపురం □

కూపన్,

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు . ____________________

____________________

పూర్తి చిరునామా ____________________

పిన్ కోడ్ : ____________________

# డబుల్ సెంచరీ చేసుకున్న లార్డ్స్




లార్డ్స్ షాప్. క్రికెట్‌కి సంబంధించిన సమస్తం ఇందులో దొరుకుతాయి.

ప్రపంచ క్రికెట్ రంగమునకు "లార్డ్స్ క్రికెట్ గ్రౌండ్ మక్కా అనవచ్చు క్రికెట్ ఆటగాడు ప్రతి ఒక్కరు 'లార్డ్స్ క్రీడాంగణము లో ఆడాలి అనే కోరిక కలిగియుంటాడు అందుకు కారణము ఆ క్రీడా స్థలమునకు ప్రత్యేకత, ప్రపంచ అగ్రగామి క్రికెట్ ఆటగాళ్ళు ఆడిన ఆటస్థలము కావటమే ప్రముఖ క్రీడాంగణములే క్రీడాకారులకు 'ఆధునిక ఆరోగ్య కేంద్రాలు' ప్రపంచ క్రికెట్ చరిత్రకు లార్డ్స్ క్రీడాంగణమునకు ఎంతో అనుబంధము కలదు అగ్రగామి ఆంగ్లజట్టు యం సి సి కేంద్రము కూడా లార్డ్స్ బ్రిటిష్ క్రికెట్ ప్రమోటర్ థామస్ లార్డ్ పేర యీ క్రీడాంగణము నెలకొల్పబడినది 1814లో యీ క్రీడాంగణము సెయింట్ జాన్స్ వూర్ అనే ప్రదేశములో లండన్‌లో నెలకొల్పబడినది అంటే 172 ఏళ్ళ చరిత్ర కలిగిన క్రీడాంగణము లార్డ్స్ అంతకు ముందు 1787 నుండి 1810 వరకు యిప్పటి డార్‌సెట్ స్క్వేర్, 1809 నుండి 13 వరకు నార్త్ బ్యాంక్‌లలో యుండెడిది నేడు లార్డ్స్ క్రీడాస్థలములు స్థాపించి 200 ఏళ్ళు అయినది ఇది క్రీడా రంగములో మరువరాని అద్భుతము. ఇప్పటి లార్డ్స్‌లో ఆటస్థలము అయిదు ఎకరములు కలిగి క్రికెట్ ఆట మాత్రము ఆడుటకు అనువుగా, 34 వేల మంది ఆట తిలకించుటకు సదుపాయముగా ఉంటుంది

లార్డ్స్‌లో 'పెవిలియన్' 1890లో నిర్మించ బడినది లార్డ్స్ పెవిలియన్‌లో గల 'లాంగ్ రూమ్' ప్రముఖ క్రికెట్ క్రీడాకారులు కలుసుకునే స్థలము విందు జరిగే ప్రదేశము యం సి సి (మెరల్ బోన్ క్రికెట్ క్లబ్) కార్యాలయమే కాక, మిదిల్ సెక్స్ కౌంటీ క్రికెట్ క్లబ్ కూడా 1877 నుండి యిచ్చట యున్నవి. పెవిలియన్‌లో ప్రముఖులు ఆట తిలకించు సదుపాయమే గాక, వివిధ క్రికెట్ సమాఖ్యల కార్యాలయములు, కమిటీ గదులు, విందులకై ప్రత్యేక గదులు, డ్రెస్సింగ్ రూమ్స్, విశ్రాంతి గదులు కలవు పెవిలియన్ వెనుకగల 'రియల్ టెన్నీసు కోర్టు' వద్ద ప్రసిద్ధి చెందిన క్రికెట్ లైబ్రరీ కలదు మౌండ్ స్టాండ్ 1898-99, డబ్ల్యు. జి గ్రేస్ మెమోరియల్ గేట్స్ 1923లో నిర్మించబడినవి 1926 సీజన్‌లో గ్రాండ్ స్టాండ్, మెయిన్ స్కోరు బోర్డు ప్రారంభించబడ్డాయి. 1958లో వార్నర్ స్టాండ్‌ను సర్ పెల్ హం వార్నర్ ప్రారంభించారు ఇక్కడ పత్రికా విలేఖరులు, బ్రాడ్ కాస్టింగ్ బాక్స్‌లు కలవు. 1868 నుండి యుండిన 'టావరన్' 1967లో తొలగించ బడినది రెండు ప్రపంచ యుద్ధములలో ప్రాణములు కోల్పోయిన క్రికెట్ ఆటగాళ్ళ గుర్తుగా మెమోరియల్ గ్యాలరీ నిర్మించబడినది 1953లో దీనిని డ్యూక్ ఆఫ్ ఎడింబర్గ్ ప్రారంభించారు

లార్డ్స్‌లో మొట్ట మొదటి 'టెస్టు' పోటీ 1884 లో జరిగినది. అప్పటి నుండి ఇంగ్లాండు పర్యటించే జట్టులో లార్డ్స్‌లో 'టెస్టు' పోటీ ఆడుచున్నారు. 1973లో ఇంగ్లాండు, వెస్టిండీస్ మధ్య ఆడబడిన 'టెస్టు' పోటీ వలన 87,305 పౌనుల ఆదాయము వచ్చినది. ఇది ప్రపంచ క్రికెట్ రంగ వసూళ్ళ రికార్డు 1953లో ఇంగ్లాండు, ఆస్ట్రేలియా మధ్య ఆడిన టెస్టు పోటీని 1,37,915 తిలకించటం మరొక రికార్డు.

ఇక్కడ గల 'లార్డ్స్ షాప్'లో క్రికెట్ రంగానికి చెందిన అన్నీ లభిస్తాయి క్రికెట్ బంతులు, బ్యాటులు, దుస్తులే గాక క్రికెట్‌కు చెందిన అన్ని రకముల పుస్తకాలు విక్రయించబడతాయి.

ఇతర క్రీడా స్థలములకు 'లార్డ్స్'కు మధ్య ఎంతో బేధం ఉన్నది లార్డ్స్‌లో అభిమానుల కదలికకు ఆటంకం ఉండదు చుట్టు 'వైరు' ఉండదు. పోలీసు వారి అదుపు ఉండదు సరదాగా అక్కడ ఉన్న 'బార్'లో మందు కొని, పచ్చటి గడ్డిపై విశ్రాంతిగా ఉండి ఆట తిలకించే సదుపాయం ఉన్నది.

నేడు 'డబుల్ సెంచరీ' చేసుకొన్న 'లార్డ్స్' ఆటస్థలము యింకా ఎన్నో సెంచరీలు చేసుకొనే అవకాశం ఉన్నది.

–ముకరమ్



## ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

### శీర్షికలు

నటి శోభన ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో గర్భస్థ శిశువు చెప్పిన కథలు చాలా బాగున్నాయి.

–చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం

★ ★ ★

నటి 'శోభన' ముఖచిత్రం శోభాయమానంగా వుంది. 'క్షీప్పులు, క్షీప్పులు' వైద్య వ్యాసం విజ్ఞానదాయకంగా వుంది. ఈ వ్యాసం ప్రతి ఒక్కరికీ ఉపయోగపడేదిగా వుంది. ఒళ్ళు రాకుండా వుండడానికి రాజరాజేశ్వర శర్మగారు చెప్పిన ఆయుర్వేద చిట్కాలు విలువైనవిగా వున్నాయి. 'దొంగ మొగుళ్ళు' బాబుగారి కార్టూన్లు చాలా బాగున్నాయి. 'చిన్నారి బాలల దీనగాథలు' శీర్షిక థాట్ వందర్‌ఫుల్.

–ఐరేని శ్రీనివాస్‌గౌడ్, రామాయంపేట

### వ్యాసాలు

నటి "శోభ" ముఖ చిత్రంతో వెలువడిన 13-19 ఫిబ్రవరి, 1987 సంచిక అత్యంత రమణీయంగా వుంది. "క్షీప్పులు క్షీప్పులు క్షీప్పులొచ్చినయ్, ఊబకాయం రాకుండా వుండాలంటే" వ్యాసాలు విజ్ఞానదాయకంగా వున్నాయి.

–మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం ☐

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667